# కర్నూలు జిల్లా సంస్కృతి విశేషాలు

సంపాదకులు
జె. యస్. ఆర్. కె. శర్మ
జె. యస్. శ్యామసుందర శాస్త్రి



ప్రాచీన సాహిత్య పరిషత్
భారత్‌కుంజ్, 18/199-2,
బాలాజీ కాలనీ, సి.క్యాంపు,
కర్నూలు - 518 002

ప్రథమ ముద్రణ : – మే, 1997
వెల : 35:00
ప్రతులు : 1000

ప్రాచీన సాహిత్య పరిషత్
ప్రచురణ

ప్రతులకు
జె.యస్. ఆర్.కె. శర్మ
18-199/2, భారత్‌కుంజ్
బాలాజీకాలనీ
పి, క్యాంపు – కర్నూలు –2

ముద్రణ :
పి. రాఘవ రెడ్డి
జ్యోతి కంప్యూటర్ గ్రాఫిక్స్
40/301 సి4,
S.R.K. Complex,
Kurnool. Ph : 25479

# సహృదయ నైవేద్యం

సాహితీ ప్రియంభావుకులకు సహృదయ ప్రణామాలు! ‘‘కర్నూలు జిల్లా సంస్కృతి విశేషాలు’’ మీ చేతుల్లో ఉంచటానికి సాహసిస్తున్నాను. ఇందలి అంశాలు సంఖ్యాపరంగా అల్పం.

అమూల్యమైన వ్యాసాలిచ్చిన రచయితలకు అంజలి ఘటిస్తున్నాను ‘‘కర్నూలు జిల్లా రచయితల చరిత్ర’’ నుండి కొన్ని అంశాలు గ్రహించాము శ్రీ కె.యస్ యస్ రాజాగార్కి ఋణపడి ఉన్నాము అలానే ఆంధ్రప్రదేశ్ స్వాతంత్ర్య సమరయోధుల 15వ మహాసభల ప్రత్యేక సంచిక నుండి గ్రహించాము వారికి ధన్యవాదాలు సమర్పించుకొంటున్నాం విశ్వహిందూ పరిషత్ ‘‘కర్నూలు జిల్లా సమ్మేళన సంచిక’’ సౌజన్యాన్ని స్మరిస్తున్నాము

‘‘సుహృత్ స్పందన’’ నందించిన శ్రీ గండ్లూరి దత్తాత్రేయ శర్మగారి సుమధుర వచస్సులకు నమస్సులు

ఈ సంచిక ఈ రీతిలో ప్రచురించి వెలువరించటానికి సహకరించిన జ్యోతీ కంప్యూటర్ గ్రాఫిక్స్ యజమాని శ్రీ పి రాఘవ రెడ్డిగారు, వారి సహాయకులు తొలుతగా పేర్కొన తగినవారు. వారికి నా ఆశీస్సులు! ముఖపత్రాన్ని రూపొందించిన నరేంద్ర ప్రింటర్స్ శ్రీ రాఘవరెడ్డి గారికి కృతజ్ఞతలు

కర్నూలు –ఐ సి డి యస్ మానేజరు శ్రీ ఉమేశ్ మరియు వారి ఉద్యోగ బృందం ; డా॥గెల్వి సహదేవుడుగారు, కర్నూలు–భారతమాత సేవాసమితి, వీరి ఔదార్యాన్ని నేను మరువలేను శ్రీ యస్ పి వై రెడ్డి గారు నాకు సదా అండదండ! అన్నింటినీ మించి భారతమాత కృపాకటాక్షాలు, మీ అందరి ఆదరాభిమానాలు నాకు పెట్టని కోట. ఎందరో మహానుభావులు– అందరకు వందన చందనాలు!

27–4–97
ఈశ్వర, చైత్ర, బహుళ పంచమి,
ఆదివారం

సాహితీ సేవలో సదా భవదీయ
**జె.యస్.ఆర్.కె.శర్మ.**
18/199– భారత్‌కుంజ్ బాలాజీ కాలనీ
సి క్యాంపు, కర్నూలు –2

# సుహృత్స్పందన

అవధాన సరస్వతి, విద్వాన్
**గండ్లూరి దత్తాత్రేయ శర్మ**
శతావధాని, తెలుగుపండితులు, ద్రోణాచలం.

**నిరంతర సాహితీ కృషీవలుడు – ప్రాచీన సాహిత్య పరిషత్ కార్యదర్శి జె.యస్.ఆర్.కె. శర్మ–**

25–3–1944 ఉగాది పండుగరోజు ప్రకాశం జిల్లా తర్లుపాడులో కౌండిన్యస గోత్రీకులు, పుష్పగిరిపీఠ ఆగామ సభాపతుల వంశంలో జగర్లపూడి పుల్లయ్య, రాజ్యలక్ష్మమ్మల కడుపు పంటగా జన్మించారు ...ధ్యాయులు, క్రమశిక్షణకు జీవగర్ర అయిన తండ్రిగారు, కష్టజీవి బంధువుల తలలో నాలుకయైన మాతృమూర్తి ...పాటలు, పినతండ్రి, పినతల్లి, అప్పయ్య, సుందరమ్మల , రోశయ్య, గిరెమ్మల సంగీత సాహిత్య పరిజ్ఞానము ...గారిపై అపూర్వ ప్రభావం చూపాయి

1959లో పి యు.సి పాసైన 15వ ఏటనే తండ్రిగారు కీర్తి శేషులయ్యారు. 62లో సెకండరీ ఉపాధ్యాయశిక్షణ పొంది 1963లో హయ్యర్‌గ్రేడు ఉపాధ్యాయునిగా జీవితం ప్రారంభించారు. ఉపాధ్యాయ శిక్షణ కాలంలో సహపాఠి, దర్శి కమ్యూనిష్టు పార్టీ కార్యదర్శి శ్రీ రాచపూడి సుందర రావుగారు శర్మగారిని కార్యకర్తగా తీర్చిదిద్దారు 9వ యేట నుండి రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘ, కమ్యూనిష్టు సాహిత్యం, కరుణశ్రీ, ఘంటసాలలు శర్మగారి జీవితంపై ఎనలేని ప్రభావం చూపుతూవచ్చారు

ఒకవంక పురాణ కాలక్షేపాలు సాగిస్తూనే 1968 ప్రాంతంలో "పత్తికొండ ఉపాధ్యాయ సంఘం" ప్రారంభించి 10, 15 సంవత్సరాలుగా నిలువ ఉన్న బకాయీలను శ్రీ బి.కె రావు కలెక్టర్, శ్రీ డి. విక్టర్ డి.ఐ., గారి సాయంతో ఇప్పించి ఉపాధ్యాయ ఉద్యమ శీలియై జిల్లా "ఉపాధ్యాయ ఫెడరేషన్ మహాసభ" లను 1970లో 3రోజులు ఏర్పాటు చేసి శ్రీ సింగరాజు రామకృష్ణయ్య, అష్టావధాని మాచిరాజు శివరామరాజు; నాట్యాచార్య శ్రీ ఉమాశంకర్ గారిని సన్మానించారు లలిత కళారంగ ప్రవేశంచేశారు. మరొకవంక ప్రయివేటుగా యం.ఎ., బి.ఎడ్ చదివి ప్రథమ శ్రేణి తెలుగు పండితులై "పత్తికొండ– లలితకళాసమితి" ని ప్రారంభించి శ్రీ ఆశావాది ప్రకాశరావు గారిని కర్నూలు జిల్లాకు పరిచయం చేయటమే కాకుండా శ్రీ కలుగోట్ల విజయాత్రేయ, శ్రీ హెచ్ హీరాలాల్, శ్రీ అప్పజోడు వెంకట సుబ్బయ్య వంటి ఎందరో ప్రముఖుల సాహితీ సమావేశాలు ఏర్పరచారు ఈ విషయంలో నాటి పత్తికొండ జెడ్.పి ఉన్నత పాఠశాల ప్రధానోపాధ్యాయులు శ్రీ డి.యస్. పెద్దపుల్లయ్య శర్మ గారి ప్రతివర్ష సాంస్కృతిక సమావేశాలు స్ఫూర్తికాగా శ్రీ కె.సి.హెచ్. సుబ్బరాయుడు గారి అండదండలు లభించాయి.

1975లో మైసూరు దక్షిణ ప్రాంతీయ భాషా కేంద్రం నుండి "కన్నడ భాషలో డిప్లొమా" అందుకున్నారు డిస్టింక్షనుతో

1976లో "ఆలూరు లలిత కళా సమితి" ని స్థాపించి పంచాయత్ రాజ్ ఇంజనీరు శ్రీ యం హెచ్ వి సుబ్బారావు, సమితి అధ్యక్షులు శ్రీ వీరారెడ్డిగారి తోడ్పాటుతో శ్రీ సి నారాయణ రెడ్డి గారి ఆశీస్సులతో శ్రీ గండ్లూరి దత్తాత్రేయ శర్మగారల అవధానం మొదలగు కార్యక్రమాలతో ఆలూరును అలరించారు.

అత్యవసర పరిస్థితి లో ప్రజాస్వామ్యవాదిగా ప్రభుత్వాన్ని విమర్శిస్తూ అనేక కార్యక్రమాలు నిర్భీతిగా ఏర్పాటు చేశారు

1978లో ఆంధ్రప్రదేశ్ గురుకుల పాఠశాలకు ఎన్నికై హిందూపురంలో "కథా కల్పవాలయం" వంటి సాహిత్య ప్రయోగాలు చేయటమేకాక డిగ్రీ కళాశాలలో "భువన విజయు" నాటక ప్రయోక్తగా వ్యవహరించారు.

1980లో ఓర్వకల్లు జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలో శ్రీ గండ్లూరి దత్తాత్రేయ శర్మ గారి అష్టావధానం ఏర్పాటుచేసిన సందర్భంలో శ్రీ మద్దూరి సుబ్బారెడ్డి గారు, శ్రీ గని సుందర రావు గారు, శ్రీ కలుగోట్ల విజయాత్రేయుల పరిచయం లభించింది

1983లో "శ్రీ కలుగోట్ల విజయాత్రేయ సాహితీ రజతోత్సవ మహాసభలు" 3 రోజులు ఓర్వకల్లులో ఏర్పాటుచేసి అత్యంత వైభవంగా జరిపి డా నండూరి రామకృష్ణమాచార్య, శ్రీ గడియారం రామకృష్ణ శర్మ, యం కె రాము, అల్లాబక్ష్, ఆచార్య యన్ వి కృష్ణమూర్తి, శ్రీ గండ్లూరి దత్తాత్రేయ శర్మ, హార్మోనిష్టు శివారెడ్డి వంటి కళాకారులను సన్మానించి విజయాత్రేయ రజతోత్సవ సారథి ఐనారు అది కర్నూలు సాహితీ ప్రేమికులకు ఒక మధుర స్మృతి.

ఈ కుశల యోజక నిర్వహణా ప్రావీణ్యం చూచి "విశ్వహిందూ పరిషత్" ఏకాత్మతాయజ్ఞ ప్రచారకార్యదర్శిగా రాయలసీమ బాధ్యత నిచ్చారు, శర్మగారికి

1983 నుండి 92 దాకా ఒక దశాబ్దం వందల సంఖ్యలో ధార్మిక ఉపన్యాసాలు, సత్యరథయాత్ర, తిరుపతి మహాసభల వంటి కార్యక్రమాలెన్నింటినో శ్రీ శర్మగారు విజయవంతంగా నిర్వహించారు హిందూధార్మికలోకం హృదయాల్లో నిలిచిపోయారు. ఎంతో మంది కార్యకర్తలకు వారు స్ఫూర్తి ప్రదాతలు. వారుతయారుచేసిన కార్యకర్తలు నేడు రాష్ట్రస్థాయి బాధ్యతలు నిర్వహిస్తున్నారు. వారి అభిమానుల సంఖ్య అగణితం

వారి దైవ, ధర్మ, దేశ భక్తులకు నిర్మాణాత్మక కృషికి సాకారంగా నిలుస్తాయి కర్నూలు, నంద్యాల "భారతమాత మందిరాలు" భారతదేశంలోనే ఇది ఒక చారిత్రాత్మక కృషి, ఏకాత్మతాయజ్ఞఫలాలు

8ఏండ్ల పాటు ఉచితంగా విశ్వహిందూ పరిషత్ "భారతమాత క్లినిక్" కర్నూల్లో నిర్వహించారు అంతేకాదు ఎమ్మిగనూరులో రాష్ట్రస్థాయి పోటీలు నిర్వహించి "జాతీయ సాహిత్య పరిషత్" రాష్ట్రమహాసభలు శ్రీ కె సి హెచ్. సుబ్బరాయుడి గారి సహకారంతో నిర్వహించారు. ఒక ఉపాధ్యాయుడిగా ఉండి "దేశం కోసం" అనే కావ్యాన్ని శ్రీ సుబ్బరాయుడిగారితో వ్రాయించుకొని అంకితం తీసికొన్నారు 1993లో జాతీయ సాహిత్య పరిషత్ ఎమ్మిగనూరు వారాకావ్యాన్ని ప్రచురించారు

విశ్వహిందూ పరిషత్ "మాతృమండలి"కి వారొక కొత్త ఊపునిచ్చారు. అది 94 నుండి వారి దృష్టిని ప్రజాసేవవైపు మళ్ళించింది. అనారోగ్యకారణాల వలన విశ్వహిందూ పరిషత్ నుండి విరమించారు.

1994 డిసెంబరులో "నెహ్రూ యువ కేంద్రం" సహకారంతో కర్నూలు జిల్లా పరిషత్ హాల్లో ఒక అపూర్వ "మహిళాసమ్మేళనం" నిర్వహించారు. 1993లో స్థాపించిన "అభయహస్తం" అనే సేవా

సాంస్కృతిక సంస్థ ఆధ్వర్యంలో రెండు బ్యాచీల్లో కర్నూలు నరసింహారెడ్డినగర్‌లో 50 మంది మహిళలకు ఉచిత టైలరింగ్ శిక్షణ ఇచ్చి కుట్టు మిషనులు కొనేందుకు సాయపడినారు ఈ నాటికి ఆ అభయహస్తం ప్రతినెలా విద్యార్థి పారితోషికాలిస్తూ ప్రోత్సహిస్తున్నది కోశాధికారి శ్రీ కె అశ్వత్థనారాయణ సహకారం ఎన్న తగినది

మహిళా సమ్మేళనంలో ఒక పత్రిక స్థాపించి జిల్లాలోని మహిళా శక్తికి చేయూతనివ్వాలని తీర్మానించారు " స్త్రీ స్ఫూర్తి " మాసపత్రిక ఆవిర్భవించింది నంద్యాల్లో ఎందరెందరో మహామహులున్న సభలో తన సహపాఠి మిత్రులైన శ్రీ యామినీ సరస్వతి గారిచే "స్త్రీ స్ఫూర్తి" ప్రథమ సంచికను ఆవిష్కరింపచేయటం వలన శర్మగారి హృదయం ఎంతసుహృద్భావపూరితమో అర్థమౌతుంది స్త్రీ స్ఫూర్తి మాసపత్రిక వ్యవస్థాపకులుగా 4 సంవత్సరాలుగ ప్రచురణ బాధ్యతలు విజయవంతంగా నిర్వహిస్తున్నారు

1995లో శ్రీ యస్ పి వై రెడ్డి గారి వదాన్యతతో **ప్రాచీన సాహిత్య పరిషత్** స్థాపించి నాతో సహసర్వశ్రీ డా ములుకుట్ల బ్రహ్మానందశాస్త్రి, దేవులపల్లి చెంచు సుబ్బయ్య, జె మల్లికార్జునరావు, కోడూరు శేషఫణిశర్మ, జి సుబ్రహ్మణ్య శాస్త్రి, దివి హయగ్రీవాచారి, డా గెలివి సహదేవుడు, గన్నమరాజు సాయిబాబా, అష్టావధాని మాచిరాజు శివరామ రాజు వంటి సహృదయ మిత్రుల సహకారంతో ఒక సంవత్సరంలో కర్నూలు జిల్లాలోని ఉన్నత పాఠశాలల్లో, కళాశాలల్లో గ్రామాల్లో 50 సాహిత్య ఉపన్యాసాలిప్పించగలగటం ఏకోణంలో చూచినా ఒక రికార్డు తన ఉపాధ్యాయ వృత్తిని నిర్వహిస్తూ, పత్రిక నిర్వహిస్తూ, అభయహస్తం నిర్వహిస్తూ 50 సాహిత్యోపన్యాసాలిప్పించటమనే దుస్సాధ్య కార్యక్రమాన్ని సుసాధ్యం చేసిన శర్మగారి కార్యదక్షత ఎన్నతగింది సహజంగా కార్యకర్తలు వారి నివాస కేంద్రాన్ని వారి కార్య క్షేత్రంగా ఎన్నుకొంటారు కాని శ్రీ శర్మగారు కర్నూలు జిల్లా మొత్తాన్ని వారి సాహితీ కేంద్రంగా చేసి విజయం పొందటం ఆశ్చర్యం రాయలసీమలో ప్రాచీన సాహిత్య ప్రచారం వారి ధ్యేయం నిజానికి విశ్వమంతా ప్రాచీన సాహితీ ప్రచారం చేద్దామనేంత ఆవేశం వారిది

ప్రాచీన సాహిత్య పరిషత్ రాయలసీమ రచయితల మహాసభలు ఏర్పాటు చేయటానికి దారితీసింది 1996 మార్చి 8,9,10 మూడు రోజులు సుమారు 100 మంది కవి, పండిత, సాహితీకారుల ఉపన్యాసాలతోపాటు, కవిసన్మానాలు, సంగీత సాహిత్య కార్యక్రమాలు కనులపండువుగా జరిగాయి శర్మగారి కార్యదక్షతను తిలకించిన జిల్లా కలెక్టర్ శ్రీ రాజా గారు రూ 20,000/- వెరదాత శ్రీ యస్.పి.వై.రెడ్డి గారు రూ 30,000/- ఇవ్వగా, **తెలుగు విశ్వవిద్యాలయం**, చిన్న మొత్తాల పొదుపు సంస్థ చెరి ఒక రూ 3,000/- ఉదారంగా విరాళంగా ఇచ్చి ఈ సాహితీయజ్ఞాన్ని జయప్రదం చేశాయి కె.పి. కల్హారా గారు సహకరించారు

పూలదండలు, దుశ్శాలువాలు, అల్పాహారాలు, విందు భోజనాలు, పానీయాలతో వీనులవిందు, కనులవిందు, రసనాంచల స్వాదిష్టంగా ప్రతిసాయంత్రం శ్రీ గండ్లూరి దత్తాత్రేయ శర్మగారి అష్టావధానం, డా. యాచేంద్రగారి సంగీతావధానం, బేబీ శ్రీనిధి రాగావధానంతో అందగించిన ఈ సాహితీ యజ్ఞాన్ని పత్రికలు అక్షరరూపంలో, దూరదర్శన్, ఈ టి వి , వారలు దృశ్యరూపంలో బంధించి ప్రదర్శించటం కర్నూలు రసికులు మస్తిష్కంలో నిలుపుకొన్న ఒక మధురానుభూతి

కర్నూలు వినాయక చవితి వ్యాఖ్యానంతో గడితేరిన, ఎమ్మిగనూరు నాగభైరవ సన్మానంలో కుసుమించిన వీరి వ్యాఖ్యానవైభవాన్ని గుర్తించిన కర్నూలు, తిరుపతి ఆకాశవాణి కేంద్రాలు వారిని శ్రీశైలంలో శివరాత్రినాడు,

తిరుమలలోని గరుడోత్సవాన్ని వర్ణించటానికి ప్రత్యక్ష వ్యాఖ్యాతలుగ ఎన్నిక చేయటం గమన్హార్ష ం వారిచ్చిన రేడియో పురాణకాల క్షేపాలు, ఉపన్యాసాలు లెక్కింపతగినవి ఎన్నోసభలు, సదస్సులు వారి వ్యాఖ్యాతృ విలాసంలో పులకించాయి

శ్రీ శర్మగార్కి తెలుగు ఉపాధ్యాయులుగా ఉన్న కీర్తి ఇంతింత అనరానిది కమ్మని వారి భావాత్మక పద్యగానం అబాలగోపాలాన్ని అలరిస్తున్నది 1983లోనే జిల్లా విద్యాశాఖాధికారి వీరిని ఉత్తమ ఉపాధ్యాయులుగా సన్మానించారు ఉపాధ్యాయులుగా, ఉద్యమశీలిగా, సాహితీప్రియం భావుకులుగా, ఉత్తమ ఉపన్యాసకునిగా, పత్రికా వ్యవస్థాపకునిగా, దీక్షాదక్షతలు గల యోజకునిగా తన అనారోగ్యాన్ని లెక్కచేయని నిరంతర సాహితీ కృషీవలుడు , ప్రాచీన సాహిత్య పరిషత్ కార్యదర్శి శ్రీ జె యస్ ఆర్ కె శర్మ

నా(ప)హృదయు గీతికలు అన్నవారి కవితా సంకలనం అచ్చుకు సిద్ధంగా ఉంది స్త్రీస్ఫూర్తి అవార్డుల ప్రదానోత్సవం గురించి స్త్రీలకు కథానికల పోటీ గురించి ఆలోచిస్తున్నారు. ఇన్నికార్యక్రమాలకు నేర్పును, ఓర్పును, సమయాన్ని, ధనాన్ని ఎలాసమకూర్చుకుంటున్నారన్నది శతావధానిగా నాకు ఆశ్చర్యం కలిగిస్తున్న విషయం

వీరి సంపాదకత్వంలో వెలువడిన **కర్నూలు జిల్లా సంస్కృతి విశేషాలు** మీ చేతుల్లో ఉన్నది. ఇది సమగ్రమని నేననను కాని ఈ దిశలో ఒక మంచి ప్రయత్నం, కర్నూలు నగరం, జిల్లా, తీర్థక్షేత్రాలు, కళలు గురించి చక్కని వ్యాసాలున్నవి రచయితలందరూ అభినందనీయులు ఇంకా కొన్ని చేర్చితే బాగుండేది అనటం సులభం కాని కర్నూలు జిల్లా సంస్కృతి విశేషాలు అన్న అంశం ఎంత దొడ్డది! కొండను ఒక చిన్న అద్దంలో చూపే ప్రయత్నం ఇది ఇతరులు ఈ దిశలో నడచి ఈ కార్యక్రమాన్ని విస్తృత పరచటం కర్తవ్యం.

ఈ ''కర్నూలు జిల్లా సంస్కృతి విశేషాలు'' – విశేషసంచికను శ్రమకోర్చి మనందరి ముందుంచిన శ్రీ జె.యస్.ఆర్.కె. శర్మ అభినందనీయులు వారి సాహితీ కృషి సదావిజయవంతం కావాలని ఆశిద్దాం!

శ్రీ దత్తస్వామి వారికి, వారి కుటుంబానికి ఆయురారోగ్య ఐశ్వర్యాలివ్వాలను శుభాకాంక్షలతో

27-4-97 సుధీవిధేయుడు

ఈశ్వర, చైత్ర బహుళ పంచమి గండ్లూరి దత్తాత్రేయశర్మ

ద్రోణాచలం

# అంశసూచిక


| | అంశం | రచయిత | పుట |
|---|---|---|---|
| 1 | కర్నూలు నగరచరిత్ర | గన్నమరాజా సాయిబాబా | 1-3 |
| 2 | తెలుగు సాహిత్యంలో కందనవోలు ఒక పరిశోధన | వైద్యం వేంకటేశాచార్యులు | 4-9 |
| 3 | కర్నూలు మండలములో తీర్థక్షేత్రాలు వాని ప్రాశస్త్యం | హెచ్ హీరాలాల్ యం ఏ | 10-17 |
| 4 | కర్నూలు నగరంలో దర్శనీయ స్థలాలు | జగర్లపూడి సీతారామకృష్ణశర్మ | 18 |
| 5 | బ్రీఫ్ హిస్టరీ ఆఫ్ ది కర్నూలు మునిసిపాలిటీ | వై పి మస్తాన్‌రావు | 19-23 |
| 6 | కర్నూలు నగరపాలిక విశేషాంశములు | యం ప్రసాదరావు ఐ ఎ యస్ | 24 |
| 7 | వాగ్గేయ కారక మూర్ధన్యులు-కాకర్ల త్యాగరాజు | డా ములుకుట్ల బ్రహ్మానంద శాస్త్రి | 25-28 |
| 8 | ప్రబంధ కళాపూర్ణుడు-పింగళి సూరన | డా గెలివి సహదేవుడు | 29-32 |
| 9 | కవితాసామ్రాజ్య కావ్యతీర్థులు-శ్రీ మద్దులపల్లివారు | విద్వాన్ జి సుబ్రహ్మణ్య శాస్త్రి | 33-37 |
| 1( | కళాతపస్వి_దామోదరం సంజీవయ్య | డా పి గోవిందరాజు | 38-40 |
| 1: | కవితా కిరీటి-కలుగోట్ల విజయాత్రేయ | జె యస్ ఆర్ కె శర్మ | 41-44 |
| 1: | కర్నూలు జిల్లా జానపద కళారూపాలు-కళాప్రపూర్ణ | మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి | 45-46 |
| 1. | కర్నూలు జిల్లా హరిదాస వరేణ్యులు | మాలిగి ... రాజ్ | 47-48 |
| 14. | తుంగభద్ర నదీ విశేషాలు | గడియారం రామకృష్ణశర్మ | 49-51 |
| 15 | తుంగ భద్రా పుష్కరాలు-భారతీయ శాస్త్రీయ దృక్పథం | జగర్లపూడి సీతారామకృష్ణశర్మ | 52-53 |
| 16 | తుంగభద్ర సాక్షిగా | జె యస్ శ్యామసుందర శాస్త్రి | 54-60 |
| 17 | డిసిల్ట్ తుంగభద్రా ప్రాజెక్ట్ | కె చంద్రశేఖర కల్కూర | 61-65 |

| | | | |
|---|---|---|---|
| 18 | ఆంధ్ర విజ్ఞాన భాస్కరుడు- | | |
| | శ్రీ గాడిచెర్ల హరిసర్వోత్తమరావు | జె సీతారామకృష్ణ శర్మ | 66-71 |
| 19 | రాయల రమ్యసాహితి | జె. యస్ ఆర్ కె శర్మ | 72-77 |
| 20 | సాహితీ సదస్సు మూలస్తంభం- | సాహిత్య ప్రపూర్ణ, | |
| | ఆచార్య పేడూరి దీక్షితుల వెంకట సుబ్బయ్య | ఆచార్య శ్రీ యన్ వి కృష్ణమూర్తి | 78-80 |


## అనుబంధం


| | | |
|---|---|---|
| 1 | నివర్తి వెంకట సుబ్బయ్య | 3 |
| 2 | తొలి తెలుగు నవలా రచయిత నరహరి గోపాలకృష్ణమ శెట్టి | 9,17 |
| 3. | చాగలమర్రి త్యాగశీలి ఆర్ కె. రాం | 28 |
| 4 | కీ శే షేక్ దావూద్ | 32 |
| 5 | ఉయ్యాలవాడ నరసింహారెడ్డి | 37,46,48 |
| 6 | దోమా వెంకటస్వామి గుప్త | 40 |
| 7 | కీ శే అందలం కృష్ణమూర్తి | 44 |
| 8. | కీ.శే కె సిహెచ్ సుబ్బరాయుడు | 51,53,60,65 |
| 9 | కందుల ఓబుల రెడ్డి | 72,80 |

# కర్నూలు నగర చరిత్ర - కర్నూలు జిల్లా విశేషాలు

- గన్నమరాజు సాయిబాబా ఎం.ఏ
కార్యదర్శి, కర్నూలు జిల్లా తెలుగు రచయితల సంఘం

రాయలేలిన రతనాల సీమ రాయలసీమ రాయల సీమ గళమున వెలుగొందు మణిహారము కర్నూలు పట్టణము పావన తుంగభద్ర నదీ తీరమున వెలసినది రాజకీయ, సాంస్కృతిక రంగములలో పేరెన్నికగన్నది శాతవాహన పశ్చిమ చాళుక్య, కాకతీయ, విజయనగర హైందవ రాజుల పాలనలో వేవెలుగులు విరజిమ్మిన చారిత్రక పట్టణము కర్నూలు తరువాత మహమ్మదీయులు, ఆంగ్లేయుల పాలనకిందికి వచ్చినది

ఇక్ష్వాకురాజు బాహుబల శాంతముని కాలములో మహాతలవరస్కంధ నాగుడు ఈ పట్టణమును నిర్మించెను ఆయన పేంఒన స్కందన ప్రోలు, కందనవోలుగా రూపాంతరము నొందినది తరువాత కర్నూలుగా మారినది సంస్కృత శబ్దం స్కందన కందనగా మారి ఉండవచ్చునని ప్రముఖ చారిత్రక పరిశోధకులు శ్రీవైద్యం వెంకటేశ్వరా చార్యులు పేర్కొన్నారు

కంధన యను శాతవాహన రాజు తన విజయమునకు చిహ్నముగ శాతవాహన కోటను కందనప్రోలును నిర్మించెను కాలక్రమున అది శాతాని కోట, కందన పోలుగా రూపాంతరము చెందెనను వాదనయుగలదు అలంపూరు దేవాలయ నిర్మాణమునకు ఊళ్ళుతోలు బండ్లు తుంగ భద్రా నదీ తీరమున నిలచి, కందెన వేసుకొని, నదిని దాటిపోయెడివి కావున యి పట్టణమునకు కందెనవోలు యనియు, బండ్లు నిలుముప్రాంతము బండ్లమిట్ట యనియు పిలువబడుచున్నది క్రీ శ 1616 లో బీజాపూరు సుల్తాను, కర్నూలు నగరమును ముట్టడించుటకు సేనాని అబ్దుల్ వహాబును పంపెను అప్పుడు కర్నూలును కడపటి విజయనగర రాజు వంశీకుడు గోపాలరాజు పాలించు చుండెను తుంగభద్రకు ఎడమవైపున గొందిపల్లె కొండచాటున దాగి యున్న అబ్దుల్ వహాబు సైన్యము ఒకనాటి వేకువన అకస్మికముగ నదిని దాటి, పట్టణమును ముట్టడించెను గోపాలరాజు చేయునది లేక ఉత్తర ద్వారము గుండా నదిని దాటి పారిపోయెను అందుచే ఈ ద్వారము గోపాలదర్వాజా గావ్యవహరింపబడుచున్నది కర్నూలుకు గొందిపల్లె చేటు అన్న నానుడి ప్రచారము నొందింది బీజాపూరు సుల్తానుచే గవర్నరుగా నియమింపబడిన అబ్దుల్ వహాబు, కర్నూలు కోటలోని శ్రీకృష్ణదేవాలయమును జుమ్మామసీదుగా మార్చెనని చెప్పబడుచున్నది

అబ్దుల్ వహాబునకు ప్రాకటూరు పాళెగాడు బిజ్జాల కొండారెడ్డి ఎదురు తిరిగెను వహాబు అతనిని బంధించి తెచ్చి, పాత బస్టాండు వద్ద గల చారిత్రాత్మక కట్టడము బురుజునందుంచెను కొండారెడ్డి ఆ బురుజులోని రహస్య సొరంగ ద్వారము గుండా తప్పించుకొనెను నాటి నుండి బురుజు కొండారెడ్డి బురుజుగ వాసి కెక్కినది వహాబు పాలనా కాలముననే శ్రీ ఛత్రపతి శివాజీ వీరివద్ద చౌతుసర్దేశ్‌ముక్ అను పన్నులను వసూలు చేయుచూ, కర్నూలు మీదుగా శ్రీశైలము చేరెను గోపాల దర్వాజా కొండారెడ్డి బురుజు, అబ్దుల్ వహాబు సమాధి కేంద్ర ప్రభుత్వముచే చారిత్రక చిహ్నములుగా గుర్తింపబడినవి రాయల సీమలో ఏర్పడిన కరువును నివారించుటకు, సర్ ఆర్థర్‌కాటన్ ఆధ్వర్యములో కర్నూలు-కడప కాలువ నిర్మింపబడి, తుంగభద్ర నీరు సాగునకు విడుదల చేయబడినాయి అమంజీవి శ్రీ పొట్టిశ్రీరాములు గారి అమరణ నిరాహార దీక్ష ఫలితముగ క్రీ శ 1953 సం న మనకు ప్రత్యేక ఆంధ్రరాష్ట్రము సిద్ధించినది దానికి తొలి రాజధాని కర్నూలు ఉద్యోగుల నివాసమునకై డేరాలు వేయుటచే డేరాల

పట్టణము గ పేరొందినది కర్నూలు రాష్ట్ర రాజధానిగ వెలుగొంధిన కాలమనసే, నేటి ప్రభుత్వ బాలికల కళాశాల (కె వి ఆర్ కాలేజి) వైద్య కళాశాల, ఎ బి సి క్యాంపులు వెలిశాయి క్రీ శ 1956 లో రాష్ట్రలక్ష్మి రదచక్రములు కందెన రాసుకుని కర్నూలు నుండి భాగ్యనగమునకు తరలినవి రాయలసీమ వాసుల బంగారు కలలు చెదరినవి కర్నూలు పట్టణము జిల్లా కేంద్రముగా మిగిలినది కర్నూలు పట్టణమున జాతీయ, అంతర్జాతీయ ఖ్యాతి గాంచిన శ్రీ షిర్డీ సాయిబాబా దేవాలయము కలదు అతిప్రాచీనమైన రామ భొట్ల దేవాలయము, కోట శ్రీ ఆంజనేయ స్వామి దేవాలయము, కె సి కాలువ ఒడ్డున వెలసిన శ్రీలక్ష్మీనారాయణుల ఆలయము కర్నూలులో ప్రసిద్ధములు బాలురకు ఉస్మానియా కళాశాల కలదు బ్రిటీష్ వారి బలీయములైన కట్టడములకు ప్రతీకలుగ నిల్చిన కోల్సు స్మారకోన్నత పాఠశాల, అమెరికా బాపిస్టు చర్చి నిలిచినవి పాత బస్టాండు సమీపమున జిల్లా కేంద్ర గ్రంధాలయముగలదు సొంత భవనమును కలిగియున్న జిల్లా కేంద్రగ్రందాలయ భవనమునకు, ఆంధ్రతిలక్ శ్రీ గాడిచెర్ల హరిసర్వోత్తమరావు భవనమని పేరిడిన ఘనత గ్రంధాలయ సంస్థ అధ్యక్షులు శ్రీ కె చంద్రశేఖర కల్కూరా గారికి దక్కినది జాతీయ, అంతర్జాతీయ ప్రఖ్యాతి గాంచిన, రాజకీయ, పారిశ్రామిక, ప్రముఖులను, మేధావులను, సాహిత్య వేతలను తీర్చిదిద్దిన పురాతనమైన పురపాలకోన్నత పాఠశాల శ్రీ దామోదరం సంజీవయ్య పాఠశాలగా మారినది ఉన్నత విద్యా ప్రమాణాల్ని నెలకొల్పుతూ, విద్యార్థులను జ్ఞాన సంపన్నులుగా తీర్చిదిద్దగల సిల్వర్ జూబ్లీ కళాశాల ఇటీవల రజతోత్సవములను జరుపుకున్నది కర్నూలు నుండి హైదరాబాదు వైపు వెళ్ళు రైలు మార్గమును కలుపుచు తుంగభద్రనదిని దాటుటకు బలమైన గరండాల మీద నడుచుట పరిపాటి బుధవార పేటను కర్నూలు నగరమునకు కలుపుచు హంద్రీనదిపై పాతవంతెనకు తోడుగ క్రొత్త వంతెన నిర్మాణము వాహనముల, పాదచారుల రాకపోకలకు అనుకూలమును చేకూర్చినది హంద్రీనదీ తీరమున ప్రాచీన కళాఖండముల భద్రపరచుటకు మ్యూజియం రూపురేఖలు దిద్దుకొనుచున్నది ఆంధ్ర ప్రదేశములో వైశాల్యమున అతిపెద్ద రోడ్డు రవాణా సంస్థ బస్టాండులలో రెండవదిగా పేర్కొనబడిన ఆర్ టి సి బస్టాండు బళ్ళారి రోడ్డులో అన్ని సౌకర్యములతో నిర్మింపబడినది రైల్వేస్టేషనుకు మరిన్ని సౌకర్యములు చేకూర్చవలసియున్నది అభివృద్ధి చెందవలసిన సర్వజనవైద్యశాల కలదు కర్నూలుకు సమీపమున పేపరుమిల్లు కలదు

కర్నూలు జిల్లాకు ఉత్తరమున మహబూబ్‌నగర్ జిల్లా, తూర్పున గుంటూరు జిల్లా, ప్రకాశం జిల్లాలు, దక్షిణాన కడప అనంతపురం జిల్లాలు పశ్చిమాన కర్నాటక రాష్ట్రము సరిహద్దులుగ నిలిచినవి ముఖ్య నదులు కృష్ణ, తుంగభద్ర, హగరి, గుండ్లకమ్మ, కుందేరు నదులు, కర్నూలు నుండి శ్రీశైలము వరకు నల్లమల అడువులు వ్యాపించినవి శ్రీశైలమున, భ్రమరాంబమల్లికార్జున స్వాములు వెలసినారు శ్రీశైల ఆనకట్ట ఎత్తయినది ఇది జలవిద్యుత్ కేంద్రము ఆత్మకూరు సమీపమున వెలుగోడు రిజర్వాయర తెలుగు గంగప్రాజెక్టులో భాగమైయున్నది

ఆదోని వ్యాపారకేంద్రము రెండవ ముంబాయిగా పేరొందినది ఆదోని కొండలలో మండల ఆంజనేయస్వామి వెలసినాడు. ఆదోనికి సమీపమున ఉరుకుంద ఈరణ్ణస్వామి భక్తుల కోర్కెలు తీర్చుచున్నాడు ఆదవాని లక్ష్మమ్మయోగీశ్వరురాలుగ ప్రసిద్ధము

ఆలూరు సమీపమున ఎల్లార్తి దర్గ ప్రసిద్ధము ఎమ్మిగనూరు చేనేత పరిశ్రమకు ప్రసిద్ధి పశుసంవర్ధకశాఖవారు పశుపోషణ, అభివృద్ధికై బనవాసి యందు ప్రభుత్వ కేంద్రమును నెలకొల్పినారు. కలు దేవకుంట్ల దాటిన తరువాత మంత్రాలయమున భక్తుల పాలిటి ప్రత్యక్షదైవము శ్రీరాఘవేంద్రస్వామి బృందావనమున కొలువుదీరినాడు పత్తికొండ తాలుగా కేంద్రము చుట్టూ కొండలమయము సర్‌థామస్ మన్రోచే నిర్మితమైన కట్టడములు, తోపుకలవు ద్రోణాచలము రైల్వేజంక్షను, సున్నపు బట్టీలు కలవు ఊరు చుట్టూ పరచుకున్న కొండపై

శ్రీ ఆంజనేయస్వామి, దేవాలయము, చర్చి, మసీదులు వరుసగా వెలసి, జాతీయ సమైక్యతను చాటుచున్నవి చిన్న బుగ్గ, పెద్దబుగ్గ ఈశ్వరాలయములు కలవు కర్నూలు నుండి ఎమ్మిగనూరుకు వెళ్ళు మార్గములో గోనెగండ్ల సమీపమున హంద్రీనదిపై గాజులదిన్నె ప్రాజెక్టు నిర్మింతమైంది దానిని సంజీవయ్య సాగర్‌గా మార్చారు

కొత్తకోట గ్రామ సమీపమున శ్రీ రాఘవేంద్ర స్వామి ఆలయము కలదు మంకేశుల గ్రామము వద్ద తుంగభద్రపై మంకేశుల మార్గమున పి కోటకొండ సమీపమున అడవి ప్రాంతములో శ్రీకొండీన్యాశ్రమము కలదు

నంద్యాలలో చక్కెర కర్మాగారము కలదు చెఱుకు అరటి పంటలు మెండు మహానందిశ్వరాలయముతో పాటు నవనందుల నడుమ నిలిచినది నంద్యాల గుండ్లబ్రహ్మేశ్వరము, ఓంకారము మున్నగు శైవక్షేత్రములు నంద్యాల చుట్టు ప్రక్కల వెలిసినవి దేశ రాష్ట్రపతిని, ప్రధాన మంత్రిని అందించి, ప్రపంచ దృష్టిని ఆకర్షించిన నంద్యాల, రాజకీయ రంగమున చిత్ర విచిత్ర విన్యాసములకు నెలవు

నందికొట్కూరు సమీపమున శైవక్షేత్రము సంగమేశ్వరము శ్రీశైల పీటిముంపునకు గురియైనది ఆలయ పునర్నిర్మాణములు అలంపూరులోను, జగన్నాథ గట్టు మీద జరుగుచున్నవి బేతంచెర్ల బండరాళ్ళ పరిశ్రమకు ప్రసిద్ధి, బనగాన పల్లెకు ఐదు కిలోమిటర్ల దూరములో యాగంటి శైవక్షేత్రము కలదు దాని యందు నంది దినదినమును పెరుగును రంకవేయునని, పోతులూరి వీరబ్రహ్మంగారి జోస్యం పోతులూరివారి మఠం బనగాన పల్లెకు సమీపములోనున్నది కర్నూలుకు సమీపమున హుసేనాపురము వద్ద కొమ్మెమర్రి ఆంజనేయ స్వామి భక్తుల పాలిట కొంగు బంగారమై నిలిచాడు కాల్వబుగ్గ యందు ఈశ్వర క్షేత్రము కలదు ఆళ్ళగడ్డ సమీపమున అహోబిలక్షేత్రమున శ్రీలక్ష్మినర్శింహస్వామి కొలువు దీరి యున్నాడు. నందవరమున చౌడేశ్వరిదేవి కొలువు దీరియున్నది

1991 వ సం గణాంకసేకరణను బట్టి కర్నూలు నగర జనాభా 2,36,800 పురుషులు 1,21,460, స్త్రీలు 1,15,340 ,కర్నూలు జిల్లా జనాభా -29,73,024 పురుషులు 15,22,618 స్త్రీలు- 14,50,406 మండలాలు-54 మొత్త ం గ్రామాలు 918 జనావాసాలు కాని ఊళ్ళు 27

జిల్లాలో, కర్నూలు నగర పాలక సంస్థ కాక, మూడు పురపాలక సంస్థలున్నవి అవి ఆదోని, నంద్యాల, ఎమ్మిగనూరు జిల్లాలో కర్నూలు, ఆదోని, నంద్యాలలో టీ వి కేంద్రములు కలవు

కర్నూలు పరిసర ప్రాంత రసిక హృదయాల్ని, కర్నూలు, ఆకాశవాణి (యఫ్ యం రేడియో స్టేషన్) వివిధ వినూత్న కార్యక్రమములు చేపట్టి, రంజింపచేయుచున్నది

---

## నివర్తి వెంకట సుబ్బయ్య

వీరు పత్తికొండలో 1910లో జన్మించారు పట్టభద్రులు ప్రభుత్వ ఉద్యోగానికి రాజీనామా చేసి, వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని 8 మాసాలు జైలు శిక్షననుభవించారు క్విట్ ఇండియా ఉద్యమ కాలంలో రహస్య ఉద్యమాన్ని నిర్వహించి బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఎందరో అజ్ఞాతయోధులను తయారుచేసి ఉద్యమాన్ని పటిష్ఠం చేసిన ఘనత శ్రీ సుబ్బయ్య గారికే దక్కింది తదుపరి సేవా గ్రామం వెళ్లి గాంధీ గారిని సంప్రదించి వారి సలహామేరకు పోలీసులకు పట్టుబడ్డారు

ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో శాసన సభ్యుడుగా కాంగ్రెస్ పక్షాన ఎన్నికయ్యారు ఆంధ్రప్రదేశ్ ఏర్పాటయ్యాక శాసనమండలి సభ్యుడై లెజిస్లేటివ్ కౌన్సిల్ అధ్యక్షుడయ్యారు చాలాకాలం కర్నూలు జిల్లా కాంగ్రెస్ కమిటీకి ప్రధాన కార్యదర్శిగా పని చేశారు మనసీమ వార పత్రికకు సంపాదకత్వం వహించారు 1978లో స్వర్గస్థులైనారు

# తెలుగుసాహిత్యంలో కందనవోలు- ఒక పరిశోధన

- వైద్యం వేంకటేశాచార్యులు,
18-5ఎ, శ్రీలక్ష్మీనగరు, కర్నూలు

కర్నూలు జిల్లాకు ఎన్నో శతాబ్దాలనుంచీ చెప్పుకోదగ్గ ఘనమైన చరిత్రవుంది, సంస్కృతివుంది, సాహిత్యమూవుంది జిల్లాకు కేంద్రమైన కర్నూలుకు కూడా ఎంతో చరిత్ర-సంస్కృతివుంది-వాటితోపాటు సాహిత్యసంపదావుంది చరిత్రలో, సాహిత్యంలో కర్నూలుకు స్కందనప్రోలు, కందనవోలు, కందెనవోలు, కల్‌గోర్, ఖమ్మర్‌నగర్, గగన్ పూర్ అనే పేర్లుకూడా ఒకప్పుడు వ్యవహారంలోవుండినట్లు తెలుస్తోంది

ఈ పేర్లుకలగటానికి గల కారణాలు ప్రస్తుతవ్యాసంలో చెప్పుపోతే విషయాంతరమౌతుంది ప్రస్తుతం తెలుగుసాహిత్యంలో కందనవోలు ప్రస్తావనను గురించీ, అందువల్ల మనకు తెలిసే చారిత్రకాది అంశాలనుగురించి సంక్షిప్తంగా తెలుసుకుందాం

ఈ జిల్లాకు సంబంధించిన శాసనవాఙ్మయం సమృద్ధిగావుంది కాలవాహినీ గర్భంలో కలిసిపోయినవి పోగా జిల్లాకు సంబంధించిన లభిస్తున్న శిలాశాసనాల సంఖ్య వందల్లో వుంటుంది ఆ శాసనాలు అశోకుడి కాలం నుంచీ ఆధునికయుగందాకా వివిధకాలాలో వేయబడినవి వాటిలో ఎన్నో శిలాశాసనాల్లో కందనవోలు పేరు ప్రస్తావించబడింది అయితే ఈ వ్యాసకర్త పరిశీలనలో కందనవోలు పేరు కనిపించే మొట్టమొదటి తెలుగు శిలాశాసనం కూడలి సంగమేశ్వరాలయస్తంభంపై వేయబడిన శాసనం ఈ శాసనం శాలివాహనశకం 1320 విక్రమ నామసంవత్సర మార్గశిర పౌర్ణమినాడు వేయబడింది కూడలి సంగమేశ్వరాలయం జీర్ణోద్ధారణ కావించిన నాటి కందనవోలు పెద్దకరణం రామయ్యగారు ఈశాసనాన్ని వేయించారు ఈ శాసనంవల్ల ఆనాడు కర్నూలుకు కందనవ్రోలు అనే వ్యవహారం వున్నట్లూ దానికి పెద్దకరణంగా రామయ్య అనే వ్యక్తి వున్నట్లూ స్పష్టమౌతుంది

ఇక విజయనగర మరియు ఆరవీటిరాజుల కాలంలో వేయబడిన చాలా శిలాశాసనాలలో కందనోలు పేరు ప్రస్తావించబడింది ఆ శాసనవాఙ్మయం వల్ల నాటి కందనవోలు సీమ ఏలికలు మొదలైన చారిత్రకాంశాలతో పాటు నాటి సంస్కృతి, బాషాస్వరూపాలుకొంతవరకు తెలుస్తాయి

ఇక కావ్యప్రబంధాది సాహిత్యంలో కందనవోలుపేరు అనేక గ్రంధాల్లో ప్రస్తావించబడింది కర్నూలు జిల్లాకు సంబంధించిన దాదావు 12-13 శతాబ్దాల మధ్య కాలంనుంచీ ప్రసిద్ధంగా అగుపిస్తున్నాకూడా కందనవోలు పేరునుప్రస్తావించిన గ్రంథాలు మాత్రం 16 వ శతాబ్దంనుంచి మాత్రమే మనకు అగుపిస్తాయి అలాంటి గ్రందాలు అవి పేర్కొన్న విశేషాలు సంక్షిప్తంగా మచ్చుకు కొన్ని -

క్రీ శ. 1550 ప్రాంతంవారైన అయ్యలరాజురామభద్రుడు రామాభ్యుదయం ప్రౌఢబంధాన్ని రచించాడు అతడి రామాభ్యదయం గొబ్బూరినరసరాజుకు అంకితం ఇవ్వబడింది గొబ్బూరినరసరాజు అలియరామరాయలకు మరియు కందనవోలు పాలకుడైన వేంకటాద్రిరాజుకు కూడ మేనల్లుడు గొబ్బూరు పూర్వవు కర్నూలు జిల్లాలోని మార్కాపురం తాలుకాలో వుంది. రామాభ్యుదయం అవతారికలోని రెండు పద్యాల్లో కందనవోలు ప్రస్తావనవుంది అందులోని ఒక పద్యంలో గొబ్బూరినరసరాజు 'కందనవోలీ ముఖ్యదుర్గరక్షణ చణోదగ్రప్రభావోదయా' అని స్తుతించబడ్డాడు ఈ పద్యంవల్ల గొబ్బూరినరసరాజు కందనవోలీదుర్గాన్ని సంరక్షిస్తూ వుండేవాడని తెలుస్తోంది

నరసరాజు పెద్దకొడుకు పేరు పెదతిమ్మరాజు రామాభ్యుదయంలోని మరోపద్యంలో నరసరాజు కొడుకు 'పెదతిమ్మభూవరకులాగ్రణి కందనవోలి భర్త' అని ప్రస్తుతించబడ్డాడు ఈ రెండు పద్యాలవల్ల కర్నూలు ఆనాడు కందనవోలు అనిపిలువబడేదని, కందనవోలి దుర్గాన్ని నరసరాజు మరియు అయన కొడుకు పెద్దతిమ్మరాజు సంరక్షిస్తూ పాలించేవారని తెలుస్తుంది నరసరాజు కందనవోలు రాజైన వెంకటాద్రికి మేనల్లుడు వేంకటాద్రి రాజు తళ్ళికోట యుద్ధములో హతులైన తర్వాత కొంత కాలము కందనవోలు కోటను అతడి మేనల్లుడైన గొబ్బూరినరసరాజు సంరక్షించినట్లు పై పద్యాల వల్ల అర్థమౌతుంది

16వ శతాబ్దం వాడైన రామరాజభూషణుడు వసుచరిత్ర రచించాడు ఈప్రబంధము అవతారికలో (30 వ పద్యము) కందనవోలి ప్రస్తావన వుంది ఆ పద్యభాగమిది- 'అనఘతర కందనవోలి మహాపురిని-శాంతుడగు రామ మేదినీ కాంతుడలరు' ఈ పద్యములో అరవీటి బుక్కరాజు కొడుకైన రామరాజు అభివర్ణించబడ్డాడు రామరాజు గొప్పపట్టణమైన (మహాపురి) కందనవోలిలో వుండేవాడని అర్థం రామరాజు కందనవోలి ప్రభువు ఇతడి మనుమడైన తిరుమల దేవరాయల వారికే వసు చరిత్ర అంకితమీయబడింది ఇతడి మరో మనుమడు అళియ రామరాయలు శ్రీ కృష్ణదేవరాయల వారికి అల్లుడు (కూతురు మొగుడు) కాగా ఇతడి కడగొట్టు మనుమడు వేంకటాద్రి వారసత్వంగా కందనోలిని పాలించాడు ఈ పద్యంలో కందనవోలి మహాపురి అనే ప్రయోగం గమనార్హం

16వ శతాబ్దం మధ్య కాలాన వుండిన దోనేరు కోనేరు నాథుడు బాల భాగవతాన్ని ద్విపదలోనూ పద్యకావ్యంగానూ రచించాడు ద్విపదబాలభాగవతము క్రీ.శ 1547లో రచించబడింది దానికి ముందు పద్యబాలభాగవత రచన జరిగింది కర్నూలు ఏలికైన రామరాజుకు మనుమడును, అళియ రామరాజుకు జ్ఞాతియును అయిన అవుకు చిన తిమ్మరాజుకు ద్విపదబాలభాగవతము అంకిత మియ్యబడింది అవుకు చినతిమ్మరాజు కోరిక మేరకు కోనేరునాథుడు చినతిమ్మరాజు తండ్రియైన రామరాజు తిమ్మరాజుకు పద్యబాలభాగవతము అంకితమియ్యబడింది ఈ రెండు గ్రంథాల అవతారికల్లోఅరవీటి వంశ చరిత్ర విపులంగా చెప్పబడింది. సోమదేవరాజు కాలం నుంచి గోపాల్ రాజు దాకా 9 తరాలుగా అరవీటి వంశీయులు కందనవోలును క్రీ.శ. 1624 దాక పాలించారు ఆ వివరాలు కొన్ని గ్రంథాల వల్ల తెలుస్తున్నాయి ద్విపదబాలభాగవతములో కందనవోలు ప్రస్తావన కనిపిస్తుంది అరవీటి సోమదేవరాజు జయించిన సప్త దుర్గాలలో కందనవోలు దుర్గం ఒకటిగా బాలభాగవతంలో చెప్పబడింది ఆ ద్విపద పాదాలు ఇలా వున్నాయి

"సోమదేవుండను సూర్యుని గవియె – నరలకసాధ్యమైన మొసలి మడుగు

ధరనెన్నదగిన సాతాని కోటయును-కడును తింపగజాలు కందనవోలు

కడిమి విశేషంబు గల కల్వకొలను-అరుదైన రాచూరు నల యేతగిరియు

నిరుపమంబగు గంగనేని కొండయును-నవగ నొప్పారువేడైన దుర్గముల

వినుతధాటీ మహావేశంబు వెరపి-సురపతి యోగి యా శుభ్రాంతు వంశ

కరుడొక్కనాడు లగ్గలగొన్నవాడు".

సోమదేవరాజు మనుమని మనుమడును అళియ రామరాజు తాత గారును అయిన బుక్కరాజు రామరాజు కందనవోలును పాలించేవాడు అతడి కాలాన నవాబిబ్బీ అంటే ఆదిల్‌ఖాన్ డెబ్బైవేల అశ్వీక సైన్యంతో కందనవోలును

ముట్టడించాడు రామరాజు కందనవోలి దుర్గంలో వుంటూ ఆదిల్‌ఖాన్ సైన్యాన్ని గెలిచాడు ఆ విషయాన్ని ఈ ద్విపదపంక్తులు తెలియచేస్తున్నాయి-

''రామనృపాలుండు రాజేంద్రుడౌదవె-నెందునెన్నగజాలు నిద్ధశౌర్యమున

కందనవోలి దుర్గంబులో నుండి-బుక్కయరామభూభుజుడెల్ల నృపుల

నెక్కువ యిదియని యెన్నంగజాలి-పీరులు డెబ్బది వేవు రాశ్వికులు

జేరి కొల్వంగ వచ్చిన సవానెదిరి -కల వంది పంచబంగాళంబు సేసి

గెలిచె దచ్చరితంబు కీర్తింపదరమె'' - ఇదేవిషయం పద్యబాలభాగవతంలో ఇలా చెప్పబడింది-

'గబ్బుల్ డెబ్బది వేవురాశ్వికులు వేడ్కన్ గొల్వగా గిబ్బపె

న్మబుల్ గప్పగ కందనోలు గొనవేడ్కన్ జుట్టుముట్టన్ సవా

బిబ్బీ నుబ్బుజిగింవి తోలె నరిరాట్ భీముండు లంకా నర

ణ్యబ్బంద్రాభుడు బుక్కభూవిభుని రామాధీశు డాహాయునన్'

కోనేరునాధుని పద్య ద్విపద బాలభాగవతవాక్యాల్లో కందనవోలు అనే రెండు రకాల ప్రయోగాలు అగుపిస్తున్నాయి కందనవోలును పాలించిన అరవీటి రాజుల వివరాలు ఈ రెండు గ్రంధాల్లోనూ లభిస్తాయి

17వ శతాబ్దంవాడగు బిజ్జలతిమ్మభూపాలుడు అనర్ఘరాఘవం అనే ప్రౌఢప్రబంధాన్ని రచించాడు ఈ కవి పితామహుడు పెద తిమ్మభూపాలుడు. ఇతడు అలంపూరు ప్రాగటూరు సీమలకు ఏలిక అయితే ఇతడి నివాసం మాత్రం కందనవోలు. పెదతిమ్మభూపాలుడిని వర్ణిస్తున్న ఒక పద్యంలో-

తే.ధరవంతుకెక్కు కందనవోలు దేశంబు - గణుతింపనెవ్వని కాణయాచి

సిరులనొప్పు నలంపూరు సీమకెల్ల - నాడగౌడును, దేశాయి, నాడకరణ

మనెడు విఖ్యాతియెవ్వాని కలరె- నతడు, వొల్చెబిజ్జల పెదతిమ్మభూవిభుండు.

బిజ్జలవంశీయులు విజయనగర సామ్రాజ్య పతనానంతరం బీజాపూర్ పాదుషా వారి అభిమానాన్ని సంపాదించి కందనవోలులో వుంటూ పాలనాపరమైన కొన్ని అధికారాలను కలిగివుండేవారని కొన్ని రికార్డుల వల్ల తెలుస్తోంది, పై పద్యంలో ధరవంతుకెక్కు కంధనవోలుదేశంబు అనే వాక్యం కందనవోలుకు అనాడు వుండే ఖ్యాతిని చాటుతోంది

కందనవోలును పాలించిన చిట్టచివరి హైందవరాజా అరవీటి గోపాలరాజా, ఇతడికత్తిని వర్ణిస్తూ ఎడవల్లివర్వతన్న చెప్పిన చాటువు ఒకటి అప్పకవీయంలో ఉదాహరించబడింది ఆ పద్యం-

రణరంగంబున నీ శితాసి యరినోరం బూర్గొకొన్న దా

నణుమాత్రంబును వానిపైన దెగదాహా! చిత్రమూహింపగా

దృణమేకావలె దారికట్టు మొనకట్టిద్ధారుణీమండలిన్

ప్రణుత ప్రాభవ కందనోలి పురగోపాలక్ష్మావల్ల భా!

గోపాల రాజుగారి తాతగారైన వేంకటాద్రి గారు ధరించిన కత్తినికూడా నరసభూపాలీయంలో మూర్తికవి అభివర్ణించటం గమన్హార్హం

17వ శతాబ్దంలో రత్నాకరం గోపాలరాజు అనే కవి సౌగంధికాప్రసవాపహరణం అనే ద్విపద కావ్యాన్ని రచించాడు ఈ కావ్యం రావెళ్ల లింగభూపాలునికి అంకితమీయబడింది రావెళ్లవారి ప్రశంసలో కందనవోలు ప్రస్తావనవుంది రావెళ్ల తిమ్మభూపాలుడు అనే ఆయన మొనసి కందనయోలు ముట్టడియుల్ల-మునుమున్నె విడిపించి యెదురు పరాణీలయొల్ల మట్టాడి కలడక్కినీల చీకాకు గావించి కందనయోలి కోటయును రాగమున సొచ్చి సురతాణిలగ్గగా చూరలాడించి పొగరు తురుష్కుల పోనీకద్రుంచి నట్లు ఈ కావ్యంలో ప్రశంసింపబడ్డాడు రావెళ్లవారు విజయనగరంవారికి ఆఱవీటివారికి అణకువగావుంటూ వచ్చారు కందనవోలు కోటపై తురుష్కులు దండయాత్రజరిపినపుడు రావెళ్లవారుకూడా ఆయుద్ధం లో పాల్గొని పరానులను చీకాకు పరచినట్లు పై ద్విపద పంక్తులు తెలుపుతున్నాయి పై ద్విపదల్లో కందనయోలు అనే ప్రయోగం గమన్హార్హం

17వ శతాబ్దంలో అందుగుల వెంకటయ్య రచించిన 'నరపతి విజయం' ఆరవీటి రాజులవంశ చరిత్రను తెలిపే గ్రంథాల్లో ప్రధానమైనది ఈ గ్రంథంలో కందనవోల్లు ప్రస్తావన చాలాచోట్లవుంది

కందనవోలు దుర్గంపై ఆరవీటిరాజుల అధికారం సోమదేవరాజుతో ప్రారంభమౌతుంది సోమదేవరాజు సాధించిన సప్తదుర్గాల్లో కందనవోలు దుర్గంకూడా ఒకటిగా నరపతివిజయం లో కూడా పేర్కొనబడింది అందులోని సోమదేవరాజు బిరుదగద్యలో కూడా కందనవోలు ప్రస్తావన ఇలాచేయబడింది- 'ఏకదివసఘటికైకఘటీహరాత్హృతకోటరామారు సాతానికోట కందనవోలు యాతగిరి కలువకొల్లు మొసలిమడుగు గంగినేని కొండాభిధాన సప్తదుర్గ ప్రవర్తి!'

ఆదిల్‌ఖాన్ కందనవోలును 70వేల అశ్వికదళంతో ముట్టడించగా ఆరవీటి రామరాజు 3 వేల 5 వందల ఏనుగులు, 70వేల గుర్రాలు, 6 లక్షల కాల్బలంతో ఆదిల్‌ఖాన్ ఉబ్బణగించాడని ఒక సీసపద్యంలో నరపతివిజయం తెలియజేస్తుంది ఆరవీటి వారిలో ఈ బుక్కరాజురామరాజు కాలాన కందనవోలుదుర్గం సప్తాంగబలాలతో సంరక్షితమై పాలించబడేదనికూడా నరపతి విజయం తెలుపుతుంది.- ప్రకటసప్తాంగముల గొని రామవిభుడు -కందనోల్ రాజధానియుగాగ వసుమతియు నేలినాడని నరపతివిజయం పేర్కొనింది

అలియరామరాయుల తమ్ముడగు వేంకటాద్రి కందనవోలును పాలించటాన్ని గురించి నరపతివిజయం ప్రస్తావించింది మచ్చుకొక పద్యం-

ఏలెను కందనోలి పురమింద్ర సమానుడు వేంకటాద్రిభూ
పాలుడు ధర్మరీతినరివర్గము బీరముదక్కి మత్తకుం
డాల తురంగహేమఘన నవ్యమణీమయు మిచ్చి రేవగల్
ఫాల తరాగ్రసీమ గర పంకజయుగ్మము చేర్చి కొల్వగన్

వేంకటాద్రిరాజు మనుమడైన గోపాలరాజు కందనోలును పాలించిన చివరి హైందవ రాజు గోపాల్‌రాజును గురించి నరపతివిజయం పేర్కొంది కందనవోలు ప్రస్తావన తో కూడిన గోపాలరాజువర్ణన ఒక సీస పద్యంలో

ఇలావుంది-

సీ శ్రీకృష్ణగోపాల సేవా విహారవిచక్షణుండురు ధర్మరక్షణుండు

వందిత కువలయానంద కరాన్వయ-మండనుండఖిలారిఖండనుండు

రాజీవప్రత్యేక్షణాజనతాపంచ-సాయకుండర్ధ్యర్థదాయకుండు

బాహుబలోగ్ర సపాదమహాబల-భంజనుండాశ్రిత రంజనుండు

తే సతత సేవక నరవరాంచితకిరీట- ఘటిత మణి ఘృణి లలితాంఘ్రికమలుడార

వీటి గోపాలరాజు భూవిభుడు కంద-నోలు నిజ రాజధానిగా నేలె దరణి

పింగళి సూరన కళాపూర్ణోదయం, మూర్తికవి నరసభూపాలీయం, రామరాజారంగప్పరాజు సాంబోపాఖ్యానం మొదలైన గ్రంథాల్లోని అవతారికల్లో కందన వోలుమ పేర్కొలేదుకానీ కందనవోలును పాలించిన అరవీటి రాజుల వర్ణన వుంది అయ్యల రాజునారాయణామాత్యుడు హంస వింశతిలో అనేక గ్రామాలను పేర్కొంటూ

'కందనూరు' ను కూడా పేర్కొన్నాడు ఈ ప్రయోగం కందనోలుకు మరోరూపం

ఇక 18 వ శతాబ్దంలో గద్వాల ప్రభువుల అధికారం కందనవోలుపై కూడా కొంతవరకు అప్పుడప్పుడూ వుండింది పూడూరు వీరారెడ్డి అల్లుడూ గద్వాల పెదసోమభూపాలుని తండ్రి అయిన పెద్దారెడ్డి కందనవోలుపై నాడగౌడు అధికారం కలిగివుండేవాడు. అప్పటికి ఇంకా గద్వాల సంస్థానం ఏర్పడలేదు పెద్దారెడ్డికి కందనవోలు వాడ గౌడకంవున్నట్లు కణాదం పెద్దసోయాజి రచించిన ముకుందవిలాసంలో ఇలావుంది-

ఉ కందనవోలు ముఖ్యముగ గల్గిన సీమల వాడగౌడుకీ

ర్తిందగి. ముష్టిపల్లి కులసింహుడు పెద్దనభూవరుండు పే

రందె నిరూఢి వీరఘను నల్లుడు వైరి మృగాళి లీల్లడై

గద్వాల పెదసోమభూపాలుడిని వర్ణిస్తూ కాణాదం పెద్దనసోమయాజి అధ్యాత్మరామాయణంలో సీ కందమాల్యుఖ్యదుర్గమును దేశముల్లెల్ల దేశముఖైక ప్రతిష్ఠనేలె ముకుందవిలాసంలో శ్లేషగా సోమభూపాలుడు ఇలావర్ణింపబడ్డాడు- సీ. తుంగ భద్రోన్నతి దొడరిరా కందనవోలి మిన్నగు దేశ మేలుబడిగ ఇక్కడ తుంగభద్రోన్నతి కందన వోలి పదాలు చమత్కారంగా ప్రయోగింపబడ్డాయి

యథాశ్లోకతాత్పర్యరామాయణానికి కామసముద్రం అప్పలాచార్యులు రచించిన అవతారికలో కూడా కందమాలు సీమకు పెద్దారెడ్డి వాడగౌడుగా వున్నట్లు ఈ క్రింది పద్యం - తెలియచేస్తుంది-

చం. అయిజయు కందనూలు మొదలైదగు సీమలకెల్ల వాడ గౌ

డయి తనశక్తి శత్రువుల నాజినడంపుచు విక్రమంబు కీ

ర్తి యలర తుంగభద్రకును కృష్ణకు మధ్యమమైన రాజ్యమున్

గయిపసమందనేలుమను గాంచెను పెద్దనృపుండు మోదమున్

గద్వాల పెదసోమభూపాలుడు కందమాల్యుట్టడిగా నవాబర్బ్ దుర్గంబు సాధించి నట్లు కూడా

యథాశ్లోకతాత్పర్యరామాయణంలో వర్ణించబడింది

గద్వాల ప్రభువుల సమాదరణమున వెలసిన పై గ్రంథాల్లో కందనూలు, కందనవోలు అనే రెండువిధాల ప్రయోగాలూ అగుపిస్తాయి

18వ శతాబ్దిలో మాచవరం పాపనామాత్యుడు రచించిన నందవర చరిత్రలో 'అందమైవిలసిల్లు కందవోల్సీమ' అని ఒక పద్యంలోవుంది ఇందలి కందవోల్ ప్రయోగం గమనార్హం

19వ శతాబ్దంలో ఊరెవీరభద్రకవి రచించిన 'కరణికోద్ధారిణి', 20వ శతాబ్దం పూర్వార్ధంలో నరహరి రాజమణి చెట్టి రచించిన గోపాల కృష్ణమూర్తి శతకం, గాడేపల్లి వీరరాఘవకవి రచించిన కర్నూలు జలప్రళయం, దోమావేంకట స్వామి గుప్త రచించిన శ్రీ బ్రహ్మేశ్వరపురాణాదులు మొదలైనవి మాత్రమేగాక అధునికులు, వర్తమాన కవులూ కర్నూలును గురించి రచించిన పద్యాలు గేయాలు, అవధానకవితలు చాటువులు అనేకం వున్నాయి

తెలుగు సాహిత్యంలో కందనవోలును నిశితంగా పరిశీలిస్తే అనేక చారిత్రక సాంస్కృతిక భాషావిశేషాలు తెలుస్తున్నాయి తుంగభద్రానదీ తీరాన విలసిల్లిన కందనవోలు సాహిత్యవిశేషాలు ఇంగా ఎన్నోవున్నాయి అందులో యిప్పుడు రేఖామాత్రంగా మనం ప్రస్తావించుకొన్నది కొంతే

## తొలి తెలుగు నవలా రచయిత నరహరి గోపాలకృష్ణమ శెట్టి

కె యస్ యస్ రాజా–కర్నూలు జిల్లా రచయితల చరిత్ర

బెంగాల్ గెజిట్ ప్రకటన "తమ ప్రాంతంలోని అచార వ్యవహారాలను వచన ప్రబంధ ప్రక్రియలో రచన గావించిన వారికి బహుమానం ఇవ్వబడుతుంది" ప్రకటన గావించినవారు బెంగాల్ గవర్నరు లార్డు మెయోగారు కలకత్తా నుంచి గజిటేరియర్ ద్వారా వెలువడిన ప్రకటన అది!

అ సమయంలో నరహరి గోపాలకృష్ణమశెట్టిగారు కర్నూలులో డెప్యూటీ కలెక్టరు హోదాలో పదవీ బాధ్యతలు నిర్వహిస్తుండేవారు కృష్ణమశెట్టిగారు ప్రతిభావంతుడైన ఉద్యోగే కాదు, కవి కూడా! పై ప్రకటనతో ఆయన కవి హృదయం వికసించింది సమర్థుడైన అధికారి కాబట్టి విధి నిర్వహణకే మాత్రము భంగము వాటిల్లకుండా సమయము కేటాయించుకుని, అహోరాత్రులు శ్రమించి 1872లో శ్రీ రంగరాజ చరిత్ర రచించి పరిశీలనార్థం పంపినారు

కృష్ణమశెట్టిగారు తాను వ్రాసిన గ్రంథం ఉపోద్ఘాతంలో ఇలా విన్నవించుకున్నారు "నేటి హిందువుల (తెలుగువారి) జీవన సంస్కృతికి ప్రతిబింబం ఈ నవీన ప్రబంధం" అంగ్లంలో నావెల్ అన్న పదానికి సమానార్థంలో వచన ప్రబంధము అన్న పేరును కూడా వీరు సూచించినారు శ్రీ రంగరాజ చరిత్రకు "సోనబాయి పరిణయ" మని నామాంతరము కూడా ఉన్నది ఈ ప్రబంధంలో కులాచారాలు, వర్ణ భేదాలు, మూఢాచారాలను నిశితంగా విమర్శించినారు రచయిత ఈ నవీన ప్రబంధమును లార్డు మెయోగారికి అంకితం గావించినారు గోపాలకృష్ణమశెట్టిగారు

బాధ్యతాయుతమైన ఉన్నత ఉద్యోగములో వుంటూ రచన చేయడమన్నది అంత తేలికైన వ్యవహారముకాదు అందుకే వారి కృషి ఫలించినది గజిటేరియర్లో గోపాలకృష్ణమశెట్టిగారి "రంగరాజ చరిత్ర" ను సమీక్షిస్తూ, తెలుగులో వెలువడ్డ తొలి తెలుగు నవల అని ప్రకటించబడినది

పురుషార్థప్రదాయిని మాసపత్రిక (మచిలీపట్నం)లో రంగరాజా చరిత్ర పై సమీక్ష ఇలా వ్రాయబడింది "రంగరాజ చరిత్ర మధుర గ్రాంధిక సాలంకారిక శైలిలో వ్రాయబడిన నవల"

గోపాలకృష్ణమశెట్టిగారి హృదయం ఆనంద డోలికల వూయలలూగినది

తొలి తెలుగు నవలా రచయితగా లార్డు మెయోగారు అధికార ముద్ర వేసినా, మన సాహిత్య చరిత్రకారులు ఆమోదముద్ర వేయకపోవటం విచారించదగ్గ విషయము రాయలసీమ రచయితల దురదృష్టం కాక మరేమిటి?

(తరువాయి 17వ పేజీలో)

# కర్నూలు మండలములో తీర్థక్షేత్రాలు - వాని ప్రాశస్త్యం

-హెచ్ హీరాలాల్ యం ఏ

మన ధర్మం సనాతనం-మన జాతి సనాతనం మన భూమి కూడ సనాతనమే! ఇక్కడి అణువణువు, కణకణము సనాతనమైనదే! మన లక్ష్యం సమస్త మానవ కళ్యాణం ఈ లక్ష్య సిద్ధికై చిత్తశుద్ధిని కలిగించి శుద్ధ సనాతన, దివ్యమానవ, వ్యక్తిత్వ నిర్మాణానికి దోహదం చేసేది తీర్థ క్షేత్ర కల్పన భారత భూమియే ఒక దివ్య తీర్థం,ఒక పవిత్ర క్షేత్రం దీనికి అంతర్గతంగా కూడ ఎన్నో తీర్థాలు క్షేత్రాలు ఈ భావం ఏకాత్మీయతకూ, ఏకరాష్ట్రీయతకూ ఆధారం, సాంస్కృతిక సమైక్యతకు మూలం, ధార్మిక భావాలకు నిలయం

తౄ ధాతువుతో ధ ప్రత్యయము చేరగా తీర్థ శబ్దోత్పన్నమైంది తీర్థ శబ్దానికి-దేవుడు, శాస్త్రము, గురువు, ఉపాయము, మార్గము, ఘట్టము, ఔషధము, జలస్థానము, పవిత్రక్షేత్రము, తీరము, క్షేత్రము అనునవి శాబ్దికార్థాలు మన పావనత్వానికి, సచ్చరిత్రకి, పూజ్యభావాలకి ప్రతీక తీర్థం మన జాతీయతకూ, సంస్కృతిక అఖండత్వానికిది ఆధారం శ్రీ పాద దామోదర సాత్వాలేకర్ తీర్థక్షేత్రాలను గురించి చెబుతూ- ఈ తీర్థ క్షేత్రములు జాతీయ భావనతో ప్రేరితమై నిర్మితమైనవి ఆది శంకరులు ఉత్తరాన బదరీ, దక్షిణాన శృంగేరి, పూర్వదిశన గోవర్ధన, పశ్చిమాన ద్వారకా పీఠాలను పేర దేశానికి నాలుగు వైపులా నాలుగు మఠాలని స్థాపించారు ఈ పీఠాల స్థాపన ఉద్దేశ్యం వెనుక ఆధ్యాత్మిక భావ విస్తరణమే కాదు, దేశ పరిహద్దుల పరిరక్షణ కూడ వున్నట్లు కనిపిస్తుంది ఈ నాలుగు మఠాల ద్వారా ఆయన సరిహద్దుల సంరక్షణకు ఏర్పాట్లు గావించారు అని అంటారు ఇది వాస్తవం

తీర్థక్షేత్రాల కల్పన వెనక ఉపాసన, ఆరాధనా భావం కూడుకొని వుంది ఉపాస్య దైవతాల ఉత్తమ కార్యాలను ఉపాసించడం కూడ దీనికి అంతర్గతమైన లక్ష్యం వ్యక్తి ఉత్తమత్వాన్ని చేరడానికిది యొక ప్రయత్నం దేవాలయ నిర్మాణంలో ఈ భావం ద్యోతక మౌతుంది దేవాలయ రాజగోపురం, బలిపీఠం, ధ్వజస్తంభం, వాహనస్థానం, ఉభయ పార్శ్వాల మందిర ప్రాకారాలు, పిదప వెలుతురు లేని గర్భాలయం అందు ఆరాధనా మూర్తి స్వరూపం-ప్రక్కన వెలిగే దీపం. ముందు హారతి కర్పూరం ఇవన్నీ ప్రతీకలు భౌతిక జీవితంలో పయనించే మానవుడు, సమర్పణ భావంతో ముందుకు సాగి యోగ సాధనలను గావించి సర్వేశ్వరుని సన్నిధిలో హారతి కర్పూరంలా వెలిగి కరిగి పోయినప్పుడే ఆతని దివ్య స్వరూప సందర్శనమౌతుందని ఇందలి భావము కఠోపనిషత్తులో మన శరీరమే మందిరమని చెప్పబడింది

తీర్థ క్షేత్రాలు దివ్య ప్రాకృతిక సౌందర్య నిలయాలు ప్రాపంచిక భావాలకి దాసులైన వారిలో పవిత్రతని కలిగించి జగన్మంగళ భావాన్ని చేకూర్చి పరిశుద్ధత్వాన్ని కల్గిస్తాయి కాబట్టి వేదకాలం నుండి దీనికి ఎంతో ప్రాశస్త్యం చేకూరింది సాంస్కృతికి, ఆధ్యాత్మిక, సమున్నతికి కేంద్రమైనది ప్రాకృతికవాతావరణం అట్టివిలక్షణమైన దివ్య వాతావరణం ప్రశాంతికి నిలయం అందులకే పరంపరాగతంగా హైందవ సమాజంలో తీర్థక్షేత్రాలను మానవ జీవనాన్ని తరింపజేసే నౌకలుగా భావిస్తారు తీర్థక్షేత్రాలు ప్రాకృతిక సౌందర్యానికావాసాలు ఆధ్యాత్మిక వికాసానికి కేంద్రాలు

దేశమే తీర్థక్షేత్రమైనప్పుడు మన మండలము కూడ తీర్థక్షేత్రాల నిలయమే! దానికి దృష్టాంతంగా మన మండలంలోని కొన్ని తీర్థక్షేత్రాలను గూర్చి విశ్లేషణ గావించడం అసంగతం కాదు

శ్రీశైలం కర్నూలు మండలం ప్రాచీన శ్రీశైల సీమకు అంతర్గతమైన విభాగం శ్రీశైల సీమ, అహోబలసీమ, శాతవాహని రట్టము అను పేర్లు ఈ మండలం యొక్క ప్రాచీన వైశిష్ట్యాన్ని తెలుపుతాయి ఈ సీమలో మానసిక, బౌద్ధిక, ఆధ్యాత్మిక రూపాలలో మానవ వికాసము జరిగినట్లు అనేక ఐతిహాసిక సత్యాలు కనిపిస్తున్నాయి శ్రీశైలం పేరు చెప్పి సంకల్పం చెబుతారు దీని వల్ల ఈ ప్రాంతానికి ఎంత ప్రాచీన విశేషత కలదో అంచనా వేయవచ్చును శ్రీశైలం ద్వాదశ జ్యోతిర్లింగాలలో ఒకటి

సౌరాష్ట్రే సోమనాధంచ శ్రీశైలే మల్లికార్జునమ్

ఉజ్జయిన్యాంమహా కాలమోంకారమమలేశ్వరం

పరల్యాం వైద్యనాధంచ,డాకిన్యం భీమశంకరం

సేతు బంధేతు రామేశం నాగేశం దారుకావనే

వారణాశ్యాంతు విశ్వేశం త్ర్యంబకం గౌతమీ తటే

హిమాల యేతు కేదారం ఘశ్మేశంచ శివాలయే

ఏతాని జ్యోతిర్లింగాని సాయం ప్రాతః పఠేన్నరః

సప్త జన్మ కృతం పాపం స్మరణేన వినశ్యతి

ఇది మల్లికార్జున లింగం అను పేర వెలసినది సదా సన్నిహితశ్శంభు శ్రీశైలే మల్లికార్జునః తస్మిన్ దృష్టే తటే లింగే జీవన్ముక్తో న సంశయః అని శ్రీశైల ఖండంలో చెప్పబడింది. శ్రీశైల మల్లికార్జున లింగం జ్యోతిర్లింగం ఈ విషయం శివ పురాణము నందు–

జ్యోతిర్లింగం ద్వితీయంచ ప్రోక్తం మల్లిక సంజ్ఞితం దర్శనాత్ సర్వ సుఖదమ్ కధితిమ్ లోక హితవే అని చెప్పబడింది కాబట్టి మల్లికార్జున లింగం సర్వ పాపాలను హరించి సకల సుఖములను చేకూర్చునని ప్రాచీన ఋషివాణి జక్కన తన విక్రమార్క చరిత్రలో శ్రీశైల మాహాత్మ్యాన్ని ఈ విధంగా కొనియాడెను–

సీ।। శ్రీశైల మాత్మలో జింతించి నంతన జాతి స్మరత్వంబు సంభవించు

వేడ్క దచ్ఛిఖరంబు వీక్షింప గోరిన సప్త జన్మాఘ నాశంబు చేయు

నాత్రోవ రెండు మూడడుగు లేగిన మాత్ర సకల జన్మముల దోషములు పాయు

నత్యంత నియతిమై నగ్గిరి కేగిన బరమ సాయుజ్యంబు బడయవచ్చు

గీ।। నెన్ని భంగుల శ్రీగిరి కేగు వాడు దన్యుడగు నబ్బు నశ్వమేధంబు ఫలము

నట్టి శ్రీగిరి కర్థమై నరుగలేని గుణ విహీనుండు పిచ్చుక కుంటుగాడె!

ఇంతే గాక పాల్కురికి సోమనాధుడు, నాగలూటి శేషనారాధ్యుడు మొదలైన వారు శ్రీశైలేశుని భజించి తరించినారు

. ఈ క్షేత్ర మహాత్మ్యమును భారత రాజన్యమే కాదు, సామాన్య జనానీకం కూడ గుర్తించి దర్శించింది భవిష్య పురాణము ఆధారంగా ఈ సీమలపై మగధేశ్వరుడైన రెండవ చంద్రగుప్తుని పేర నిర్మింపబడిన చంద్రగుప్తి

అనే పట్టణం ఇక్కడ వుండినదనీ, ఈ సీమపై అతని అధికారం వుండినదనీ తెలుస్తోంది శాతవాహనులూ, ఇక్ష్వాకులూ ఇచ్చటి జ్యోతిర్లింగంను ఆరాధించినారు, ఇక్కడి భ్రామరీ శక్తిని పూజించినారు, భ్రామరీ శక్తియే భ్రమరాం బికాదేవి భ్రమర రాజ వంశీయులకీమె ఆరాధ్య దేవత త్రిలోచన పల్లవుడు, శాతవాహన వంశీయుడైన రుద్రసేనుడు ఈ దేవతలను ఆరాధించారు విష్ణుకుండినులు శ్రీ పర్వతస్వామి పాదారాధకులని పిలువబడినారు కాకతీయులు, కొండవీటిరెడ్లు శ్రీశైలేశుని అర్చించినారు శ్రీకృష్ణదేవరాయలు శ్రీశైలేశుని దర్శించి ఎన్నో కానుకలు సమర్పించాడు ఆత్మకూరు, పారుమంచాల మొదలైన గ్రామాలు స్వామి కైంకర్యాల కొరకు దత్తం చేయించాడు 1674 వ సంవత్సరమున మరాఠా వీరుడు ఛత్రపతి శివాజీ శ్రీశైలమునకు వచ్చి భ్రమరాంబా మల్లికార్జునుల సేవించి అపూర్వశక్తులను బడసినాడు ప్రాకారపుగోడకు ఉత్తర గోపురమును కట్టించినాడు మొదటి కల్యాణ చక్రవర్తి త్రైలోక్యమల్ల చాళుక్యుడు సతీసమేతముగ వచ్చి శ్రీశైలేశుని దర్శించినాడు ఇతడి సతీమణి మైలాదేవి, ఈమె శ్రీశైలమున ఒక సత్రమునూ, వేద పాఠశాలనూ కట్టించినది వీటి నిర్వహణకై కలుగొట్ల, శివపురం, జాటూరు గ్రామాలను దానమిచ్చింది రుద్రమదేవి కూడ ఇక్కడ ఒక కల్యాణ మంటపమును నిర్మింపజేసింది ప్రతాపరుద్ర చక్రవర్తి కొన్ని ఉత్సవ విగ్రహముల నొసగినాడు రెడ్డి రాజులు ఈ స్వామికి పరమ భక్తులు

సర్వ ప్రాచీనమైన తీర్థక్షేత్రములలో శ్రీశైలము ఒకటి ఇది కర్నూలుకు 70 మైళ్ళ దూరాన వుంది దీనికి దగ్గరలో కృష్ణానది ప్రవహిస్తున్నది దీనినే ఇక్కడ పాతాళగంగ అని అంటారు భ్రమరాంబదేవి భ్రామరీ శక్తి పీఠము ఈ మహాదేవిని ఎందరో అర్చించు చున్నారు కన్నడిగులు ఎంతోమంది ఈ దేవతని పూజించటానికి వస్తూంటారు ఇది జ్యోతిర్లింగ స్థానమే కాక అష్టాదశ శక్తి పీఠాల్లో ఒకటి శ్రీశైల మొక దివ్య క్షేత్రము

(1) కేదారేహ్యాదకం పీత్వా వారణాస్యాం మృతస్తథా

శ్రీశైలే శిఖరం దృష్ట్వా పురర్జన్మ న విద్యతే

(2) కాశ్యాస్తు మరణాన్ముక్తిః స్మరణాదరుణా చలే

దర్శనాదేవ చ శ్రీశైలే, పునర్జన్మ న విద్యతే –అని ఋషివాణి.

1 శ్రీశైలమునకు త్రిపురాంతక, సిద్ధేశ్వర, అలంపుర, ఉమామహేశ్వరములు ప్రాగ్, దక్షిణ, పశ్చిమ, ఉత్తర ద్వారాలుగా వున్నాయి శ్రీశైల ప్రాంతంలో శిఖరేశ్వరము, పాలధార, పంచధార, కైలాస ద్వారము, భీముని కొలను, హాటకేశ్వరము, సిద్ధిరామప్ప కొలను, ఘంటార్క, సిద్ధేశ్వర మరము మొదలైనవి దర్శనీయ ప్రదేశములు హాటకేశ్వరము వందు ఆదీ శంకరుల వారు తపమొనరించారనునది ఒక ప్రతీహ్యము ఇచ్చటి ప్రకృతి రమణీయకతకు ముగ్ధులై శంకరుల వారు ఇచ్చటనే వుండి పోవాలని అనుకున్నారట కాని చెయాల్సిన సమాజ కల్యాణ కార్య పరి పూర్తికై దేశ పర్యటనకు మరలి పోయారట

శ్రీశైలంలోని-భ్రమరాంబికా మల్లికార్జునులు జైన దేవతలని కూడ పరిశోధకుల అభిప్రాయం మల్లినాథుడు–భ్రమరీ వంటి నామాలు జైనులకు సంబంధించినవి హైందవ ధర్మ ప్రచారాన్ని ముందు యిక్కడ జైనం బాగా వ్యాపించివుంది బౌద్ధ–జైన–హైందవ ధర్మాలకే కాపాలిక–శాక్తేయ–పాశుపత మున్నగు మతాలకీ గడ్డ నెలవే

2 సంగమేశ్వరం–శ్రీశైల క్షేత్రానికి సంగమేశ్వరం వాయువ్య ద్వారం ఇక్కడ కృష్ణవేణి సప్త నదులతో కలిసి సాగుతుంది ఈ ప్రదేశమునకు నివృత్తి సంగమేశ్వరమని పేరు ఇది మిక్కిలి ప్రాచీనమైన తీర్థక్షేత్రము

ఇక్కడ ధర్మరాజు ప్రతిష్ఠించిన లింగమున్నది ఈ లింగము నింబవృక్ష కాండ భాగమని పురాణ ప్రవచనము ఈ సంగమేశ్వరం దివ్య మహత్తు గల క్షేత్రం ఇంతే కాదు, ఇది కాలా ముఖాచార్య పీఠము ఇక్కడ నన్నెచోడ మహాకవి గురువు జంగమ మల్లికార్జున యోగి వుండి నాడు రథాకృతి గల రూపల సంగమేశ్వర దేవాలయం 6,7 శతాబ్దాల నాటిది దాని శిల్పకళ మనోహరమైనది ఇక్కడ సప్త నదీ సంగమేశ్వర జలరాశిపై కృష్ణాజినం మీద కూర్చుని పూదోట లింగావధూత జల సమాధి ఐనారు తపోధనులూ ఐన శ్రీ సత్యనిధి తీర్థుల సమాధి కూడ వున్నది వీరు మహా మహిమ కలిగిన వారు ధర్మ ప్రచారము గావింమతూ సంగమేశ్వర తీర్థానికి వచ్చారట ఆ సమయాన జరిగిన ఒక సంఘటన –

కర్నూలు నవాబు ఒకడు కొల్లాపుర రాజ్యమును కబళించుటకు సైన్యసమేతుడై వచ్చినాడట అప్పుడు కొల్లాపు ర ప్రభువు భీతావహుడై నవాబును ఎదుర్కొన లేక స్వాముల వారిని శరణు జొచ్చినాడట వారు అభయమిచ్చి, మంత్రాక్షతల నిచ్చి పంపారు ఆ రాజు కృష్ణవేణిని దాటి తన కొల్లాపుర సీమలో ప్రవేశించినాడు ఎండాకాలంగుది కృష్ణలో ఏ మాత్రం నీళ్ళులేవు దాటి వెళ్ళాక నదిలోకి నీరు నిండుగా వచ్చేశాయి నది రెండు వొడ్డులని తగులుకొని నిండుగా ప్రవహించింది నవాబు తన సైన్యంతో చాలా రోజులు అక్కడే విడిది చేశాడు, కాని నీరు తగ్గలేదు విధి లేక నవాబు కొల్లాపురం మీద దాడి చేయక తన సేనలతో వెను తిరిగి పోయినాడు ఆ మహా తపస్వి అనుగ్రహానికి ఆనందించిన కొల్లాపురం రాజు ప్రతిగా ఆయనకు గ్రామ దానం చేసినాడట ఇక్కడే స్వామి తన ఇహలీలను సమాప్తము చేయుటకు గాను సజీవముగా బృందావన ప్రదేశము గావించివారు ఈ బృందావనము చక్రతీర్థము దగ్గర వున్నది స్వామి వారు శిల్పశాస్త్రంలో నైపుణ్యం కలవారు కనక తామే స్వయముగా బృందావన నిర్మాణం గావించు కున్నారు శ్రీశైల ప్రాజెక్ట్ వలన ఆ బృందావనమును కర్నూలులోని ఉత్తరాది మఠమునకు తిసికొని వచ్చారు సత్యనిధి గురురాజ తీర్థులు మహా తపస్వి, వారిని కీర్తిస్తూ సత్యనాధ తీర్థులు ఇలా అంటారు–

యదనుగ్రహ మాత్రేణ సద్భిః ఇష్టమవాప్యతే

భక్త్యానమామి తం సత్యనిధిం లోకగురుం ముదే

ఈ తీర్థక్షేత్రం మహా మహిమోపేతమైనది, ప్రశాంతికి నిలయము 'తీర్థ ప్రబంధం' అను గ్రంథంలో శ్రీ వాది రాజ తీర్థులు–

నివృత్తి సంగమో భాతి యత్ర మర్త్య ముపాశ్రితాః

నివర్తంతే ఖిలాదోషాః సంయునక్తి శుభావలిమ్

అని సంగమేశ్వరం గురించి చెప్పినారు ఇక్కడే దక్షయజ్ఞం జరిగినట్లు పురాణాలు చెబుతాయి సతీదేవి దేహత్యాగం చేసిన స్థలమట ఏది ఏమైనా ఈ ప్రదేశం ప్రశాంత వాతావరణంతో కూడుకొని వున్నది ఇది నందికొట్కూరుకు 13 మైళ్ళ దూరాన కలదు

3 అహోబిలం – ఇది నారసింహక్షేత్రం బహుప్రాచీనమైనది నరసింహుని నవరూపాలతో ఆరాధింమతారు ఆ నవరూపాలివి–

(1) ప్రహ్లాద వరద నృసింహ (2) కరంజ నృసింహ (3) యోగానంద నృసింహ (4) ఉగ్రనృసింహ (5) గుహ నృసింహ (6) క్రోడ నృసింహ (7) మలోల నృసింహ (8) జ్వాలా నృసింహ (9) పావన నృసింహ

జ్వాలా మహోబిల మాలోల క్రోడా కారంజ భార్గవాః

యోగానంద ఛ్ఛత్ర వటపావనా నవ మూర్తయః

అని ప్రాచీన వాణి, ఇక్కడే నృసింహుడు ప్రత్యక్షమై హిరణ్యకశిపుని సంహరించి ప్రహ్లాదుని కరుణించి నట్లు పురాణ గాథ, అందులకే-

ఉగ్రం వీరం మహా విష్ణుం

జ్వలంతం సర్వతో ముఖమ్

నృసింహం భీషణం భద్రం

మృ త్యోర్మృత్యుం నమామ్యహమ్

అని వివిధ నామాలతో నృసింహుని స్మరిస్తారు హిరణ్యకశ్యపుని వధించాక ఉగ్రత వదలని నారసింహుని చూచి- నరసింహం పరమం దేవం- అహోబలం అహోబలం అని దేవతాదులు స్తుతించి శాంతింప చేసినందువలన ఈ ప్రదేశమునకు అహోబలమనే పేరు వచ్చినది ఇక్కడ అనేక తీర్థములున్నవి ఐతే భవనాశిని అనే తీర్థమే ప్రధానమైన తీర్థంగా భావించ బడుతూంది ఈ భవనాశినిలో పదమూడు తీర్థములు కలియుచున్నవి అవి-

(1) నరసింహ తీర్థం (2) రామతీర్థం (3) లక్ష్మణ తీర్థం (4) భీమ తీర్థం (5) శంఖ తీర్థం (6) వరాహ తీర్థం (7) సుదర్శన తీర్థం (8) సూత తీర్థం (9) ధారా తీర్థం (10) గజకుండం (11) వైనాయక తీర్థం (12) భైరవ తీర్థం (13) రజిత కుండం

ఇక్కడి నారసింహుడు స్వయంభువమూర్తి, మహా మహిమాన్వితుడు క్రింది అహోబిలంలో లక్ష్మీనరసింహ మందిరముంది కవిత్రయంలో ఒకరైన ఎర్రన మహాకవి అహోబల నారసింహుని చరిత్రనే నృసింహ పురాణం గా వ్రాసినారు రామానుజాచార్యులు, తిరుమంగై యాళ్వార్లు, శ్రీ మన్నిగమాంత దేశికులు, చైతన్య మహాప్రభు మొదలైన వారంతా శ్రీ నృసింహుణ్ణి దర్శించి స్తుతించారని చరిత్రకారులు చెపుతారు ఈ అహోబిల నారసింహుడి ఆలయానికి కొంత దూరంలో ఒక చిన్న దేవాలయముంది అందులో ఒక శివలింగము, ఉగ్ర నరసింహమూర్తి భక్తులకు దర్శన మిస్తుంటారు ఇక్కడే ఒక ఆశ్చర్యకరమైన సంఘటన జరిగింది-

1498-1512 సం॥ల మధ్యకాలంలో అహోబిలాన్ని ఆరవ జియ్యరైన శ్రీ షష్ఠ పరాంకుశ యతీంద్ర మహాదేశిక జియ్యర్ పాలించేవాడు ఆయన నృసింహుణ్ణి సాక్షాత్కరింప జేసికొని ఇక్కడ వున్న ఒక గుహలో స్వామిలో లీనమై నాడట ఆ భయంకరమైన గుహలో ఎవరూ ప్రవేశింప కూడదని ఇప్పుడు ఆ గుహ ద్వారాన్ని మూసివేసినారు

పశ్చిమ చాళుక్య చక్రవర్తిఐన విక్రమాదిత్యుడు (1076-1126) మొదటి మారుగా ఇక్కడి మూల విగ్రహాలని అర్చించినాడట తర్వాత కాకతీయ ప్రతాపరుద్ర చక్రవర్తి వీటికి సరియైన రీతిలో నిర్మాణం చేయించినాడు ఇతడు శ్రీశైలము నుండి వచ్చి అహోబిల ప్రదేశంలో విడిది చేసినాడు. అతడు ఏ ప్రదేశములో ఐతే విడిది చేసినాడో అక్కడ ఒక గ్రామం నిర్మితమైంది. ఆ గ్రామమే నేటి రుద్రవరము దిగువ అహోబిలం దేవాలయాని కెదురుగా ఒక జయస్తంభం కనిపిస్తుంది. 1577 ప్రాంతమున అహోబిలం మహమ్మదీయుల దురాక్రమణకు గురియైంది అప్పుడు అహోబిల మఠం పదకొండవ పీఠాధిపతియైన వణ్శఠకోప శ్రీనివాస

యతీంద్ర మహాదేశిక జియ్యర్ భగవంతుని ప్రార్థించినాడు భగవంతుడి ఆదేశాను సారము పెనుగొండనిపాలిస్తున్న రంగరాయలసహాయాన్ని కోరినాడు ఆ రాజు తన సేనాపతులైన తిరుమల రాజునీ, వెంకటరాజునీ జియ్యర్‌కు తోడుగా పంపాడు ఆ సేనాపతులిరువురూ కలిసి మహమ్మదీయులను పారద్రోలి దేవాలయమును మళ్ళి జియ్యర్‌కు అప్పగించారు

రెడ్డిరాజులు అహోబల నారసింహున కెన్నో కానుకలనొసగి తరించినారు ఒకసారి అనంతపుర సీమ పాలకుడొకడు ఈ మందిరముపై దాడిచేసి కొల్లగొట్టినాడు ఆ సందర్భమున విజయనగరాధీశులు మందిరమును రక్షించి భవిష్యత్తులో యిట్లు జరగకుండా తగిన ఏర్పాట్లు గావించినారు వైష్ణవ ధర్మప్రచారానికి అహోబిలమొక కేంద్రం ఇది కర్నూలు జిల్లాలోని ఆళ్ళగడ్డకు దగ్గిరలో వున్నది

4 యాగంటి – ఇది మిక్కిలి ప్రాచీనమైన శైవక్షేత్రం ఇక్కడి దైవతం ఉమామహేశ్వరుడు ఈ క్షేత్రం గూర్చి యాగంటి లక్ష్మప్ప అను భక్త కవి విశేషంగా కీర్తించినాడు "నేగంటి నేగంటి" అంటూ శివుని దర్శించి తరించినాడు నేగంటి రూపమే ఏగంటి- యాగంటి ఐనది యాగంటి ఉమామహేశ్వరుడు చిన్మయ స్వరూపుడు

ఇక్కడ ఒక గుహవుంది అందులో శ్రీ మద్విరాట్ పోతులూరి వీర బ్రహ్మం గారు తపస్సు చేసినారు ఈ ప్రదేశము కొండల్లోవుంది ఇది దాటి ముందుకు సాగితే మద్దులేటి కొండ వస్తుంది ఇదికూడ మహిమాన్వితమైన తీర్థక్షేత్రం అది కొండగా లేదు లోయగా వుంది ఇక్కడి మూల విరాట్టు నరసింహాంశ కలిగిన మూర్తి

5 మహానంది – నల్లమల అడవుల్లో వెలిసిన దివ్య క్షేత్రమది పౌరాణికంగా ఇది చాలా ప్రసిద్ధి పొందినది సుందరతరమైన ప్రకృతి సంపదకు ఇది నిలయము ప్రకృతి నడుమ విరాజిల్లే ఈ ప్రదేశం భక్తజనులకెంతో ఆనందాన్ని కలిగిస్తుంది మందిర నిర్మాణంలో చూపిన చాతుర్యమెంతో ప్రశంసనీయం ఇక్కడకోనేరులో నంది నోటి నుండి నీరు వస్తుంది నంది నోటి నుండి ధారగా పారే ఈ నీరు ఎక్కణ్ణుండి వస్తుందో అవగతం కాలేదు చాలా స్వచ్ఛమైన నీరు కోనేటిలో నాణెము విసిరి వేసి మళ్ళీ తీసికోవచ్చు, అంతటి స్వచ్ఛత!!

ఈ ప్రాంతాలలోని విష్ణునంది, కృష్ణనంది, నాగనంది, వినాయకనంది మొదలైన ప్రదేశాలు దర్శనీయమైనవి

6 మంత్రాలయం – ఇది తుంగభద్రానదీ తీరాన వెలసిన మహాక్షేత్రం శ్రీ రాఘవేంద్రస్వాములు 17వ శతాబ్దంలో ఇచ్చట సజీవంగా మహా సమాధి ఐనారు ఆ సమయంలో సిద్ది మసూద్ ఖాన్ అదోని పాలకుడుగా వున్నాడు అతడు అసమానపరాక్రమవంతుడు ఆ అహం కారముతో అతడు శ్రీవారి పరీక్షింప దలిచాడు కాని శ్రీవారు అతనికి జ్ఞానోదయాన్ని కలిగించారు అందుకుగాను ప్రతిగా సిద్దిమసూద్‌ఖాన్ స్వామి వారికి మంత్రాలయ గ్రామాన్ని సమర్పించుకున్నాడు

మంచాల అనునది మంత్రాలయానికి పూర్వనామం ఇక్కడే ప్రహ్లాదుడు యజ్ఞం చేశాడట ఇక్కడి గ్రామదేవత మాంచాలమ్మ ఆమె మందిరము స్వామివారి బృందావనానికి ఎదురుగనే వున్నది 19వ శతాబ్దం పూర్వార్థంలో జరిగిన ఒక సంఘటన ఇది-

ఈస్టిండియా కంపెనీలో మన్రో అధికారిగా వున్నాడు మంత్రాలయాన్ని మద్రాసు ప్రభుత్వంలోకి ఐక్యం చేసికోవడానికి వచ్చాడు కాని స్వామి వారి బృందావనం దగ్గర చేరగనే అక్కడ మంత్రాలయ రాఘవేంద్రుని అధికారం వున్నట్లు చూశాడట ఈవిషయం మద్రాసు రివ్యూ పత్రికలోనే కాక బళ్ళారి గెజిట్‌లో కూడ

ప్రచురితమైంది. స్వామి వారి శిష్యుడు అప్పణాచార్యుల వారు శ్రీవారిని "శ్రీ పూర్ణ బోధ గురు తీర్థ పయోబ్ధిపారా" అని నుతించినారు కోరిన కోరికలను తీర్చే కల్ప వృక్షంగా స్వామి వారిని

శ్లో. పూజ్యాయ రాఘవేంద్రాయ సత్య ధర్మ రతాయచ

భజతాం కల్ప వృక్షాయ నమతాం కామధేనవే

అని అప్పణాచార్యుల వారే కాక భక్తులంతా స్తవం చేస్తారు రాఘవేంద్రస్వామి అంటే- ప్రహ్లాదరాజః ప్రధమో ద్వితీయో వ్యాసరాజకః రాఘవేంద్రస్తుతీయస్తు భగవత్ కార్యసాధకః అని భక్తుల అభిప్రాయము శ్రీ రాఘవేంద్ర స్వామి ప్రజా కళ్యాణమే ధ్యేయంగా భావించి పరమేశ్వర సన్నిధానమే సర్వస్వమనుకొని మధ్వ సిద్ధాంతాన్ని ప్రచారం చేసిన మహాతపస్వి అయన మహిమలు అపారము ఇట్టి మహత్తర మహిమాన్వితమైన మహా తీర్థక్షేత్రాలే కాక మరెన్నో పూజనీయ మందిరాలు ఈ మండలాన కలవు-

7 నందవరం - ఈ మండలాన సర్వ ప్రాచీనమైన నగరం ఇక్కడ చౌడేశ్వరిదేవి మందిరముంది ఈ దేవతమహామహిమ కలది నందన చక్రవర్తి ఆహ్వానాన్ని అందుకొని కాశీ నుండి వచ్చి ఇక్కడ వెలసినది. నందవరీక బ్రాహ్మణులకు ఈమె కులదేవత తొగట వీర క్షత్రియులకు ఆరాధ్య దేవత, చౌడేశ్వరి చాముండేశ్వరికి అపభ్రంశ రూపం. మహిషాసుర సంహారియైన జగదంబ కొలువు కూటము బోనములతో నిప్పుల మీద నడక, భక్తుల భక్తితత్త్వము చాలా ఆశ్చర్యాన్ని కల్గిస్తాయి ఆమె సన్నిధిలో భక్తులు ఆవేశంతో ఎన్నెన్నో మహత్కార్యాలు సాధిస్తారు.

"చౌడేశ్వరిదేవి మహాత్మ్యము" ను ద్విపద కావ్యముగా కోటి రామస్వామి వ్రాస్తే, అత్తలూరు పావన కవి, గుమ్మరాజు రామ కవి పద్య కావ్యములుగా వ్రాసినారు

8. బనగానపల్లె . బనగానపల్లెలో గరిమిరెడ్డి అచ్చమ్మ ఇంటవీర బ్రహ్మం పసుల కాపరిగా వుంటూ అవల తత్వమును ప్రబోధించినాడు, కాలజ్ఞాన తత్వము ను వ్రాసినాడు వారిల్లే ఒక మందిర మైనది, ఇదే విధంగా పూదోట లింగావధూత కానాలలో మఠమును నిర్మించి ప్రచారము గావించినాడు

9 ఆదోని : ఆదోనిలో లక్ష్మమ్మ అను సిద్ధయోగిని తన మహిమలను చూపి ప్రజలను ఆధ్యాత్మికత వైపు మరల్చినది ఆదవాని కొండపై వెలసిన రణమండల ఆంజనేయ స్వామి అళియ రామరాయలు మొదలైన రాజులకు ఆరాధ్యదైవతం. కోరికలను తీర్చే కల్పవృక్షము ఆ మూల విరాట్టు.

10 ఉరుకుంద : 16 వ శతాబ్దంలో కౌతాళంలో జన్మించిన హిరణ్యయ్య శ్రీ నృసింహుని భక్తిచే మహి మహిమాన్వితుడై ఉరుకుంద గ్రామంలో తన నివాస మేర్పరచుకుని భక్తి ప్రచారమును గావించినారు చివరకు అచ్చటి వేప చెట్టులోనే విలీనమై పోయారు అక్కడ నృసింహస్వామి ప్రభావం విశేషంగా కనిపిస్తుంది జగత్కల్యాణమే ఆధారమైన ఈ క్షేత్ర మాహాత్మ్యం సామాన్య జనాలకి ఆధ్యాత్మిక భావం గరుపుచున్నది ఇదే విధంగా - హిరణ్యయ్య గారి అనుగ్రహం పొందిన మునిస్వామి నాయక్ ప్రభావము ఆలూరు తాలూకాలోని నెరణికి తాండా గ్రామంలో అగుపిస్తుంది కౌతాళం గ్రామంలోనే జన్మించిన మహాపురుష రంగయ్య గారి ప్రభావంకూడ సర్వజన విదితమే! మహాపురుషులు పుట్టిన స్థలములే దివ్య క్షేత్రములు అని విద్యాంసులంటుంటారు, వారి మాట నూటికి నూరుపాళ్ళు యధార్థమే

11 బ్రహ్మగుండం వెల్దుర్తి దగ్గర బ్రహ్మగుండం ఒక దివ్యక్షేత్రం ఇది బహు ప్రాచీనమైనది అడవిలో

వుంది ఇక్కడ మహత్తు అనేక విధాలుగా చెబుతారు ఇంతేగాక గొందిపర్ల, నాగలదిన్నె, తర్తూరు, గోరంట్ల, రామతీర్థం, ఓంకారం మొదలైనవి ఈ మండలంలో మహత్తరమైన క్షేత్రాలు ఇవన్నీ ప్రజలకు ఆధ్యాత్మిక సందేశాన్నొసగే దివ్య కేంద్రాలు కొలుట్ల చెన్నకేశవస్వామి, తర్తూరు రంగస్వామి, పోలకల్లు చెన్నసోమేశ్వరస్వామి మందిరాలు దర్శింప దగినవి దీబగుంట వీర భద్రస్వామి మందిరం బహు ప్రాచీనమైనది ఇదొక వీరశైవక్షేత్రం ఇక్కడ స్థల పురాణాన్ని దీబగుంట వీరభద్రస్వామి చరిత్ర పేర క్రిష్టి పాటి వేంకట సుబ్బ కవి వ్రాశారు

చెంచు వారికి కోరికలని తీర్చే దేవత మంత్రాలమ్మ ఈ దేవత శిరువెళ్ళ ప్రాంతంలోని మంత్రాల కనుమలో వెలసింది చెంచు వారికిది దివ్యక్షేత్రం

కర్నూలు మండలం సర్వ ప్రాచీనమైన తీర్థక్షేత్రాలకి నిలయమనుటకు శ్రీశైల, అహోబిలాది ప్రదేశాలే సాక్షి తుంగభద్రానదీ తీరానికి అవతల ఇవతల ప్రాచీనమైన శివాలయములు, రామ మందిరాలు ఎన్నో కనిపిస్తాయి గొందిపర్లలోని శివాలయానికి రామేశ్వరమని జనవాణి ఇంతేకాదు, జైన బౌద్ధ మత ప్రచారాలకు కేంద్రంగా ఈ సీమ వెలిగింది రెండవ హరిహరుని పరిపాలనా కాలంలో కర్నూలు నగరంలో ఒక చైత్యాలయముండింది ఇది బైచయ దండనాథుని కుమారుడైన బుక్క మంత్రిచే నిర్మితమైంది ఇక్కడ కుంట తీర్థంకరుల విగ్రహం ప్రతిష్ఠించబడి వుండింది ఆ మూర్తి పగిలిపోయి పాద ఫలకం మాత్రం హంపీ పురావస్తు సంగ్రహాలయానికి చేరింది ఈ మూర్తి 1395లో ప్రతిష్ఠితమైనట్లు ఫలకం మీద చెక్కబడివుంది ఇంతే గాక ఆదవాని బారాఖిల్లా కొండ మీద సుందరమైన జైన మందిరం నిర్మించబడివుంది ఇందులో తీర్థంకరుల మూర్తులు వున్నాయి అందులో పార్శ్వనాథుని మూర్తి దర్శనీయమైనది హాల పూర్వి గ్రామం వద్ద కొండ మీద రాష్ట్ర కూటుల నాటి శాసనంలో రాణి చంద్రాయవ్వ సిందవాడిని పరిపాలించే సమయంలో నందవరం నందు జైన మందిరం నిర్మించినట్లు పేర్కొనబడివుంది చిప్పగిరి కొండపై వెలసిన మందిరాలు జైనులకు చెందినవి అక్కడవున్న చెన్నకేశవాలయము అలియ రామ రాయల కాలము నాటిది దానికి చెందిన శాసనాలు అక్కడ భగ్నావస్థలో కనిపిస్తాయి చిప్పగిరిని అనాడు శిల్పగిరి అనే వారు అక్కడ మధ్వ సాంప్రదాయానికి చెందిన విజయదాసుల వారి సమాధి వున్నది

సుందరమైన ప్రాచీన మందిరాలు మత పిచ్చికి గురియై మసీదులుగా మారి పోయినాయి ఏమైన అనేకమైన మతోన్మాద దారుణాలను ఎదురొడ్డి జాతికి, ధర్మానికి ప్రతీకలై వెలసిన సగుణోపాసన కేంద్రాలు ఈ ప్రాచీన తీర్థక్షేత్రాలు

హైందవ జీవనానికి లక్ష్యం పరమేశ్వర సన్నిధానం, పరమేశ్వరుణ్ణి సాకారంగా, నిరాకారంగా మనవారు ఆరాధించారు ఏకాత్మీయతకు ఆధారమైన ఈ పూజా ప్రదేశాలు నేటి భౌతిక వాతావరణంలో చిక్కుపడకుండ పరతత్వ పథము వైపు సాగుటకు సన్మార్గదర్శకములు

(విశ్వహిందూ పరిషత్ కర్నూలు జిల్లా ధర్మసమ్మేళన ప్రత్యేక సంచిక సౌజన్యముతో)

---

(9వ పేజీ తరువాయి)

నరహరి గోపాలకృష్ణమశెట్టిగారు తొలి తెలుగు నవలా రచయితగా ప్రకటించబడి, కర్నూలు జిల్లాకే ఎనలేని ఖ్యాతిని చేకూర్చినారు

చిన్నయసూరి, వీరు కలసి హిందూ ధర్మశాస్త్రమును తెలుగులోనికి అనువదించినారు కర్నూలు జిల్లా మాన్యువల్‌ను ఆంగ్లమున రచించినారు వీరి కుమారులు కె రాజామణిశెట్టి తమ తండ్రిగారి పేరున గోపాలకృష్ణమశెట్టి జీవితమును "గోపాలకృష్ణమూర్తి శతకము" గా రచించిరి అందులో గోపాలకృష్ణమూర్తిగారు బ్రౌన్ దొరవారి కత్యంత మిత్రుడని, సహాయకుడని తెలుపబడినది ఆంధ్ర వ్యాకరణము, కందనోలు భూగోళము కూడా రచించి ఖ్యాతి గాంచినారు

# :కర్నూలు నగరంలో దర్శనీయ స్థలాలు:

-జగర్లపూడి సీతారామకృష్ణ శర్మ, యం ఏ , బి ఎడ్.,

కర్నూలు రాయలసీమకు కేంద్రం, ఆంధ్రుల తొలి రాజధాని ఒక వంక అహోబిలం, మరొక వంక మహానంది, ఒక వంక మంత్రాలయం మరొక వంక శ్రీశైల క్షేత్రాలు ఈ కర్నూలు జిల్లాను ఆశీర్వదిస్తున్నవి

కర్నూలు నగరానికి తుంగభద్ర, హంద్రీ నదులు సహజమైన అగడ్తలై శోభిల్లు తున్నవి సమున్నతమైన కొండారెడ్డి బురుజు, పైనున్న ఫిరంగి కర్నూలు నగరశౌర్య ప్రతీకముగ భాసించుచున్నది 7, 18 జాతీయ రహదారులు రెండును కర్నూలు నగరము గుండ పోవుచున్నవి

1 విశ్వహిందూ పరిషత్ వారు ఏకాత్మతా యజ్ఞపు గుర్తుగ నిర్మించిన భారతమాత ఆలయము నంద్యాల చెక్ పోస్టు దగ్గర ఉన్నది సింహవాహనయై లక్ష్మి సరస్వతి, దుర్గా బీజాక్షరములపై ప్రతిష్ఠించబడిన 5 అడుగులు ఎత్తు భారతమాత శిల్పరమణీయము.

2 నగరమున ప్రతి వర్ష వినాయక విమజ్జనమున కనుకూలముగ కె సి కెనాల్ వద్ద నిర్మించిన శ్రీ వినాయకుని గుడి వినాయక ఘాట్ సోపాన పుష్ప వాటిక, తూర్పు తీరమున నున్న బిర్లా సత్యనారాయణ మందిరములు మహిమాన్వితములు

3 కర్నూలు బి-క్యాంపులో నిర్మించిన పార్థసారధి ఆలయ కళ్యాణ మంటపములు, విద్యాలయములు అందున్న పాలరాతి కృష్ణ విగ్రహము సందర్శనీయములు

4 కృష్ణానగర్‌లోని శ్రీ వేంకటేశ్వర స్వామి ఆలయ కళ్యాణ మంటపములు దర్శించతగినవి నిత్య పూజలకు శ్రీ వేంకటేశ్వర ఆలయం పేరొందినది

5 రాఘవేంద్రనగర్లోని పిరమిడ్ ధ్యాన మందిరము, ధ్యానాభిలాషులకు కేంద్రమైన విచిత్ర కట్టడము పిరమిడ్‌లోని ప్రశాంతత అనుభవైకవేద్యము

6 వేంకటరమణ కాలని వేంకట రమణుని గుడి, కళ్యాణ మంటపముల ప్రణాళికలుకల సువిశాల ప్రాంగణము

7 పెద్దపార్కు నేడు కిడ్స్ వరల్డ్ పేరుతో ప్రసిద్ధమై చిత్ర విచిత్ర యంత్రములచే వృక్షములచే చిన్నారి బాలలకు ఆకర్షణీయమై యున్నది

8 రాంభొట్ల దేవాలయము కుమ్మరిగేరి వద్ద తుంగభద్ర నదీ తీరమున నున్న పురాతన దేవాలయము గోకర్ణ క్షేత్రవాసి రామాభొట్లు నిర్మించిన విశాల ఆలయం ఇందులో సీతారామలక్ష్మణులు, శంకరాచార్యులు, గాయత్రీమాత విగ్రహములు పూజలందు కొంటున్నవి

9 పూలబజారులోనున్న అమ్మవారి శాల దేవాలయ నిర్మాణమునకొక వినూతన శైలిని ప్రదర్శించుచు అచటి వారి అమ్మవారి భక్తి ప్రపత్తులకు నిదర్శనముగ నుండి చూపరులనాకర్షించును.

10. నగరేశ్వరస్వామి ఆలయము కర్నూలు నగరమంత ప్రాచీనము ప్రక్కనున్న అంజనేయస్వామి ఆలయము కర్నూలు నగర యువభక్తుల భజన కార్యక్రమముల ప్రతిధ్వనించుచుండును

11. షిర్డీ సాయిబాబా దేవాలయము నిర్మించిన దాదిగా దాని షట్కోణ శిలాతలమునకు, సోపానములకు, స్వామి మహిమలకు నిలయమై ప్రధమ యాత్రికా కర్షణగానున్నది

12 పంచలింగాల – నదికి ఆవలి ఒడ్డున నున్న గ్రామం ఇచట ప్రాచీన ఆలయములున్నవి ఒక పాన వట్టముమీద ఐదు లింగములు ప్రతిష్ఠించబడుట ఇచట ప్రత్యేకత, కళ్యాణి చాళుక్యుల శాసనములు కలవు.

ఇట్టి మహిమాన్విత ఆలయములతో,(ఆంధ్రి) హంద్రీ, తుంగ, కడప కర్నూలు కాలువ పుణ్యజలముతో యాత్రికులను కర్నూలు నగరము ఆహ్వానించును

# Brief History Of The Kurnool Municipality

(Presented At Centenary Celebrations )

Y.C. Mastan Rao, B A, B Com, B Ed
Commissioner & Spl Officer, Kurnool Municipality

It is highly gratifying to note in letters of gold, that the Kurnool Town has had its rich past emerging from the laudable periods of the imperial Nawabs and Rajas The Historical monuments that are standing even today are the mute laurels of their past glory and victory This historic town of Kurnool standing on the banks of River Tungabhadra and Hundri is like a lotus in the serene waters To add to its beauty, the city is encircled by Temples, Mosques and Durgas and holy shrines presenting the cultural diversity of the nation An old saying goes that Kurnool itself is a Temple of 72 shrines of all castes and creeds

This ancient and historic town was constituted in to a Municipality in the year 1866 extending its limits to an extent of 9 3842 Kilo meters As per the census of 1971, its population is 1,36,710 and the present population can be estimated as 1,60,000

It has a Municipal Council of 36 Councillors including 3 Lady Councillors The Administration of the Municipality is run by the Commissioner assisted by the different section heads namely Municipal Engineer (Executive Engineer cadre) Municipal Health Officer, Town Planning Officer, Revenue Officer The Municipal Commissioner, (Special Grade) is also the Special Officer of the Municipality since performing the functions of the Municipal Chairman and the Council till the elected Council comes in to Office

With in the Municipal limits the Municipality maintains 75,900 Kilo Meters of roads of all types Steps are being taken to convert major portion of the roads into C C and B T surface roads Two State High Way roads namely Kurnool Bellary road and Kurnool Chittoor road are passing through the Municipal limits which are maintained by the Roads and Buildings Department

It has a fine Municipal Guest House of 7 suits well equipped with necessary facilities for the occupants The town is provided with as many as 2,400 Nos Street lights out of which 800 Nos are tube lights and 1600 Nos filament lamps

This Municipality is aware of the educational needs of the community Under its management there are 54 Elementary Schools with 350 teachers, including 8 Nos Upper Primary Schools and 3 Secondary Schools from 6th to 10th Classes with 131 Teachers

Sincere efforts are being made to construct our own buildings every year with a view to reduce the number of rented private buildings for Municipal Elementary Schools It is worth mentioning here that the Govt have

been giving cent percent grant to the Municipality since 1975 There are also many types of other schools in the town maintained by the Govt and also by private managements This town also enjoys the privilege of having 17 other High Schools, 4 Degree Colleges, one Training College, One Medical College and a state institution and the pride of the town, "Silver Jubilee College" The establishment of a Post Graduate Center in the year 1977 is the glorious academic achievement of this town

It is a matter of pride that this Municipality has been running 7 Reading Rooms situated in the various localities of the town The District Central Library maintained by the Govt is an asset to the town

This Municipality is in no way less interested towards provision of Medical Relief to the poor and needy It has 4 Municipal Dispensaries and a Maternity and Child Welfare Centre and all systems of a medicine such as Allopathic, Homeopathic, Unani and Aurvedic are practised In emergency cases the Maternity services are rendered at the residences of the individuals

There is also an Urban Family Planning Centre attached to the Municipal Maternity Centre

The city is developing in all directions "HEALTH IS WEALTH" is the accepted belief The Public Health Department is having the staff sanctioned in the year 1953 which is quite insufficient to look after the sanitary needs of the town From this it is quite evident that there is no sufficient sanitary staff to attend to the needs of the newly developed areas The sanitation of such areas is being maintained by engaging gang work on weekly shift system and steps have been taken to get sanction for adequate staff

The Anti Malaria Scheme with 1/3rd grant by the Government is in operation in this Municipality There are two Municipal Burial Grounds The Municipal Health Officer also looks after the registration of Births and Deaths in this Municipal area It has 58 Public Latrines and a Municipal Compost yard The scheme of providing Septic Tank Public Latrines is not successful due to inadequate water supply Yet every owner is insisted to have a Septic Tank Latrine whenever the building permission is applied for Besides the Municipality has decided to advance loans from the revolving bund to rate payers for construction of Septic Tank Latrines The Municipality also maintains two slaughter houses, three Vegetable markets and a Bus stand

The open drainage system runs to a length of 2 855 Rft. There are narrow lanes and byelanes in the old town The under ground drainage system is essential for the over all improvement of the sanitation the benign Government have been apprised for the sanction of this scheme

The protected water supply scheme of this Municipality came into operation in the year 1897 when its population was only abut 25,000 Sincere

efforts are being made to provide sufficient quantity of drainage water to the ever increasing population of this growing town This Municipality has sponsored a number of water supply schemes to improve the existing system and to redress the grievances of the general public However it is strongly felt that unless the old mains which were laid during good olden days and incrusted are replaced This Municipality cannot satisfy one and all in the old town areas The Water Supply budget is not self sufficient The annual deficit of about Rs 10 Lakhs has to be met from other resources of the Municipality

The Municipality has provided four public parks, and Planted 827 Avenue Trees giving shade and shelter to the rich and poor alike

The provision of all the above civic amenities warrants the Municipality to have schemes of renumerative enterprises to augment its finances Totally there are 94 shop rooms constructed by this Municipality Out of which 29 shops and one Open Air Theatre were recently constructed at an estimated cost of Rs 8 Lakhs The shops are already leasedout and the capital cost will be reimbursed within 3 years by way of monthly rents derived from the Municipal Shop Rooms This is an important step to improve the finances of the Municipality on one side and to add to the beauty of the city on the other side in Bus stand area

Besides a G T P Scheme this town has 7 town Planning Schemes to signify the importance of a city There are seventy six L I G Quarters They are allotted not only to Municipal Employees but also for outsiders on hire purchase system This Municipality has also constructed 193 tenements in Sri Saibaba and Sanjeevaiah Nagar and they are alloted to the poor hut-dwellers This is a step to eradicate the slum areas in the town Besides this Municipality has invested a huge amount of Rs 16 Lakhs in Government securities Its total assets at the end of the year are about Rs 1 16 Crores and whereas its liabilities are only about Rs 20 7 Lakhs

There is also a full Pledge Nutrition Programme with 20 centres in the town covering all slum areas benefiting about 5000 children pregnant ladies and nourishing mothers with cent percent Government aid

To improve the lots of the Sanitary Workers, this Municipality is taking up the construction of quarters in the site already acquired by the Municipality in Khanderi

In conclusion this Municipality is highly thankful to the rate-payers and the General Public for their sincere appreciation of the efforts of this institution and enthusiastic cooperation in-achieving success in the different activities of this Municipality

# కర్నూలు పురపాలక సంఘ అధ్యక్షులు

| | |
|---|---|
| 1) శ్రీ వై యస్ ఫెజియన్ | 1868 మరియు 1869 |
| 2) శ్రీ | 1878 నుండి 1880 |
| 3) శ్రీ హెచ్ ఏ సింప్ | 1881 నుండి 1882 |
| 4) శ్రీ | 1883 నుండి 1887 |
| 5) శ్రీ ఏ వెంకోబరావు | 1888 నుండి 1894 |
| 6) శ్రీ టి.చితంబరావు | 1894 నుండి 1900 |
| 7) శ్రీ పి సీతారాంపంతులు | 1901 నుండి 1902 |
| 8) శ్రీ పి టి సల్దెన | 1902 |
| 9) శ్రీ పి. దొరస్వామి అయ్యంగార్, బి ఏ | 1903 నుండి 1907 |
| 10) రావుబహదూర్ శ్రీ యస్ పి నరసింహరావు , బి ఏ | 1908 నుండి 1919 |
| 11) శ్రీ యస్ రామస్వామయ్య, బి ఎ ,బి యల్ | 1920 నుండి 1922 |
| 12) శ్రీ యస్ నరసింహులు, బి ఎ , బి యల్ | 1922 నుండి 1924 |
| 13) శ్రీ ఓ లక్ష్మణస్వామిరావు, యం ఏ బార్‌అట్‌లా | 1924 నుండి 1927 |
| 14) శ్రీ యస్ నరసింహులు, బి ఎ , బి యల్ , | 1927 నుండి 1931 |
| 15) శ్రీ కె అచ్చయ్య శెట్టి, బి ఎ , బి యల్, | 1931 నుండి 1934 |
| 16) జనాబ్ అబ్దుల్ సలాంఖాన్ సాహెబ్ | 1934 నుండి 1938 |
| 17) శ్రీ రావుబహదూర్ జె రామయ్య శెట్టి | 1938 నుండి 1947 |
| 18) జనాబ్ యం మహబూబ్ అల్లీఖాన్ సాహెబ్ | 1947 నుండి 1952 |
| 19) శ్రీ యస్ నరసింహరెడ్డి | 1952 నుండి 1956 |
| 20) జనాబ్ యం మహబూబ్ అల్లీఖాన్ సాహెబ్ | 1956 నుండి 1962 |
| 21) శ్రీ పాలాదిరామయ్య | 1962 నుండి 1964 |
| 22) శ్రీ కె నాగిరెడ్డి | 1967 నుండి 1972 |
| 23) శ్రీ దావూద్ ఖాన్ | 1981 నుండి |
| 24) శ్రీ కె నాగిరెడ్డి | |
| 25) శ్రీ దావూద్ ఖాన్ | 1986 |
| 26) శ్రీ యం సుధాకర్ బాబు | 1987 నుండి 1992 |
| 27) శ్రీ బంగి అనంతయ్య (నగరపాలిక మేయర్) | 1995- |

# కర్నూలు పురపాలక సంఘపు కమీషనరులు

| | |
|---|---|
| 1) శ్రీ యం యస్ జగన్నాయకుల నాయుడు | 1934 నుండి 1937 |
| 2) శ్రీ లక్ష్మణ పిళ్లే బి ఎ , బి యల్ | 1938 నుండి 1939 |
| 3) శ్రీ పి పిచ్చి రెడ్డి | |
| 4) శ్రీ వై గురురెడ్డి, బి ఏ , బి యల్, | 1941 నుండి 1943 |
| 5) శ్రీ సి వి సుబ్రమణ్యం, బి ఏ ,బి యల్, | 1943 నుండి 1944 |
| 6) శ్రీ జి రాజేంద్రరావు నాయుడు, యం ఏ, | 1945 |
| 7) శ్రీ కె వెంకటాద్రిచౌదరి, బి ఏ, | 1945 నుండి 1946 |
| 8) శ్రీ యస్ సీతారామయ్య, బి ఏ , బి యల్, | 1946 నుండి 1948 |
| 9) శ్రీ సి పి సుబ్బయ్యచౌదరి, బి ఏ , బి యల్, | 1948 నుండి 1949 |
| 10) శ్రీ పి కోటిలింగం, బి ఏ, | 1949 |

| | | |
|---|---|---|
| 11) | శ్రీ జె మోహన్‌రావు, బి ఏ, | 1949 నుండి 1950 |
| 12) | శ్రీ పి యస్ వాసుదేవన్, బి ఏ, | 1950 |
| 13) | శ్రీ యస్ కృష్ణయ్యశెట్టి, బి ఏ , బి యల్, | 1950 నుండి 1951 |
| 14) | శ్రీ పి అప్పిరెడ్డి, బి యస్ సి, | 1951 నుండి 1952 |
| 15) | శ్రీ యస్ సుబ్బారావు | 1953 |
| 16) | శ్రీ ఆర్ లక్ష్మిపతి, బి ఏ , | 1953 నుండి 1957 |
| 17) | శ్రీ యస్ కృష్ణయ్యశెట్టి, బి ఏ ,బి యల్, | 1957 నుండి 1958 |
| 18) | శ్రీ ఆర్ ఆర్ మహేంద్ర, బి యస్ సి, | 1958 నుండి 1959 |
| 19) | శ్రీ డి విశ్వనాథరెడ్డి, బి ఏ , | 1959 నుండి 1960 |
| 20) | శ్రీ పి అప్పిరెడ్డి, బి యస్ సి , | 1960 నుండి 1961 |
| 21) | శ్రీ డి రామచంద్రారెడ్డి, బి ఏ , బి యల్ , | 1961 నుండి 1963 |
| 22) | శ్రీ డి విశ్వనాథరెడ్డి, బి ఏ , | 1963 నుండి 16-12-65 |
| 23) | శ్రీ జె యస్ పి రావు పట్నాయక్, ఇంజనీరు మరియు సెక్రటరి స్పెషల్ ఆఫీసరు ఇన్‌చార్జి | 17-12-65 నుండి 15-3-66 |
| 24) | శ్రీ హరిశంకర్, బి ఏ , యల్ యల్ బి , | 16-3-66 నుండి 25-7-66 |
| 25) | శ్రీ యస్ రంగారావు, బి ఏ , | 26-7-66 నుండి 2-1-67 |
| 26) | శ్రీ కె నగేశ్‌రావు, ఇంజనీరు మరియు సెక్రటరి స్పెషల్ ఆఫీసరు ఇన్‌చార్జి | 3-1-67 నుండి 31-3-67 |
| 27) | శ్రీ టి హెచ్ రంగారావు, బి ఏ , | 3-1-67 నుండి 31-3-67 |
| 28) | శ్రీ పి రామిరెడ్డి, బి ఏ , | 1967 |
| 29) | శ్రీ తాండవ కృష్ణ, ఇంజనీరు మరియు సెక్రటరి స్పెషల్ ఆఫీసరు ఇన్‌చార్జి | 1968 |
| 30) | శ్రీ శంకరరావుదేశాయి, బి ఏ ,యల్ యల్ బి , | 1969 నుండి 1970 |
| 31) | శ్రీ డబ్ల్యు పి దేశపాండే, బి ఏ , | 3-6-70 నుండి 1-12-70 |
| 32) | శ్రీ పి మార్టిన్, బి ఏ , | 2-12-70 నుండి 9-12-70 |
| 33) | శ్రీ డబ్ల్యు పి దేశపాండే, బి ఏ , | 10-12-70 నుండి 16-8-71 |
| 34) | శ్రీ ఐ కేశవప్రసాద్, బి యస్ , యల్ యల్ జి డి , | 17-8-71 నుండి 2-11-73 |
| 35) | శ్రీ ఐ రామారావు, ఇంజనీరు మరియు స్పెషల్ ఆఫీసరు ఇన్‌చార్జి | 3-11-73 నుండి 1-2-74 |
| 36) | శ్రీ జి శేషేంద్రశర్మ, బి ఏ , | 2-2-73 నుండి 9-5-74 |
| 37) | శ్రీ ఐ రామారావు, ఇంజనీరు మరియు స్పెషల్ ఆఫీసరు ఇన్‌చార్జి | 10-5-74 నుండి 8-9-74 |
| 38) | శ్రీ యస్ ఈశ్వరయ్య, బి ఏ , యల్ యల్ బి , | 9-9-74 నుండి 23-10-75 |
| 39) | శ్రీ బి పుల్లారెడ్డి, బి ఏ,బి ఇ , ఇంజనీరు మరియు స్పెషల్ ఆఫీసరు ఇన్‌చార్జి | 24-10-75 నుండి 24-12-75 |
| 40) | శ్రీ యం ప్రసాదరావు, యం ఏ , | 25-12-75 నుండి జూలై 78 |
| 41) | శ్రీ వై పి మస్తాన్‌రావు, బి ఏ , బి ఇడి , | 17-7-78 నుండి జూన్ 80 |
| 42) | శ్రీ పి జి శ్రీరాములు | 15-7-80 నుండి 30-10-83 |
| 43) | శ్రీ బి ఆర్ కృష్ణమూర్తి యం ఇడి , | 1-11-83 నుండి 5-7-84 |
| 44) | శ్రీ పి యస్ రాజశేఖరన్, | 5-7-84 నుండి 11-7-85 |
| 45) | శ్రీ యన్ యస్ కృష్ణమూర్తి నాయుడు | 12-7-85 నుండి 31-3-88 |
| 46) | శ్రీ పి శేషారెడ్డి, యం ఇడి , | 1-4-88 నుండి 16-10-89 |
| 47) | శ్రీ కె సత్తార్ ఖాన్ లోధి | 16-10-89 నుండి 28-4-90 |

48) శ్రీ పి శేషారెడ్డి, యం ఇడి , 29-4-90 నుండి 21-8-90
49) శ్రీ బి పోలురాజా, యం ఏ , 22-8-90 నుండి 24-3-91
50) శ్రీ యం మధుసూదన్ 25-3-91 నుండి 30-6-91
51) శ్రీ బి పోలురాజా, యం ఏ , 6-7-91 నుండి 4-9-91
52) శ్రీ మాణిక్ సింగ్ 5-7-91 నుండి 25-1-93
53) శ్రీ కె అంజనేయులు 25-1-93 నుండి
54) శ్రీ యం ప్రసాదరావు (కర్నూలు నగర పాలిక) 1996-97

# కర్నూలు నగరపాలిక విశేషాంశములు

1886లో ప్రారంభించబడిన కర్నూలు మునిసిపాలిటీ 19-8-1994 తేదిన నాటి ముఖ్యమంత్రి గౌరవ శ్రీ కోట్ల విజయభాస్కర రెడ్డిగారి కృషితో శ్రీ రాంభూపాల్ చౌదరిగారు అమాత్యులుగా శ్రీ కె చంద్రశేఖర్ కల్కూర గారు నగర కాంగ్రెస్ అధ్యక్షులుగా వుండగా కర్నూలు నగర పాలికగా ఉన్నతి పొందింది

10-1-1997 లెక్కల ప్రకారం కర్నూలు మునిసిపల్ కార్పోరేషన్ వైశాల్యం 15 01 చ.కి మి. 1991 జనాభా లెక్కల ప్రకారం కర్నూలు నగర జనాభా 2,33,717 కార్పొరేషన్ అన్నిస్థాయిల ఉద్యోగుల సంఖ్య 1509 1995-96 సంవత్సర ఆదాయం రూ 7 94 కోట్లు వ్యయం రూ 7 91 కోట్లు

44 మంది మునిసిపల్ కార్పొరేటర్లు, ఒక మేయర్, ఒక ఎం ఎల్ ఏ, ఒక ఎం పి., 5గురు కో ఆప్టెడ్ సభ్యులు ఇరువురు మైనారిటీ సభ్యులు నగరపాలిక జనరల్ బాడీగా వుందురు''

నగరంలో 79 కి మి. సిమెంటు, 82 కి మి తారు, 83 కి మి మెటల్, 10 కి మి కచ్చా, 6 కి మి నేషనల్ హైవేస్, 23 కి.మి ఆర్ అండ్ బి రోడ్లు కలవు' ఉపరితల అంతర మురుగునీటి కాలువల పొడవు 220 కి మి. 87 కి మి నీటి పైపులు, 12000 నీటి కొళాయిలు, 555 బోర్స్ వున్నవి ప్రతి దినము 52 లక్షల గ్యాలనుల నీళ్ళు సప్లయి చేయబడుచున్నవి 5323 వీధి దీపములు వున్నవి

నగరమునందు 49 ప్రాధమిక పాఠశాలలు, 262 మంది ఉపాధ్యాయులు, 9171 మంది విద్యార్థులు, 7 ప్రాథమికోన్నత పాఠశాలలు, 79 మంది ఉపాధ్యాయులు, 2904 విద్యార్థులు, 6 ఉన్నత పాఠశాలలు, 102 మంది ఉపాధ్యాయులు, 2570 మంది విద్యార్థులున్నారు

12 సూయింగ్ సెంటర్లు, 27 వయోజన విద్యాకేంద్రములు ఉన్నవి 4 మునిసిపల్ ఆసుపత్రులున్నవి. 100 అంగన్‌వాడీలు పనిచేయుచున్నవి

800 మంది పట్టగల ఒక ఇండోర్ స్టేడియం, 25000 మంది పట్టగల ఔట్‌డోర్ స్టేడియం, 4000 మంది పట్టగల ఓపన్ఏయిర్ థియెటర్లు వున్నవి ఒక మ్యూజియం, కిడ్స్‌వరల్డ్, 13 పార్కులు, 5 ట్రాఫిక్ ఐలెండ్లున్నవి. 9 కళ్యాణ మంటపములున్నవి 5 షాపింగ్ కాంప్లెక్స్‌లు, 155 షాపులు, 2 మార్కెట్లు, 2 కబేలాలు వున్నవి

63000 మంది నివసించు 41 మురికివాడలున్నవి అందులో ఒకటి మాత్రము ఇంకనూ అభివృద్ధి కాలేదు 70 పబ్లిక్ లెట్రిన్స్, 10 శ్మశాన వాటికలు, 650 చెత్తకుండీలు, 7 ట్రాక్టర్లు, 1 లారీ, 2 జీపులు, 1 కారు, కార్పోరేషన్‌కు వున్నవి

**యం. ప్రసాద రావు**, ఐ ఎ యస్ , మునిసిపల్ కమీషనర్, కర్నూలు వారి సౌజన్యంతో.

# వాగ్గేయ కారక మూర్ధన్యులు - కాకర్ల త్యాగరాజు

డా. ములుకుట్ల బ్రహ్మానంద శాస్త్రి, యం.ఏ పి హెచ్ డి
ఆంధ్రోపన్యాసకులు, ప్రభుత్వ డిగ్రీ కళాశాల , కర్నూలు

శ్రీ త్యాగరాజు పూర్వులు కర్నూలు జిల్లా కాకర్ల గ్రామానికి చెందినవారు విజయనగర సామ్రాజ్య పతనానంతరం త్యాగయ్యగారి ముత్తాత పంచనదబ్రహ్మం గారు తిరువారూరు వలసవెళ్ళారు. పంచనదబ్రహ్మంగారి కుమారులు గిరిరాజబ్రహ్మం గిరిరాజబ్రహ్మం కుమారులు రామబ్రహ్మం రామబ్రహ్మంగారి కనిష్ఠ పుత్రులు త్యాగబ్రహ్మం తిరువారూర వెలసియున్న త్యాగేశ్వరస్వామి వరప్రసాదంగా జన్మించిన కారణాన రామబ్రహ్మందంపతులు తమ పిల్లవానికి త్యాగబ్రహ్మం అని నామకరణం చేశారు త్యాగరాజు రామభక్తి సామ్రాజ్యపట్టభద్రులు వారి ప్రతిభ బహుముఖీనం దివ్యనామ సంకీర్త నలువ్రాశారు ఉత్సవసంప్రదాయ కీర్తనలు వ్రాశారు కృతులను వెలయించారు కృతి రచనకు అభ్యాసన కల్పులు త్యాగయ్య. గేయనాటకరచనకు మార్గదర్శకులు రామాయణ రహస్యార్థప్రకాశకులు త్యాగయ్య మానవమాత్రులుగా జన్మించినా ఎన్నో దైవాంశలున్నాయి వారిలో

వ్యాసో నైగమ చర్చయా మృదుగిరా వల్మీక జన్మా మునిః

వైరాగ్యే శుకఏవ భక్తి విషయే ప్రహ్లాద ఏవస్వయం

బ్రహ్మానారద ఏవచాప్రతిమయోః సాహిత్యసంగీతయోః

యో రామామృత పాననిర్జిత శివః తం త్యాగరాజం భజే!

శాస్త్ర చర్చయందువ్యాసులు. మృదువైన పదవిన్యాసంతో కూడిన రచన చేయటంలో వాల్మీకులు వైరాగ్య విషయంలో శుకయోగీంద్రులు భక్తి విషయంలో ప్రహ్లాదులు సాహిత్యవిషయంలో బ్రహ్మ . సంగీతంలో నారదులు రామనామామృత పానం చేయటంలో శివులు త్యాగరాజు.

18వ ఏట రామకృష్ణానందయతీంద్రులవల్ల రామ మంత్రోపదేశం పొంది రోజుకు 1,25,000 చొప్పున రామనామజపం నియమంతో చేశారు. రామాయణకృతి రచన చేయాలన్న తలంపు కలిగింది. కాని సంగీత శాస్త్రంలో ఎన్నో సందేహాలు. గుర్వను గ్రహంతో సందేహాలు తొలగించుకోవాలను కున్నారు. 'ఆచార్యస్సహరిః సాక్షాత్' గదా! రామచంద్రుడే గురువుగా భావించారు.

నీచిత్తము నిర్మలము నిశ్చలమని నిన్నేనమ్మినాను

నా చిత్తము చంచల చంచలమని నన్ను విడనాడకుమీ!!

గురువు చిల్లగింజ గురువే భ్రమరము, గురుడే భాస్కరుడు

గురుడే పరసవేది, గురువే ఉత్తమ గతి అట్టిగురువునీవే అని రామునితో మొరపెట్టుకొన్నారు. దయాశరథి దాశరథి మనసు కరగింది

శ్రీరాముని ప్రేరణతో రామకృష్ణానంద యతీంద్రులు వచ్చి త్యాగయ్యకు నారదమంత్రోపదేశం చేశారు నారదమంత్ర జపం నిష్ఠతో ప్రారంభించారు నారదానుగ్రహం లభించింది త్యాగయ్యగారికి నారదుని వల్ల

స్వరార్ణవం, నారదీయం అను గ్రంధాలను బహుమానంగా పొందారు ఆగ్రంధ పరిశీలనంతో సందేహాలు తొలగాయి శ్రీమద్రామాయణకృతి రచనకు శ్రీకారం చుట్టారు సంస్కృతాంధ్ర రామాయణగ్రంధాలలోని విశేషాలతోబాటు స్వీయ అనుభూతులను కూడ కీర్తనలలో జొప్పించి రామాయణ రహస్యార్థ ప్రకాశకులైనారు

విశ్వామిత్రుని యాగరక్షణ సందర్భంగా మారీచుని మదహరణ సమయంలో శ్రీరాముని ఫాలభాగంలో అలకలు అల్లలాడినట్లు- అప్పటి శ్రీరాముని రూపంజూచి విశ్వామిత్రుడెంతగనో పొంగారని వ్రాశారు త్యాగయ్య ఇది త్యాగయ్య గారి స్వోపజ్ఞము అలకలు అల్లలాడినప్పటి శ్రీరాముని రూపం జూచి పొంగింది విశ్వామిత్రుడు కాదు త్యాగయ్యగారే.

అలకలు అల్లలాడగ గని ఆరాణ్మునిఎటు పొంగెనో

చెలువు మీరగను మారీచుని మదమణచే వేళ

శ్రీరాముని పట్టాభిషేక భంగమునకు కైక కారకురాలుగాదు అన్నవిషయాన్ని వర్ధని రాగంతో -మనసా-మనసామర్ధ్యమేమి? అన్న కీర్తనలో వివరించి అపరవాల్మీకులైనారు త్యాగయ్య

శ్రీరామపట్టాభిషేక వార్తను కైకకు ముందుగ తెలియ జెప్పింది మంథర కైకకు శ్రీరామ పట్టాభిషేకవార్త బ్రహ్మానందం కలిగించింది ఆసంతోషంలో కైక మందరకు ముత్యాలహారం బహుకరించింది మంధరదుర్బోధతో కైక మనసు మారింది పట్టాభిషేక భంగానికి కైక ఎంతగానో పట్టుపట్టింది అని పైకి అనిపించినా రామ పట్టాభిషేక భంగానికి దేవతలు తెరవెనుక నాటకం ఆడిన విషయం యధార్థంగదా! దేవతల నాటకం తెలిసిన గాని పాఠకులకు కైక మీద కోపం తొలగే అవకాశం లేదు

శ్రీరాముడే కైకను మాయవలలో వేసుకున్నారట!

శ్రీరాముడే కనుక కైకను మాయవలలో వేసికోకుంటే పట్టాభిషేక భంగమేలేదు పట్టాభిషేకభంగమే లేకపోతే శ్రీరామ వనగమనమే లేదు వనగమనమే లేకపోతే సీతాపహరణమే లేదు సీతాపహరణమే లేకపోతే రావణసంహారమేలేదు రావణసంహారమే శ్రీరామావతారప్రయోజనం కదా!

ఇలాంటి అద్భుతమైన రచనలు చేస్తున్న విషయం గురువైన శొంఠి వేంకట రమణయ్యగారికి తెలిసింది. గురువుగారింట పాడారు. గురువు గారి ఆనందానికి హద్దులు లేవు తంజావూరులో నున్న శొంఠివేంకట సుబ్బయ్యగారింటిలో పాడారు ఆ పాట శరభోజీ మహారాజా ఆహ్వానానికి దారితీసింది తనపై రెండుకీర్తనలు వ్రాసిపాడుమన్నది శరభోజీ ఆహ్వానసారాంశం త్యాగయ్యగారు రాజాహ్వానాన్ని తిరస్కరించారు

నిధి చాలసుఖమా రాముని సన్నిధి సేవ సుఖమా అని మనసును సంబోధించి ప్రశ్నించారు. మన ఏవ మనుష్యాణాం కారణం బంధ మోక్షయోః కదా! శ్రీరాముని సన్నిధిలో పాడటం వల్ల కలిగేసౌఖ్యం మిన్న అని భావించిన వారు కాబట్టే- శ్రీరాముని సన్నిధానంలో పాడాలన్న తన తపనను పలు సందర్భాల్లో వెల్లడించారు

బంగారు మేటిపాన్పుపై భామామణి జానకి

శృంగారించుకొనిచెలువొందగ పొంగుచునిన్ను

కని మల్లె విరుల పూజించు వేళ సంగీతము

పాడుమని స్వామి శ్రీ త్యాగరాజుతో- రామాభి రామ

మనసురంజిల్లగ పలుకుమా!

పోతన భాగవతం నిత్యపారాయణ గ్రంధం త్యాగయ్యగారికి శ్రీకైవల్యపదంబు చేరుటకై శ్రీకృష్ణుని చింతించెదవని పోతనగారు చెప్పుకున్నారు. మోక్షప్రాప్తికి సంగీతాన్ని పాథేయంగా స్వీకరించారు త్యాగయ్య పోతన జీవన విధానం త్యాగయ్య జీవన విధానం ఒకటే ఇరువురి రచనా విధానం ఒకటే భక్తిరసామృత ప్రవాహమ్మునకు ఏతామెత్తిన మహాకవులు పోతన త్యాగయ్యలు త్యాగయ్య గారికి శ్రీరామదాసుగారు ఆదర్శం కలియుగమున భద్రాచలమున వెలసిన రామభక్తులలో రామదాసుగారు అగ్రగణ్యులని త్యాగయ్యగారు శ్రీరామదాసుగారికి నివాళు లర్పించారు తమ ప్రహ్లాద విజయగేయ నాటకంలో

పోతన, గోపన, త్యాగయ్య - ముగ్గురు ఆంధ్రమాత అనుంగు బిడ్డలు. ముగ్గురు రామయ్యను తన్మయత్వంతో ఆడి పాడి తరించిన వారే 96 కోట్ల రామనామ జపం పూర్తి చేశారు బాలుడై కోదండపాణియై విశ్వామిత్రునివెంట అనుజ సహితుడై వెళ్ళే శ్రీరామదర్శనం చేశాడు త్యాగయ్యగారు

రాజాహ్వానమును అంగీకరించలేదని తనమాటలను వినలేదను ఆగ్రహంతో త్యాగయ్యగారు అన్నగారు జపేశం త్యాగయ్య పూజించు శ్రీరామ పంచాయతనాన్ని కావేరిలో పడద్రోశారు విగ్రహాలు తిరిగిపొందటానికి మూడు మాసాలు పట్టింది త్యాగయ్యగారికి. ఆ సందర్భంలో త్యాగయ్య గారు చెప్పిన ప్రతికీర్తన ఒక ఆణిముత్యం ఉదాహరణకు ఒకటి-రెండు

దాచుకోవలెనా దాశరథే నీదయ

కనికరము కల్గి కాంతను ముద్దిడు వేళ

జనకజ నామాట సమయమని చెప్పితే-

ఒకనాడు శ్రీరాముడు సీతను ముద్దుపెట్టుకోబోయారట సీత కిష్టమే అయినా రామునితో అన్నదట మీ భక్తుడు త్యాగయ్య తాను పూజించే విగ్రహాలను కోల్పోయి అన్నపానీయములు ముట్టకుంటే ఇప్పుడు నన్ను ముద్దు పెట్టుకుంటాను అంటారేమిటి? మీ భక్తునికి విగ్రహాలనిప్పించి వచ్చి తీరుగానన్ను ముద్దు పెట్టుకోవచ్చు అందిట

2)పదునాలుగు సంవత్సరాల వియోగానంతరం అయోధ్యకు తిరిగి వచ్చిన శ్రీరామునికి పాదాభివందనం చేశారట భరతుడు భరతుని భ్రాతృభక్తికి కరగిన శ్రీరాముడు భరతుని కౌగలించుకొన్నారట అప్పుడు భరతుడన్నారట అన్నయ్యా! పదునాలుగు సంవత్సరాలు నీవియోగాన్ని భరించిన నేను కొద్ది గంటలు భరించలేనా మీ భక్తుడు త్యాగయ్య తాబూజించే మీ విగ్రహాలను కోల్పోయి నిత్యపూజలేక- అన్నపానీయాలు ముట్టక ప్రాణాలు కడబట్టిన స్థితిలో ఉంటే ఇప్పుడా నన్ను దయజూచేది? నీ భక్తుని రక్షించి వచ్చి నన్ను అలింగనం చేసుకోవచ్చు అన్నారట

పదముల వ్రాల కని కరగి కరుణ సే యు వేళ భరతుడెంతోనన్ను

భక్తుడని పలికితే- దాచుకోవలెనా!

3)నేమమున పరిచర్యసాగడు వేళ సౌమిత్రి త్యాగరాజుని మాట పలికితే- శ్రీరాముడు లక్ష్మణుడు

తమకు అరణ్యవాసకాలంలో చేసిన పరిచర్యను గురించి పొగడటం ప్రారంభించారట లక్ష్మణుడు అన్నారట అన్నయ్యా నేను మీకు పరిచర్య చేసిన మాటనిజమే! మీ పొగడ్తలకు నేను తగిన వాడనే! అయినా అందుకు ఇది తగిన సమయంకాదు. మీ భక్తుడు త్యాగయ్యను రక్షించి వచ్చి తీరుగా నన్నుపొగడ వచ్చునన్నారట

ఇట్టి అద్భుతమైన రచనలు చేసి సంపూర్ణ శ్రీరామసాక్షాత్కారభాగ్యాన్ని పొందిన సుకృతి త్యాగయ్య చుక్కల రాయని గేరు మోముగల సుదతి సీతమ్మ సౌమిత్రి రాముని కిరుప్రక్కల నిలబడి కొలచే ముచ్చటను చూడాలని తపించారు త్యాగయ్య శ్రీరాముడను గ్రహించారు "కనుగొంటిని శ్రీరాముని నేడు నాకామితము దీర కనులార" అని తన అదృష్టానికి ఎంతగనో మురిశాడు

సగుణోపాసనచేశారు సగుణధ్యానముపైని సౌఖ్యము త్యాగరాజానకెరుకే అని చెప్పుకున్నారు నిర్గుణోపాసన చేశారు జీవిత చరమాంకంలో నామ కుసుమములచే పూజించే నరజన్మమే జన్మమన్నది త్యాగయ్య సిద్ధాంతం త్యాగయ్యది మధుర భక్తి. 'ప్రాణనాధ బిరానబ్రోవవే ' అన్నారు పాలుపట్టినా శ్రీరామునకు తాంబులమిచ్చినా- తాను ఇచ్చానన్న భావనతో గాకుండా సీత ఇచ్చిందన్న భావనతో వేసుకోవలసిందని కోరారు శ్రీరాముని

శ్రీహరి దివ్యనామ సంకీర్తనలు త్యాగరాజ మహనీయుని భక్తి సంగీత రచనాసాగరమున ప్రాదుర్భవించిన ఆణిముత్యాలు, భక్తలోక మధుప మందారాలు, త్యాగరాజ హృదయ భావ విస్ఫోరకాలు ఆత్మాశ్రయ కవిత్వంవారిది త్యాగయ్య భావకవి త్యాగయ్య దర్శించినంతగా శ్రీరామచంద్రుని సౌందర్యాన్ని వాల్మీకి కూడా దర్శించలేదన్న మాట ప్రత్యక్షర సత్యం.కారణాంతరాల చేత తమిళ దేశంలో జన్మించినను తెలుగు భాషలో కీర్తనలు వెలయించి గాయకులకు భక్తిముక్తులను ప్రసాదించిన త్యాగయ్య ప్రాతస్మరణీయుడు

వీరి పూర్వీకులు కర్నూలు జిల్లాకు చెందినవారు కావటం- తుంగభద్రానదీ పుష్కరాల సందర్భంగా ఆ మహనీయుని స్మరించుకోవటం తెలుగువారికి అవశ్యకర్తర్వం ఆ సందర్భాన వెలువడుతున్న సావనీర్ (సంచిక) లోత్యాగయ్యను కూడ చేర్చాలన్న కోరిక కలిగిన సంచిక నిర్వాహకులు శ్రీ జె యన్ ఆర్ కె. శర్మగారు కడుంగడు అభినందనీయులు.

ఏ కలాకలితుండు లోకోపకారియై నౌకాచరిత్ర మున్నతి రచించె
ఏ దయా పరుడు ప్రహ్లాద భక్తి విజయమను ప్రబంధ మొనర్చి వినుతికెక్కె
ఏమహాత్ముండు రామనామాం కితంబగు వివిధ కృతుల్ జేసి భువిని నిలిపె
ఏనయశాలి నానానూన గాన తానానుపమాన విజ్ఞాని యయ్యె
రమణ నేగుణి వేంకట రమణ భాగవత గృహంబున పర నిరూపిత సురూపుడయ్యె
నాతని త్యాగరాజార్య వర్య ధైర్యవిజితా మరాహార్య దలతునెపుడు!

---

## చాగలమర్రి త్యాగశీలి ఆర్.కె రాం

వీరిది కర్నూలు జిల్లా ఆళ్ళగడ్డ తాలూకా చాగలమర్రి గ్రామం వీరు 1922లో జన్మించినారు వార్ధా ఆశ్రమంలోను, శాంతినికేతన్‌లోను విద్యనభ్యసించారు దేశభక్తుడు, వ్యష్టి సత్యాగ్రహంలో, క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని జైలుకెళ్ళారు గొప్ప సంస్కర్త గాంధీజీ నౌఖాళీ యాత్రలో పాల్గొన్న దేశభక్తుడు కర్నూలు జిల్లా కాంగ్రెస్ సంఘానికి కార్యదర్శిగాను కర్నూలు జిల్లా బోర్డు సభ్యులుగాను ఆంధ్ర విశ్వవిద్యాలయం సెనెట్ మెంబర్‌గా పనిచేశారు ఆంధ్రప్రదేశ్ సర్వోదయ మండలి కార్యదర్శిగాను అధ్యక్షులుగాను పని చేశారు ఆంధ్రప్రదేశ్ భూదాన యజ్ఞబోర్డు సభ్యులుగాను ఉపాధ్యక్షులుగాను వ్యవహరించారు ఇజ్రాయిల్‌లోని సహకార సంస్థను అధ్యయనం చేయడానికి ఇజ్రాయిల్‌ను సందర్శించారు చాగలమర్రిలోని నేటి జడ్ పి సంస్కృత ఉన్నత పాఠశాల వారు స్థాపించిందే

# ప్రబంధ కళాపూర్ణుడు - పింగళిసూరన

-డా. గెలివి సహదేవుడు, యం యస్
సూరన సారస్వత సంఘం, నంద్యాల

11వ శతాబ్దంలో కావ్యరచనారూపం సంతరించుకొన్న తెలుగు కవిత్వం అంచెలంచెలుగా మహోన్నత శిఖరాధిరోహం గావించింది కవిత్రయ భారతాంధ్రీకరణతో, అనువాదయుగారంభ మయి అపూర్వ సంస్కృత కావ్యలను తెలుగు పారకులకు అందించింది త్రిలింగభారతి తర్వాత శ్రీనాధ కవిసార్వభౌముని ఆవిర్భావం తెలుగు కావ్యరచనలో నూతన ధోరణులకు ద్వారాలు తెరిచింది సంస్కృత సాహిత్యంలోని ఇతివృత్తం మాత్రం స్వీకరించి స్వీయ కవితాశైలిలో, భిన్నభిన్న కథా కల్పనానల్పం ప్రారంభమయింది 15వ శతాబ్దం మధ్యకాలం వరకూ ఈ ప్రక్రియ కావ్యయుగవైభవంగా విరాజిల్లింది చాతుర్యంతో స్వతంత్రకావ్యాలు రచించడం ప్రారంభమయింది 15వ శతాబ్దం మధ్యకాలం వరకూ ఈ ప్రక్రియ కావ్యయుగవైభవంగా విరాజిల్లింది

ఈ 15వ శతాబ్దాంతంలోని కవులు మరొక్క అడుగు ముందుకు వేసి ఇతివృత్తం సంస్కృతసాహిత్యంనుండో, లేక పూర్వకవుల తెలుగు కావ్యాలనుండో గ్రహించి, అష్టాదశవర్ణనలతో ఆలంకారిక విన్యాసాలతో, అపూర్వపదబంధచాతుర్యంతో ప్రకృష్టమైన రీతిలో రచనలను బంధించటం మొదలు పెట్టి, ఆరీతి సంవిధానానికి ప్రబంధనామం సార్థకం చేయటం మొదలుపెట్టినారు.ఈ రీతి ప్రక్రియా సౌరభవ్యాప్తికి ప్రబంధయుగం అంటూ నామకరణం చేశారు ఆ నామకరణ ముహూర్తబలమెలాంటిదో కాని నేటికీ మహాకావ్యరచన ఆ ప్రబంధధోరణిలోనే సాగుతూండడం గమనార్హం ప్రబంధయుగం అనగానే సాహితీ సమరాంగణ సార్వభౌముడు, విజయనగర సామ్రాజ్య చక్రవర్తి శ్రీకృష్ణదేవరాయలూ, అతని భువన విజయ సభాభవనము; తదాస్థాన అష్టదిగ్గజ కవులూ స్ఫురించక మానరు అష్టదిగ్గజకవులలో అగ్రగణ్యుడు, ఆంధ్రకవితాపితామహ బిరుదభ్రాజితుడూ ఆయిన అల్లసాని పెద్దన ప్రబంధయుగా గ్రాసనాసీనుడై మనకు సాక్షాత్కరిస్తాడు ఆ మహాకవి మనుచరిత్ర తదనంతర కవులపై బలీయమైన ప్రభావం నెఱపి అపూర్వ ప్రబంధ సృష్టికి హేతువై నిలచింది

15వ శతాబ్దారంభం నుండి 16 వ శతాబ్దం మధ్యకాలం వరకూ ఆంధ్ర కవిత్వానికి స్వర్ణయుగమనే ఆనాటి మనుచరిత్ర మొదలు ఎన్నెన్నో అద్భుత ప్రబంధాలు సృష్టింపబడ్డాయి

ఆనాటి కవులందరికీ ఒకరినిచూచి మరొకరికి స్పర్ధ, ఆస్పర్ధ అపూర్వ కావ్యరచనలను సృష్టించాలన్న విషయములోనే! ఒకరినిమించి మరొకరుగా తమతమదైన శైలితో తెలుగు కవిత్వంలో ఆశ్చర్యకర ప్రయోగాలు చేశారు.పెద్దన మనుచరిత్ర వ్రాస్తే, భట్టుమూర్తి వసుచరిత్రవ్రాశాడు అయినా తనివిదీరక హరిశ్చంద్రనలోపాఖ్యాన ద్వ్యర్థి కావ్యం రచించాడు అయితే ఈ ద్వ్యర్థి ప్రబంధ సృష్టికి మార్గం చూపిన మహానుభావుడొకడున్నాడు

ఆ ఉద్దండ పండితకవే పింగళిసూరన!శ్రీ కృష్ణదేవరాయల ఆస్థానంలోని అష్టదిగ్గజాలలో ఒకడుగా అతని ఉనికి సందేహాస్పదంగా వున్నా, రాయలయుగంగా కీర్తించబడ్డ ప్రబంధయుగకవులలో ఒకడనేది నిరనుమాన విషయం ప్రబంధకవుల మార్గమంతా గతానుగతికంగా సాగుతూన్నదినాలలో ఆ పంథాలోనే పయనించినా, సమకాలీన కవులకంటే భిన్నమైన రీతినీ, తనదంటూ ఒక ప్రత్యేక ప్రతిభనూ చాటి ఒక వెలుగు వెలుగాలన్న తపన కల్గిన కవిగా, తనకాలంలోని రాజాదర కావ్యరీతులను కాదని ధిక్కరించి క్రొత్తమార్గం ఎంచుకున్న తిరుగుబాటు కవిగా ప్రత్యేక స్థానం సంపాదించుకున్న మహాకవి పింగళిసూరన

పింగళివారిని గురించిన అనేక కథలు ప్రచారంలో వున్నా, సూరన మాటలలోనే చెప్పాల్సి వస్తే,

రంగుగ గౌతమీ పరిసరంబుల కృష్ణ ణ్కెలంకులన్ ఘనుల్

పింగళి రామయాదులు, లలిన్ బలనాటను పాకనాటనున్

బింగళి గాదయాదులు- ఇటబెంపు వహించిన యస్మదాదులున్

బింగళి గోకమంత్రి యిలుపేరని చాల బ్రసిద్ధులెల్లవోన్

అనుటవలన గౌతమీ, కృష్ణాతీరాలలో కొందరు, పలనాట, పాకనాటి సీమలతో కొందరు పింగళి వంశమువారు వలసపోగా, ఇట అనగా పింగళిసూరన ప్రస్తుతము తానున్న నంద్యాల ప్రాంతముల పింగళి సూరన వంశీకులు పింగళిగోకన యింటిపేరనే, ప్రసిద్ధులయినారని!

సూరన ప్రభావతీ ప్రద్యుమ్నంలో చెప్పిన ఈ పద్యంలోని 'ఇట' చాలమందికి ఎందకో సందేహాన్నందించింది ఇది స్పష్టంగానే వినిపిస్తూన్న అర్థం ఈ పద్యం వ్రాస్తూన్న కాలంనాటికి పింగళి సూరన ఎక్కడున్నాడో - ఇట కు- అక్కడేనని విస్పష్టార్థం! దీని కనుమానాలూ, వివరీతార్థాలు అనవసరంఆ రీతిగా, పింగళివారు మొదట గౌతమీ తీరంలోని పింగళి గ్రామ వాసులే అయినా, నంద్యాల ప్రాంతానికి ఒక శాఖ తరలివచ్చిందనీ, ఆశాఖలో పింగళి సూరన జన్మించాడనీ నిశ్చితార్థం

ఆంధ్ర సాహిత్యరంగంలో సూర్యునివలె వెలిగిన పింగళిసూరన గిరిజాకళ్యాణం అనే గ్రంథము కూడా వ్రాసినాడని రంగ రాట్ఛందములో ఉదాహరింపబడిన పద్యం ద్వారా తెలుస్తున్నది. కానీ ఇంతవరకూ అది అలభ్యగ్రంథమే పోగా, ప్రభావతీ ప్రద్యుమ్న అవతారికలో తానే చెప్పుకున్నట్లే, జనముల్ మెచ్చగ మున్ రచించితి నుదంచద్వైఖరిన్ గారుడంబున్, శ్రీ రాఘవపాండవీయము; గళాపూర్ణోదయంబున్ మతిన్- అనిన పద్యాన్ని బట్టి గరుడపురాణము, రాఘవ పాండవీయము, కళాపూర్ణోదయము, ప్రభావతీ ప్రద్యుమ్నము అనే ప్రబంధాలు పింగళిసూరన రచనలుగా తేటతెల్లము

ఇందులో గరుడపురాణము కూడా ఇంతవరకు లభ్యం కాలేదు, రాఘవపాండవీయము, కళాపూర్ణోదయము, ప్రభావతీప్రద్యుమ్నము అనే మూడు ప్రబంధాలూ లభ్యం కావటం సాహితీ లోకం చేసుకున్న మహద్భాగ్యం అనిచెప్పవచ్చు

ఆంధ్రసాహిత్య పరిశోధకుల అభిప్రాయాన్ననుసరించి, పింగళిసూరన నూనూగు మీసాల ప్రాయంలో కవితాభ్యాసం చేస్తూన్న తొలిదినాలలో గిరిజాకళ్యాణం రచించి యుండవచ్చు.తదుపరి నన్నయాది పూర్వకవుల ప్రభావం వల్ల గరుడపురాణాన్ని ఆంధ్రీకరించి యుండవగును అప్పటికే కావ్యయుగ స్రష్ట శ్రీనాథకవితావైభవం ఆంధ్రమంతా అలుముకున్న నేపథ్యంలో ఆంధ్ర కవితాపితామహుడు అల్లసానివాని మను చరిత్ర ప్రబంధధోరణి తదనంతర కవుల కందరికీ శిరోధార్యంగా భాసిల్లుతూండినది

యువరక్తం ఉరకలు వేస్తున్న పింగళిసూరన ఒక్కమారాంధ్రసాహిత్య ప్రపంచంపైపు దృష్టిసారించాడు గతానుగతికంగానే తానూ తన కవితా రథాన్ని నడిపిస్తే ప్రత్యేకత యేముంటుంది! అందుకే తీవ్రంగా ముందువెనుకలు పరిశీలించాడు భీమన తొల్లి చెప్పెనను పెద్దల మాటయొకాని నిలుచుటెవ్వరు గానరు... ఆ భీమన రెండర్థాలకావ్యం చెప్పాడని వినడమేకాని, కనిందేమీలేదు అందునా

రెండర్థంబుల పద్యమొక్కటియు నిర్మింపంగ శక్యంబుగా
కుండుం దగ్గతి కావ్య మెల్లనగునే? ఓహోయనం జేయదే!
పాండిత్యంబున నందునుం దెనుగు కబ్బం బద్భుతం బంద్రు, ద
క్షుండెవ్వాడిల రామభారత కథల్ జోడింప భాషాకృతిన్!

అ దక్షుడు తానే అని జగతికి చాటనెంచి అనిదంపూర్వంగా రాఘవపాండవీయ ద్వ్యర్థి కావ్యరచనచేశాడు సూరన ఏ విధంగానని? ఆంధ్రభాషా సంస్కృతాభిభాషా శ్లేష యొక్కొక్కచోట నొక్కొక్కచోట నిత్యాదిగా, ఒక కథ వినియెడి తటి వేఱొక కథపై దృష్టియిడిన నొకయర్థము దోపక పోవుగాన నేకార్థకావ్యమెట్లు అట్లు వినదగునని హెచ్చరించాడు

యావదాంధ్ర శ్రోత్రుపారక ప్రపంచం మోరలెత్తి సూరన వైపు చూచింది ఆశ్చర్యంగా! "ఏనుంగని కరమరయక" వంటి పద్యాలు చాలు దాహరింపను ఏనున్ కని కర మరయక ఇత్యాదిగా శ్లేషవిడగొట్టి చదివితే ఒక రామాయణార్థం, ఒక భారతార్థం! ఈ విధంగా విస్మయజనక రచనా విన్యాసంతో ద్వ్యర్థిరచనా ప్రయోగంతో నాటి తెలుగు కవితా రంగాన్ని మరోమలుపు తిప్పిన మహాకవి పింగళి సూరన

అంతటితో సూరన ప్రయోగ కుతూహలనైజం వూరుకొలేదు భట్టుమూర్తి వసుచరిత్ర సాహిత్యలోకాన్ని ఉఱ్ఱూతలూపుతూన్న దొకవైపు మరోవంక హరిశ్చంద్రనలోపాఖ్యాన ద్వ్యర్థికావ్యం వ్రాసి మూర్తికవి సూరన వైపు సవాలుగా చూస్తున్నాడు నీవేనేం వ్రాయగల్గింది? చూడు నేనూ వ్రాశాను ద్వ్యర్థి కావ్యం అంటూన్న మూర్తికవి వసుచరిత్ర మరోవైపు పిల్లవసుచరిత్రల సృష్టికి ఊతమిస్తోంది సూరన హృదయం ఉడికిపోయి వుండవచ్చు ఒక తీవ్రభావన సూరన చేతనలో తరంగంలా లేచింది మరో నవ్య ప్రయోగంతో ఆంధ్రసాహిత్య ప్రపంచాన్ని అద్భుతానంద రసడోలి కల్లో ముంచెత్తివేయాలి తను చేయబోయే ప్రయోగం గతంలో ఎవరూచేసి వుండరాదు. భవిష్యత్తులో చేయనూరాదు తాను నవ్యప్రయోగంగా వ్రాయబోయే ప్రబంధము మాధుర్యధుర్యోరు వాగ్వైచిత్రిన్ సఫలం గావలె, సుధీవర్గంబులో హో ! యనన్వలె-

తన శపథం నెరవేరేలా, ఆంధ్రభాష బ్రతికి యున్నంత కాలమూ నిలచియుండేలా కళా పూర్ణోదయ కథా ప్రబంధాన్ని ఆంధ్రసాహిత్య పిపాసులకందించాడు

ఆధునికాంధ్ర సాహిత్యవేత్త, విమర్శకాగ్రేసర శిరోమణి సర్ కట్టమంచి రామలింగారెడ్డి హృదయాన్ని ఆకర్షించి ఏకంగా కవిత్వతత్త్వవిచారం అనే విమర్శను వెలయించేలా చేసిన కళాపూర్ణోదయం వంటి కావ్యం నభూతో నభవిష్యతి!

దీనిని నిజంగా చెప్పాలంటే తెలుగులో తొలి మిస్టరీ, సస్పెన్స్ పద్యనవల అనాలి. కల్పించిన కథలో, నడిచిన కథనంతో, సృష్టించిన పాత్రలలో, పలికించిన మాటలతో, ఊహాకందని సన్నివేశాల చిత్రణలో, కావ్యశిల్పంలో సూరన కవిబ్రహ్మ ప్రక్కన స్థానం సంపాదించి, కథా కల్పనానల్ప శిల్పబ్రహ్మగా యశస్సు సంపాదించాడు.

ప్రబంధాలకుండవలసిన సర్వలక్షణాలతో పాటు, రెండాకు లెక్కువగా విలోమ సంస్కృతశ్లోక పద్యరచన వంటి గారడీలు, అనుప్రాస శోభలూ, అలంకార సౌందర్యాలూ అన్ని రంగరించి కళాపూర్ణోదయ ప్రబంధాన్ని

ఒక అనర్ఘ మణిహారంలా భారతీకంధరాని కందించాడు సూరన ఈ ప్రబంధంలో

చంచలవీచీ సంచయలీలా సలలిత తరలిత జలరుహపాళీ సంచిత హస్తోదంచిత భంగీ వంటి శబ్దగమకాలూ, తావినువారికి సరవిగ. మాకు నధీశా వంటి విలోమ సంస్కృత శ్లోక యమకాలూ వినిపిస్తాయి

అంతలో ప్రాయపుప్రొద్దు పశ్చిమదిశకు వాలసాగింది రక్తంలో వేడితగ్గి శైత్యం వహించింది ఇంద్రియాలు ఉపశమనం పొందాయి తాత్త్వికదృష్టి, అనుభవస్మృతి అలవడింది పాండిత్యవయోవార్ధక్యం మరో దృక్కోణంలో ఆలోచింపేలా చేసింది సూరనను గిరిజాకళ్యాణం, గారుడం, రాఘవ పాండవీయం, కళాపూర్ణోదయం వంటివి అమోఘంగా రచించి ఆంధ్రపాఠకలోకాన్ని ఆనందింప జేయగల్గినా అతనికి మానసిక సంతృప్తి నందివ్వలేదు

జనముల్ మెచ్చగ మున్ రచించితి మదంచ ద్వైఖరిం గారుడం

దును, శ్రీ రాఘవపాండవీయము గళాపూర్ణోదయంబున్ మతిన్

దెనుగుం గబ్బము లెన్నియేనియును మత్పిత్రాది వంశాభివ

ర్ధన లేమిం బరితుష్టి వా కవి యొనర్పం జాల వత్యం తమున్ -అంటాడు సూరన

పైగా సూరన తమ్ముడు ఎఱ్ఱన కాశీ గయ ప్రయాగాది పుణ్యక్షేత్రాలలో తండ్రికి తర్పణవిధి నిర్వహించి ఆహ్లాదము కల్గించినాడు తండ్రియు సుతులకు దైవంబంద్రుగదా? అని ప్రశ్నవేసుకొని, ఏనుం బితృపూజన్ నాచేసైనట్లు - ఎద్దియ్యైన జేయగ వలయున్ అని నిశ్చయించుకున్నాడు కాన-కృతియిచ్చి మేదిని పై నిలుపుదు నతని కీర్తి అని నీర్ణయించుకున్నాడు ఆ నిర్ణయఫలమే ప్రభావతీ ప్రద్యుమ్నము

కథను మలచిన తీరులో, పాత్రలను నడిపించిన రీతిలో తలపండిన పండిత కవిగా సూరన ఇక్కడ సాక్షాత్కరిస్తాడు అతిశయము కాని , హద్దులు మీరని సలక్షణ కావ్యశైలి ఈ ప్రభావతీ ప్రద్యుమ్నమందే కనిపిస్తుందని విమర్శకుల అభిప్రాయం

ఇందులో శుచిముఖ పాత్రసృష్టి అపూర్వసంవిధాన శకలం! ఈ పాత్ర నోట చెప్పించిన.

''శబ్ద సంస్కార మెచ్చటను జారగనీక, పదమైత్రి అర్ధసంపదల బొదల'' అనే పద్యము, కళాపూర్ణోదయములో కలభాషిణి నోట పలికించిన, ''పొసగముత్తెపు సరుల్ పోహణించిన లీల'' పద్యమూ పింగళిసూరన కవితాశైలిని తెలిపే వ్యాఖ్యానాలే !

అంత సొగసుగా కావ్యత్రయ సృష్టి గావించి పింగళి సూరన, రాఘవపాండవీయ మంకితమిచ్చి ఆకువీటి పెదవేంకటాద్రినీ , కళాపూర్ణోదయమిచ్చి నంద్యాల కృష్ణరాజును, ప్రభావతీ ప్రద్యుమ్నమిచ్చి తండ్రి అమరననూ అజరామరకీర్తి సముల్ల సితులుగావించాడు సాహిత్య ప్రభలు సర్వజగత్తున వెలసినంతకాలము నంద్యాల పేరు సాహిత్య రసికుల నాల్కల మీద నాట్యమాడునట్లొనరించిన పింగళిసూరన ధన్యుడు! ఆ మహాకవికి ఆశ్రయమిచ్చి కీర్తి విలసితమైన నంద్యాల పట్టణమూ ధన్యము.

---

ఉ :- దేవుడు లేడటంచిపుడు దేబెలు కొందఱు నాస్తికాధముల్

కావరమూని మానసిక గౌరవ మింకగ వాగసాగిరే

భావమొ! స్వార్థ భాషలగు పాపుల కెక్కడి రీతి నీతి స

ద్భావము లుల్ల సిల్లగలవా యిక వారికి రసూప్రభూ! - కీ శే షేక్ దావూద్

# కవితాసామ్రాజ్య కావ్యతీర్థులు - శ్రీమద్దులపల్లివారు

-విద్వాన్ జి.వి.సుబ్రహ్మణ్య శాస్త్రి, నంద్యాల

ఎందరో మహాకవులు! అందరికీ వందనచందన మందారాలు! సాహిత్య ప్రపంచంలో అనూచానంగా ఒక అచారం పరంపరయా వస్తుండడం నిశితంగా గమనిస్తేకాని కనబడని వింతవిషయం!అది ప్రాచీన సాహిత్యంలోనూ కావచ్చు నవీనసాహిత్యంలోనూ కావచ్చు.అది సంస్కృతభాషా సాహిత్యమూ కావచ్చు మన తెలుగు తదితర సాహిత్యాలూ కావచ్చు!ఏకాలంలోనైనా ఏసాహిత్యప్రక్రియలోనైనా ఎందరో కవులు, రచయితలు జన్మిస్తారు ఎన్నెన్నో రచనలను సృష్టించి జగత్తుకందిస్తారు. అయితే యశశ్చంద్రికారుచిర రుచులలో శాశ్వతంగా వెలిగేవారు కొందరే వారిలోనూ వారికొన్ని రచనలే అజరామర కీర్తిమందాకినీ విహరద్రాజ హంసలై నిలుస్తాయి

కొందరు, యశోధనులై వెలిగే కవులకు ఏమాత్రము తీసిపోని రచనలేచేసి వుంటారు అయినా ఇనాలోకయోగ్యత లేని పేటికాంతర్గత మణులవలె మరుగునపడి అదృశ్యమై అందకుండా పోతారు వారిలోనూ కొందరు అదృష్టవంతులుంటారు వారు కాలగర్భంలో కలిసిపోయిన తరువాత ఎవరికంటనో, ఏసాహిత్యపిపాసి కంటనో వారిరచనలు పడతాయి. వాడికి ప్రచారం లభిస్తుంది ఆ కావ్యసృష్టి కర్త అయిన కవి అజరామర కీర్తిశేషుడయి ప్రజలనాల్కల మీద తాండవిస్తాడు

కొందరకి కాస్త అదృష్టమూ ఉండదు వారూ, వారి అమూల్యరచనలూ అనర్ఘ రచనలూ కాలరక్కసి కడుపులో జీర్ణమైపోతాయి అలాంటి అనర్ఘ కావ్య రచనాదక్షులు, అద్భుత సాహిత్యదిదృక్షులు ఎందరెందరో ప్రచారంలోకి, వెలుగుచూడక, వెలికిరాలేక తెరమరుగైపోయిన వారు ఈ తెలుగు సాహిత్యలోకంలో నాడూ వున్నారు, నేటికీ వున్నారు!

అటనేర్చిన వాడల్లా అరిందా కాలేడు, పాట పాడేవాడల్లా ప్రఖ్యాతగాయకుడూ కాలేడు, వ్రాసే ప్రతివాడూ కవి కిరీటధారి కాలేడు నిజమే- కానీ- కీర్తిగన్న ఆ ప్రముఖులకేమాత్రమూ తీసిపోని నైపుణ్యమూ ప్రతిభా ప్రజ్ఞా అన్నీ వుండీ అంబరమంబనం చేసే అదృష్టగరిమ లేని వారిని గురించి ఏం చెప్పకోవాలి? వారు అదృష్టహీనులు కనుక చరిత్రహీనులు అయినారని చెప్పాలి అంతే!ఈ విమర్శాదృక్పథంతో చూచినపుడు, అధునాతన తెలుగు సాహిత్య ప్రపంచంలో, రాయలసీమలో తెలుగు సాహిత్యానికి వన్నెలందించిన మిన్నకవులు అన్నా నే రాజశేఖర శతావధాని, గడియారం వేంకట శేషశాస్త్రి, పుట్టపర్తి నారాయణా చార్యులు త్రిమూర్తులుగా ప్రకాశిస్తూ అవుపిస్తారే తప్ప, అంతటి ప్రతిభావ్యుత్ప త్తు లుండే, అలాంటి ఎందరెందరికో తెలీసీ సీమలోనే తెరమరుగుకవులుగా వుండిన యొందరు ఇతరులు లేరు? ఉన్నారు!

ప్రతిభావ్యుత్పత్తి , పాండితీ ప్రకర్ష, మధురకవితావిలాస సృష్టిచాతుర్యాలు వ్యాఖ్యానదాక్ష్యత, విమర్శావైశిష్ట్యము, వావదూకతావాల్లభ్యము, తదితర కవిత్వలక్షణ లక్షితులైన రాయలసీమకవులు, పాణ్యం సోదరకవులు, జోస్యం జనార్దన శాస్త్రిగారు, గొల్లాపిన్నికవులు, అవధానం చంద్రశేఖరశర్మగారు, బెళ్ళూరి, కుంటిమద్ది, అనుముల, రాయసం, గౌరావఝుల సోదరకవులు, మేడవరం కవులు, కానాలకవులు, తలముడిపికవులు, గనికవులు, ఇలా ఎందరో దిగ్దంతులైన వారున్నారు

ఆకోవలో కవితాసామ్రాజ్యం స్థాపించి, ఆ సంస్థ ద్వారా దాదాపు ఐదుదశాబ్దాల సాహిత్యసేవ పలువిధాలుగా అందించి మహనీయకీర్తి కాంతా శ్లేష గౌరవమందుకున్న కావ్యతీర్థులు విద్వాన్ మద్దుల పల్లి

వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి గారు మనవారి దౌర్భాగ్యం మరొకటి సిగ్గుచేటయినదున్నది విశ్వవిద్యాలయాలలో ఈతరం మాష్టరులకు, ఈసీమలోనే పలుప్రాంతాలలో ప్రసిద్ధులైన కవిపండితుల గురించీ, వారిరచనలగురించీ పరిచయం లేకపోవటం ఆ మాష్టరులు పొరబాటున రీడరులు, గయుళ్ళు అయితే, ఎవరైనా జిజ్ఞాసువు, ప్రాంతీయాభిమానీ అయిన పరిశోధకవిద్యార్థి ఇలాంటి కవులూ, వారిరచనల గురించీ యం ఫిల్‌లో పి హెచ్ డీవ్ చేయాలని కుతూహలం ప్రకటించినా దానిని మొగ్గలోనే త్రుంచివేయటం!ఇదెంత శోచనీయం!

మద్దులపల్లి వారిని గురించీ, వారిరచనల గురించీ పరిచయం లేని ఒక గైడు మహాశయుడు - రాయలసీమలోని ఒక విశ్వవిద్యాలయ పండితుడు - ఒక జిజ్ఞాసువు యొక్క అభిలాషను మొదలంటూ నరికివేసి సాహిత్యానికి సంబంధం లేని విషయంపై పరిశోధన చేయమని మార్గదర్శకత్వం వహించడం సాక్షాత్తూ ఈ సీమలోనే జరిగింది అంటే - రాయలసీమలో మహాకవులు ఎందరు తెరమరుగైపోతారో స్పష్టమవుతున్న సత్యం సుమా!

కావ్యతీర్థ మద్దులపల్లి వేంకట సుబ్రహ్మణ్యంశాస్త్రిగారిని గూర్చి పది పరిశోధకవ్యాసాలు సమర్పించవచ్చు! అంతటి సాహిత్యసృష్టివారిది! అంతటి అనర్ఘ సాహిత్యసేవ వారిది!'ఆంధ్రపత్రిక - సంపాదక వర్గంలోనూ, ప్రచురణ విభాగంలోనూ ఎందరెందరో మహాపండిత విమర్శక కవీశ్వరులున్నా గన్నవరపు సుబ్బరామయ్య గారికి మాత్రమే ఆంధ్రపత్రిక ఆస్థానకవి అన్న ప్రశస్తి వుండేది!

అలాగే దక్షిణభారతదేశంలో ప్రసిద్ధ పుస్తక ప్రచురణ సంస్థ అయిన వావాళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్ వారి దర్బారులో మేడేపల్లివారి నుండి; శేషాద్రిరమణకవులు, వేటూరివారు, ఇత్యాదిగా హేమా హేమిలున్నా వావిళ్ళవారి కొలువుకవిగా, పరిష్కర్తగా మద్దులపల్లి వారికే ఒక ప్రత్యేక గౌరవస్థానం వుండేది ఈ విధంగా చూచినా మద్దులపల్లివారి ఘనత ఏమో బోధకమవుతుంది.

మద్దులపల్లివారిజీవితమే అత్యంత నియమబద్ధమైనది వారి ఆకృతిగానీ, మాటగానీ, పాండితిగానీ, ప్రవర్తన గానీ, పురాణోక్త గృహమేధి సూత్రాలు ప్రత్యంగుళ బద్ధమై కనిపించేది.మధురసంగీతస్వరంలా మాటా, ముత్యలకోవలా వ్రాతా, దివాకర్ల తిరుపతిశాస్త్రిని స్ఫురింపజేసే కట్టూబొట్టూ, మునీశ్వరవాక్కులా ఉపదేష్టత్వం, విద్యార్థులతో శ్రవణరంజకంగా ముచ్చటించటం, ఆహ్లాదకరమైన పాఠ్యబోధన, అలరించే వ్యక్తిత్వం, నిరత సాయంతన సాహిత్యగోష్ఠీ ప్రచారం, దైవభక్తి, నియమానుష్ఠాన నిర్వహణం, గార్హస్థ్యధర్మానుసరణం, తత్తత్కాల చతుర ఛలోక్తి విసరణం వెరసి మద్దులపల్లి వారంటే- అతిశయోక్తికాదు వారొక పుంభావ సరస్వతీమూర్తి సంస్కృతాంధ్ర, బాషాపాండిత్య స్ఫూర్తి, నంద్యాలలో అనేకులు పెద్దలకు, వేలశిష్య గణానికే వారు పెద్దస్వామి. వారు స్థాపించిన సాహిత్యసేవా సదనం , కవితాసామ్రాజ్యానికి వారు చక్రవర్తి!

వీటన్నిటికి మించి మద్దులపల్లివారిలోని సుగుణమొకటున్నది అది వారి వినమ్రత! నిస్స్వార్థపరత్వం, వైయక్తికాభిమాన గుణశౌండిమం అది వారిమాటలలోనే వినవలెను.

నేను నాయంతవాడను! నేనుగలుగ జగతికెంత గావలె నంతె జరుగ గలదు!

నాకు దగినంత ప్రజ్ఞయే నాకు గలదు! అతిశయోక్తులతోనేల? ఆర్యులార!

అన్నది వారి 'మున్నుడి! ఈ వినమ్రబావమే వారిని ప్రతిభవుండీ ప్రకాశంకాని స్థితికి చేర్చినదేమో!

మద్దుల పల్లి కవీంద్రులు బహుగ్రంథకర్తలు వారి రచనలు, శ్రీ సత్యనారాయణ స్వామి సుప్రభాతం, (సంస్కృతరచన), శ్రీ సత్యనారాయణ మాహాత్మ్యం-5 ఆశ్వాసాల పద్యకావ్యం, అమృతసందేశం,

దైవప్రార్థన-సుభాషితములు, పెండ్లిరాయబారము; కుక్కలమొఱ; అనే పద్య రచనలు.భక్తపోత రాజీయము అనే ఐదంకముల నాటకము, నిరపరాధవిందలు రావు అనే చిన్న నాటకము; కవితావినోదము అనే పద్యసందర్భవ్యాఖ్యా వివరణ గ్రంథము, చమత్కారకవిత్వము అనే గాడేపల్లి వీరరాఘవశాస్త్రిగారి అవధాన, చాటుపద్య విధాన వివరణ సంకలన గ్రందము, బ్రహ్మవిద్యావరిష్ఠ శ్రీమేడవరము సుబ్రహ్మణ్యశాస్త్రిగారి జీవిత చరిత్ర, బ్రహ్మస్వామి జీవితము; చేతావనిఖండము, హంపీవిరూపాక్ష పేరచరిత్ర, భారతవచనానువాదము (అముద్రితము) చాటుపద్య, శ్లోకకథలు (అముద్రితము) వీరి రచనలు

కాగా వావిళ్ళవారికోసం అయ్యలరాజు నారాయణమాత్యుని హంసవింశతిని పరిష్కరించి సవ్యాఖ్యగా ప్రచురింపజేసి ఆంధ్రపాఠకలోకానికి అపూర్వకానుకగా అందించారు అలాగే వాంఛానాథ కుట్టికవి మహిషశతకాన్ని పరిష్కరించి సవ్యాఖ్యానంగా అందించారు తెలుగు శతకవాఙ్మయంలో అదృష్టశతకంగా పేరుగాంచిన చంద్రశేఖర శతకాన్ని పరిష్కరించి వావిళ్ళవారిద్వారా ముద్రణా భాగ్యం అందేలా చేశారు.

పరిష్కరణవిషయంలో వారి ప్రౌఢిమ తత్కాలీన ప్రముఖ పరిష్కర్తలు-వేటూరి. మానవల్లి, నిడదవోలు వంటివారికేమాత్రము తీసిపోనిది

వ్యాఖ్యాన రచనలో వేదం, వేటూరి, వేలూరి వంటివారి శేముషికి దీటైనది. కవితారచనలో విశ్వనాథ, వేదుల, మధునాపంతుల, శేషశాస్త్రి ప్రభృత మహాకవుల రచనకెనయైనది అయినా వారివలె పేరు మ్రోగని సాత్విక కవి శ్రీమద్దుల్లపల్లి, కె వి రెడ్డిగారు భక్తపోతన సినిమా తీయక ముందు, మద్దులపల్లి వారి భక్త పోతరాజీయం నాటిక తెప్పించుకొని చదివి చాలాకాలం తర్వాత ఈస్క్రిప్టు మాకు పనికిరాదులెండి అంటూ వెనక్కి పంపించారు కానీ, విడ్డూరమేమిటంటే భక్తపోతన సినిమాకు వీరు సమకూర్చుకున్న కథ మద్దులపల్లి వారి నాటకానుసరణమేనంటే ఆశ్చర్యపడనక్కరలేదు

తరువాత చలమచర్ల రంగాచార్యుల 'హాలికుడు' నాటి కరచనపై భక్తపోత రాజీయ ప్రభావం ఉన్నదంటే మద్దులపల్లి ప్రతిభయేమిటో ద్యోతక మవుతుంది.

మద్దులపల్లివారి కవిత సరళసుందరంగా సాగి హృదయహ్లాదకరంగా ద్యోతకమౌతుంటుంది దీర్ఘదీర్ఘ సమాసాలు వీరి రచనల్లో యెక్కడ కనిపించవు. అవసరమైన చోటనే అతిసహజ రీతిలో అలంకారిక విన్యాసం చోటుచేసుకోవడం వీరిరచనల్లో గోచరించే ప్రత్యేకత'పురపాలకసంఘంవారు వీధికుక్కలను దారుణంగా చంపించే వైనంచూచిన కవిహృదయం క్షోభించిన తీరు-

భూతదయాళులార! పరిపూత గుణాకరులార! తండ్రులా

రా! తమతోడిబిడ్డల దురంతపు చావును చిత్తగింపరే!

భూతదయాపరత్వమెటు వోయెనో? మానవులయ్య మమ్మిటే

సేతుల బట్టి చంపుదురె? చెల్లరె? ఇంతటి ఘోరమున్నదే!

అనిన పద్యంలో ఎంత హృద్యంగా ప్రతిబింబించిందో చూడండి! కుక్కలమొఱ ఎనుబదైదు పద్యాలలో నివదించిన ఈ కవి వేదనలో పోతన గజేంద్రమోక్షణ పద్యశైలిని కూడా గమనించవచ్చు!

మద్దులపల్లివారికి కవిత్వరచన గురించి పూర్వకవులవలె కొన్ని నిశ్చితాభిప్రాయాలున్నాయి వారిమాటల్లోనే

చెప్పాలంటే – కవిత్వమంటే..

ప్రాసముకోసమై వెదకరాదు; యతి ప్రతిపాదనార్థమై
గాసిని జెందరాదు; గణకల్పన కోసము జిల్లివల్కుల
న్యాసము సేయరాదు; తగినంతటి సొంపుగ నొక్కపద్యమేన్
వ్రాసిన జాలదే! కవి శిరంబుల నయ్యల లూచ నేర్చువన్ – అంతేకాదు;
వ్రాసిన పద్యమెల్లను సెబాసనిపించు కొనంగబోలు, నం
దే నరసత్వమేని, సొగసేనియు, భావములోనొ, శబ్దవి
న్యాసములోనొ; ఔచితినొ, వ్యంగ్యము నందునొ అర్థచిత్రమం
దో సరిపోయి యుండవలయున్ రసికుల్ తలలూచి మెచ్చగన్ అనే ప్రతిపాదిస్తాడు కవి

ఆ నియమమానికి తగిన రీతిలో మద్దులపల్లివారి రచనలన్నీ సాగడం గమనార్హం అమృతసందేశం వంటి ఖండకావ్యమైనా; దైవప్రార్థన వంటి చిరుఖండిక అయినా; సత్యనారాయణ మాహాత్యం వంటి కావ్యమైనా, మద్దులపల్లివారి ఏ కవితారచన చూచినా సందర్భోచిత పదబంధాలతో, అలంకారవిన్యాసాలతో అలరారుతూ సాక్షాత్కరిస్తాయి

వీరి సత్యనారాయణ మాహాత్యంలో ఒక సన్నివేశం! వ్రతంచేస్తానని వాయిదా మీద వాయిదావేస్తూ వచ్చిన శెట్టిగారు సాగరవ్యాపారాంతంలో వూరు చేరి, వేషధారియైన స్వామి ప్రశ్నకు అబద్ధపు సమాధానమిచ్చి సరకొను నష్టపోతారు ఆ సందర్భంలో మద్దులపల్లి వారి లేఖిని నుండి,

అట్టులవ్వట్టు పుట్టంబు గట్టుజగజెట్టి పట్టుదలం బట్టిపెట్టిన శాపంబుం బట్టి
శెట్టులిట్టు బిట్టు తట్టుకొనరానట్టి యిక్కట్టులంబడుచుండ నటయింటి ప ట్టున .

అంటూ ఒక అనుప్రాససుందరమైన వచనం, పోతనకవిని తలపిస్తూ జాలువారింది ఇక్కడ ఇక్కట్టుల కటకట చూపించటం కోసం వేసిన ట్టప్రాస సార్థకమైంది

ఎన్నికల వికారాలను గూర్చి మూడు దశాబ్దాల క్రిందనే వారి కవితలో ప్రతిధ్వనించిన నైరాశ్యం చూడండి!

యిడవరు; యింటిసుట్టు పరవేత్తరు; సూత్తరు వంకదణ్ణముల్
పెడతరు, మేలుసేస్తమని పెగ్గెలు పల్కుత రాసనైవ యిం
బడి తిరిగ్గైన సూడ రిసుమంటి సెబుద్దులు రాజ్జెమేలితే
కుడిసి కూకుండ నిత్తర? మొగుండ్లయి సూస్తనె గొంతుగోయరా?

అంటూ గ్రామ్యశైలిలో చెప్పిన తీరు రమణీయంగా వుంది కదా!

కమనీయమైన తెలుగునుడికారములు ప్రయోగించటంలోనూ ఈ కవి సిద్ధహస్తులనేందుకే పద్యం చూడండి!

ఎక్కడిలోకమో! నిజమదేమొ ఎఱుంగదు, పాపపుణ్యముల్

లెక్కిడ బోదుగా! నరములేనిది నాలుక! ఆడినట్లుగా

రక్కసమాటలన్ నిరపరాధుల వేసియు నొవ్వనాడి బ

ల్త్రొక్కట బెట్టు, నింతకును లోకము మూయగ మూకుడున్నదే?

సంస్కృత శ్లోకాలను తెలుగు చేసినా, తెలుగు పద్యాలను సంస్కృతీకరించినా మద్దుల పల్లీవారి రచన రసరమ్యమధురైక స్రోతస్విని నవరస బంధుర సుందరమైనది అద్భుత కవితా విలసిత రచనలేకాక, సరళసుందరశైలిలో, ఇంద్రగంటి శేషావధానుల చరిత్ర, ధ్రువచరిత్ర పరిష్కరణము, అద్భుతచర్యలు, గోకర్ణం రామాభట్లవారి చరిత్ర, కలియుగ దానకర్ణ బుడ్డావెంగళరెడ్డి చరిత్ర, త్యాగరాజు నాటకం వంటి వచనరచనలూ చేసిన మహాకవులు మద్దులపల్లివారు

అందరికీ పరిచయమైన అవధానాలు కాక, వీరు 'వినోదావధానం' అనే ఒక నూతన ప్రక్రియను విజయోపేతంగా నిర్వహించేవారు కానీ, సరైన ప్రోత్సాహం లభించని కారణంగావయస్సు పైబడుతూన్న కారణంగానూదానిని విరమించినారు యాచ్ఞాదైన్యమెరుగని ధీరకవికనుకె రాయలసీమలో ఇతర కవులవలె ప్రసిద్ధికెక్కకపోయిన మంజూషికాంతర మణి మద్దులపల్లివారు

సీమలోని విశ్వవిద్యాలయాంధ్రశాఖాధ్యాపకులు, పరిశోధకులైనా ఇలాంటి ఉత్తమ బహుగ్రంథ కర్తలను ఈతరం పాఠకులకు పరిచయం చేయవలసిన బాధ్యతను స్వీకరిస్తే 'జయంతితే సుకృతినో రససిద్ధాఃకవీశ్వరాః' అన్న నానుడి సార్ధకమవుతుంది!

---

## బ్రిటిష్ మత్తగజానికి అంకుశమై నిలచిన ఉయ్యలవాడ వీర నరసింహా రెడ్డి

మ అమితోద్దండ దురంత పీడనకులోనై భారతీయ ప్రజా
సముదాయం బొనరించినట్టి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ రం
గముకన్నన్ బదియేండ్లకుమ్మునుపె యాంగ్ల ప్రాజ్య సామ్రాజ్య సై
న్యముపై గత్తిని దూసినట్టి నరసింహారెడ్డి సామాన్యుడే!

సీ కలికతురాయి గీల్కొలుపు పట్టురుమాలు
గట్టిన యుత్తమాంగంబు తోడ
వైష్ణవభక్తి భావము చాటు నూర్ధ్వ పుం
డ్రము నీటు గొలుపు ఫాలంబుతోడ
క్రేవల కెంజాయరేక లింపారు, నా
తత దీర్ఘ ధవళ నేత్రములతోడ
చిరు నిమ్మకాయల నిరువైపు నిల్పుకో
జాలిన గుబురు మీసములతోడ
వైరి హంవీర విదళన ప్రళయకాల
దండనిభ ఖడ్గ కలిత హస్తంబు తోడ
ప్రజకు భయభక్తి సంభ్రమ భావములను
గొలుపు వర్చస్సుతోడ నబ్బలియుడలరు (తరువాయి 46వ పేజీలో)

(శ్రీ పాణ్యం నరసరామయ్య కవి ప్రణీత "స్వాతంత్ర్య వీరుడు" అను పద్యకావ్యము నుండి పునర్ముద్రితం)

# కళాతపస్వి దామోదరం సంజీవయ్య

-డా!!సి గోవిందరాజు, ఎం ఎ పి హెచ్ డి
తెలుగుశాఖాధ్యక్షులు
శ్రీకృష్ణదేవరాయి విశ్వవిద్యాలయ స్నాతకోత్తర కేంద్రం-కర్నూలు

దేశచరిత్రలో సాంఘిక రాజకీయ సాంస్కృతిక పరిణామాలదృష్ట్యా సంఘంలో నవ చైతన్యం కల్గించటానికి అప్పుడప్పుడూ కొందరు విశిష్టవ్యక్తులు జన్మిస్తుంటారు అలాంటి కోవకు చెందిన మహామనీషి -దివ్యసంజీవని దామోదరం సంజీవయ్య కవిగా, సాహితీ తపస్విగా, కళాకారులకు ఆత్మీయుడిగా, వక్తగా, రాజకీయ చతురుడిగా, పరిపాలనాదక్షుడిగా సంజీవయ్య రాష్ట్రానికి, దేశానికి చేసినసేవ అపారం తుంగభద్రానదీ పుష్కరాల సందర్భంగా ఆయన సాహితీసేవను మరోసారి మననం చేసుకొందాం

సంజీవయ్య సంగీతం, సాహిత్యం తెలిసిన మాలదాసరికుటుంబానికి చెందిన వారు తల్లిసుంకులమ్మ, తండ్రి మునెయ్య ఆయనకు సంగీత సాహిత్యాలపై మక్కువకలగడానికి అతని అన్న, మేనమామ కొడుకులు, సమకాలీనుల అవధానాలు కారణం సంజీవయ్య అన్న చిన్నయ్యకు మంచి సంగీతపరిజ్ఞానం వుండేది భారత భాగవతాలలోని పద్యాలను, కీర్తనలను ఇంట్లో తరచూ పాడుతూవుండేవాడు తిరుపల్లిదాసు, రంగయ్య, చినరంగయ్యలు సంజీవయ్య మేనమామ కొడుకులు తిరుపల్లిదాసు సుజ్ఞానబోధిని వంటి పారమార్థిక రచనలు పద్యరూపంలో వెలువరించారు పెద్దపాడు గ్రామస్థులు సంజీవయ్య సమకాలీనులు బాలకవి గోవిందప్ప, ఎల్లారెడ్డి అవధానాలు చేసేవారు వీరిప్రభావం సంజీవయ్యపై తప్పక వుండి వుంటుంది

సంజీవయ్య చదివేరోజుల్లో మునిసిపల్ హైస్కూల్లో తెలుగు ఇంగ్లీష్ భాషల్లో వారానికి ఒకసారి కాంపోజిషన్ రాయించేవారు ఆ రెండు భాషల్లోనూ సంజీవయ్యదే పైచేయి రాచర్ల రాఘవాచారి హైస్కూల్లోను, సరస్వతీపుత్ర పుట్టపర్తినారాయణ చార్యుల వారు ప్రభుత్వ డిగ్రీకళాశాలలోను తెలుగుభాషను బోధించేవారు వీరి బోధనా ప్రభావంతోనే సంజీవయ్యకు శ్రావ్యంగా పద్యాలను పాడటం, రచనలు చేయటం అబ్బింది సంస్కృత భాషతోకూడా సంజీవయ్యకు చెప్పుకోదగ్గ అనుబంధం వుంది ఒకనాడు రాచర్ల రాఘవాచార్యులు ఒక ఐ ఏ ఎస్ అభ్యర్థికి పాఠంచెబుతు సంస్కృత శ్లోకాన్ని ఉదాహరిస్తున్నారు అప్పుడు అక్కడికి వెళ్లిన సంజీవయ్య-

అర్థేనేన తృణవత్ధనమాత్రం

కింతు జీవన మతిప్రతి పాద్యం

కావమాహ కుశవర్ధనదాయి

ద్రవ్యదాన విధరుక్తి విదగ్ధః

-అనే శ్లోకాన్ని యధాతథంగా ధారణచేయటం అది ఆయన మనస్సుకు హత్తుక పోవటం జరిగిందట

సంజీవయ్య స్వయంగాకవి. భీష్మజననం అనే హరికథను, పదాల్ని ఆయన రచించాడు ఈ పదాల్ని ప్యాలకుర్తిలో సంజీవయ్య బంధువు రంగయ్య ఆలపించేవాడు సంజీవయ్య రచించిన

నాతికి పతి పదసేవ, స్త్రీ

జాతికి పతిసేవ

ముక్తికి త్రోవ

అనేచరణాలను ప్యాలకుర్తి చుట్టుపక్కల గ్రామల్లోని దాసర్లు ఇప్పటికీ గానం చేస్తుంటారు

కవి కంఠంబు చూపివేగ

గణపతి నను గావరా

కరివదనా కరివదనా

నిన్నుమదిలో కడు ముదమున తలచెదరా-

మనంచేసే ప్రతి మంచిపనీ నిర్విఘ్నంగా కొనసాగాలని సంజీవయ్య గణపతిని ప్రార్థించాడు దానికి శారద తోడు కావాలని ఇలా ప్రార్థించాడు-

శారద వేడెద

సర్వకళానిధి

సంతసమున వాక్కునందుచేరవే

కంతుజనకుని పెద్ద కోడలా

తెలియగ లే రే నీదుమహిమ

వేదాంతులైన కేదార గౌళసఖీ

సంజీవయ్య ఆశువుగా అప్పుడప్పుడు చమత్కారంగా పద్యాలు అల్లేవారు ఒకసారి పేకేటిశివరాం సంజీవయ్యకు పూలదండవేయడానికి లేదని బాధపడుతూవుంటే

''నీ కైదండయుండగా దండలేదని దండమిడెదవేల మిత్రమా'' అని డండం కదిలేలా పద్యాన్ని చెప్పారు కందం ఎంత తేలికగా చెప్పగలరో ఆటవెలది అంత తియ్యగా చెప్పగలరు అంటూ పేకేటిశివరాం సంజీవయ్యగురించి ఒకచోట అన్నారు

సికింద్రాబాదులోని మహంకాళిదేవాలయ ఉత్సవాల ప్రారంభసభలో ముఖ్యమంత్రిగా సంజీవయ్య పాల్గొన్నారు సభకు ముందు మాటల సందర్భంలో ఆ సభకు వచ్చిన వీరమల్లయ్య కొన్నిపద్యాలు సంజీవయ్యకు వినిపించాడు వాటిని ఆయన సభలో యధాతథంగా పాడివినిపించాడు

మొనమొన్న వరకు తూర్పున పేరులేనివి

హెచ్చు పేర్చిన దాని మచ్చు మాసె

యెన్నికయేలేని సన్నని ఒకయేరు

పైనుపట్టణము మ్రింగి పేరుగాంచె

-వీటిని తరువాతి ఉపన్యాసాల్లో కూడ సంజీవయ్య ఉటంకించడం మానలేదు

సంజీవయ్య నాటకాలను, నాటక పద్యాలను రచించారు కళాశాల నాటకోత్సవాలలో అనేక నాటకాలలో ఎన్నో పాత్రలు ధరించి మంచి నటుడిగా పేరు సంపాదించాడు షాజహన్ నాటకంలో సంజీవయ్య ధరించిన షాజహాన్ పాత్రను చూసినవారు ఇప్పటికీ మరువలేకున్నారు

సంజీవయ్య రచించిన శశిరేఖాపరిణాయం నాటకంలో సుభద్ర శశిరేఖను అభిమన్యునకిచ్చి వివాహం చేయుమని బలరాముని రేవతిని కోరుతుంది కాని వారు అంగీకరించరు నిరాశతో తల్లీకొడుకులు వెనుదిరగివస్తుంటారు గ్రామీణ హృదయాలను ఝల్లు మనిపించేలా నడిరేయి అరణ్యభయానకదృశ్యాన్ని సంజీవయ్య-

ఎంత దూరము మన మేగవలెను

కొడుకా యీనడిరాత్రి

ఎందు ధాత్రి భల్లూ కముల శబ్దంబుల్

ఉల్లమంతయు ఝల్లుమనియె

శార్దూలంబుల శబ్దమునాకు

గుండెలెంతో ఫెల్లు మనియె- అంటూ వర్ణించాడు

గయో పాఖ్యానంలో కూడ అనేక పద్యాలు రాసి మిత్రులకు యిచ్చి పెద్దపాడులో సుప్రసిద్ధనటులచేత ప్రదర్శనలుచేయించాడు కాలేజీ చదివేరోజుల్లో ఈ రచనలు చేసినా అవి వెలుగులోనికి రావడానికి కొంతకాలం పట్టింది

సంజీవయ్య కృతికర్తేకాదు కృతిభర్తకూడ ఎందరో రచయితలు తమరచనల్ని సంజీవయ్యకు అంకితం యిచ్చారు 1952లో సంజీవయ్య మద్రాసులో మంత్రి అయినపుడు ప్రముఖకవి బోయిభీమన్న 'రసోదయం', 'మధుబాల 'అనే రచనల్ని ఆయనకు అంకితం యిచ్చాడు రావూరి భరద్వాజ ఆంగ్ల కదా సంపుటాన్ని అంకితం యిచ్చారు

సంజీవయ్య ఇంగ్లీష్ భాషలో అనర్గళంగా ఉపన్యసించేవారు లోకోక్తులతో, ఛలోక్తులతో, సాహిత్య చమత్కారాలతో ఆయన ఉపన్యాసాలు బహుళ జనాదరణను పొందాయి ఆంధ్ర సచిత్రవార పత్రిక ప్రతినిధి ప్రవీణ్ సంజీవయ్యగారూ మీకు యింతటి సాహిత్య జ్ఞానం ఎలాకలిగింది? తీయని పలుకులు మీకు ఎలా అలవడినాయండీ అని ప్రశ్నించాడట దానికి సమాధానంగా సంజీవయ్య తడుముకోకుండ చల్లని తుంగభద్రా నది కలిగించింది అని ప్రత్యుత్తరమిచ్చాడు ఇలాంటి కళాతపస్వి సంజీవయ్య గారి మధురమైన సాహిత్య స్మృతులు, తుంగభద్రా నదీ తరంగాల హోరు శ్రావ్యంగా ఎప్పటికీ విన్పిస్తూనే వుంటాయి

---

## దోమా వెంకటస్వామి గుప్త

మ కలముం గేలను బూనుటాది పుటపై గావ్యామరాం భోజ ని
స్తుల మారందఝురీ భరంబు లొలుకవ్ సొంపొందగా జేయు నా
జలజాతాసను రాణి కరుణవ్ సాధింపరానట్టి వే
ద్యలు చెల్వారునె? అట్టి భారతి కివే కైమోడ్పు లర్పించెదన్!

# కవితా కిరీటి -కలుగోట్ల విజయాత్రేయ

-జె.యస్ ఆర్.కె. శర్మ (ప్రాచీన సాహిత్య పరిషత్తు)

కవిర్జాయతే అని మనవాళ్లంటే "పొయట్స్ ఆర్ బారన్ బట్ నాట్ మేడ్" అని అంటున్నారు పాశ్చాత్యులు "అర్ట్ ఈస్ గాడ్ గివెన్ గిఫ్ట్" అని వాళ్లంటే, కళ దైవదత్త మయిన ప్రతిభ అని మనవారంటున్నారు ఈ అభిప్రాయాలకు ప్రబల ప్రతీకగా విరబూచిన కవితా కమనీయ రసరమణీయ మనోహర దేవమందారం మాప్రియతమ మిత్రుడు శ్రీ కలుగోట్ల విజయాత్రేయ।

ఈయన్ని దేవమందారం అని ఎందు కంటున్నానంటే – కవిత్వానికి సంబంధించిన చదువేదీ ఈయన చదువుకోలేదు కనుక కేవలం శ్రీ రాజరాజేశ్వరిదేవి సంపూర్ణానుగ్రహవాత్సల్య మకరందాభిషేక ప్రభావంతో శరపరంపరగా కలమంజుల రసరంజిత కవితలల్లి, తెలుగు సాహితీ ప్రియుల్ని అవిరామంగా అలరిస్తున్నాడు కనుక

సహజంగా పద్యశిల్ప కల్పనా ప్రవీణులు గేయ నిర్మాణం చేయలేరనీ, గేయరచనా ప్రాగల్భ్యులు వచన రచనా పారీణులు కాలేరనీ ఒక వాడుక పద్య గద్య గేయ రచనలనేకం చేసిన సాహితీ సవ్యసాచి మా విజయాత్రేయ పై సిద్ధాంతానికి భిన్నంగా ప్రతిభా ప్రసారం కావించాడు ఇంచుమించుగా ఇరవై పద్య కావ్యాలు కృతిభర్తల కోరిక పై వ్రాసి, అందంగా అచ్చువేయించి, ఆంధ్రభారతిని అలరించాడు ఈ యిరవయ్యో శతాబ్దంలో ఇది ఒక అద్భుతం।

దాదాపు వంద నవలలు వ్రాయగా, 43 నవలలు యం వి యస్ మద్రాసు వారు ప్రచురిస్తే, వీధినర్తకి అనే నవలను విజయవాడ వాహినీ ప్రచురణలు ప్రకటించింది ఒకటి రెండు నవలికలు, పద్య ఖండికలు, యువజ్యోతి, కృష్ణాపత్రిక, సంసారం, జయశ్రీ, జాగృతి, శ్రీశైలప్రభ, వంటి పత్రికలలో ప్రకటించటం జరిగింది ఈయన కవితలు సర్వతంత్ర స్వతంత్రాలు వ్యాపార దృష్టితో వ్రాసినవి ఎంత మాత్రం కావు ఇది నేనెరిగిన సత్యం రాజసంలొ పుట్టి, రాజసంలో పెరిగి, రాజసంలోనే జీవిస్తున్న కవి రాజరాజు మా విజయుడు।

విజయాత్రేయ వ్రాసిన సాహిత్య రంగస్థల నాటకం ఆంధ్రభోజుడు -మహారాజశ్రీ మద్దూరు సుబ్బారెడ్డిగారి జన్మదిన మహోత్సవ సందర్భంగా- బ్రాహ్మణకోట్కూరులో నేను ప్రయోక్తగా ప్రదర్శించడం జరిగింది అది విజయవంతమూ అయింది పౌరాణిక నాటకం మైరావణ ధూళిపాళ వారు వ్రాయిస్తే – చారిత్రక నాటకం రాణీ సంయుక్త, రాయలసీమ నటరత్న అల్లాబకు గారు వ్రాయించారు పై రెండూ వెలుగులోకి రాలేదు భీష్మవిజయం అనే ఏకాంకిక, ప్రవరుడు సత్యభామ, చిత్రాంగి, సుయోధనుడు, కర్ణుడు, అల్లూరి సీతారామరాజు అనే ఏకపాత్రలు వ్రాశాడు వీరి ఏకపాత్రలలో కృష్ణ దేవరాయలు కూడా ఉంది విజయాత్రేయ హృదయం కవితా మకరంద మహార్ణవం ఎటు కాలువ తీస్తే అటు ప్రవహించి క్రేళ్లురుకుతుంది

హైదరాబాదు, కడప, అనంతపురం, కర్నూలు, ఆకాశవాణి కేంద్రాలు ఈయన కవితలెన్నో ప్రసారం చేశాయి, చేస్తున్నాయి, చేయబోతున్నాయి దూర దర్శన్ వారు ఈ రాయల సీమ కవిని పరిచయం చేయకపోవటం వారికే లోటు

ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు, డా. నండూరి రామకృష్ణమా చార్యులు, డా డాశరథి, డా. సి. నారాయణరెడ్డి, డా గుంటూరు శేషేంద్రశర్మ, డా అమరేంద్ర, శ్రీ అనుముల కృష్ణమూర్తి, మహాకవి మల్లంపల్లి శరభయ్యగారు, ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు వంటి ఆంధ్రసాహితీ కవితా ప్రముఖులు ఎందరో అగ్రశ్రేణి కవిగా విజయాత్రేయను అభివర్ణిస్తున్నప్పుడు, ఆయన కవిత్వం గురించి అదనంగా వ్యాఖ్యానించడం అవసరం

కాదనుకుంటాను, అల మిన్నందిన వాడి పొడవింతని చెప్పటానికి సాధ్యం కానట్లే, మా కవితాసవ్యసాచి, కవిత్వౌన్నత్యాన్ని ఉల్లేఖించటం కూడా సాధ్యంకాదు

ఇంటర్ మీడియేట్ బై పి సి అడ్డకట్టమ తెగద్రెంచుకుని పడదూకిన కవితాప్రవాహంలో - విద్య డిగ్రీలు కొట్టుకొనిపోగా, డాక్టరు కావలసినవాడు యాక్టరు కావాలని మోజుపడి, చివరకు కవిగా మనకు మిగిలిపోయాడు ప్రతిభను డిగ్రీలతో కొలవటం అసమంజసం డిగ్రీలేవి అవిరళ కృషికి సాహిత్యపరిశ్రమకు తార్కాణాలు కాని ప్రతిభకు కావు నాకే అధికారముండే విజయాత్రేయ అఖండ సాహిత్యసేవకు, అనల్ప ప్రతిభకు, ఒక గౌరవ డాక్టరేట్ పట్టా బహూకరించేవాడిని విజయాత్రేయ కావ్యాలపై, నవలలపై, వచన కవితలపై పరిశోధన చేయటం ఒక సాహిత్యావసరం.

1983లో కర్నూలు జిల్లా మండల కేంద్రమైన ఓర్వకల్లు గ్రామంలో రెండు రోజులపాటు విజయాత్రేయ కవితా రజతోత్సవాలు, విందులు, వినోదాలు, సాహిత్య సాంస్కృతిక కార్యక్రమాలతో జరిపించి, 5 వేల రూపాయల పర్సుతో, కవి జహాపనా బిరుదుతో సత్కరించటం ఒక విశేషం ప్రాంతీయ విజయాత్రేయ సాహిత్యాభిమానులు రజతోత్సవ సారధ్యబాధ్యత నాకప్పగించారు అనాడు స్వర్గీయ గుండా రత్నంశెట్టి గారు (ద్రోణాచలం) వీరి ఊర్వశి కావ్యాన్ని అంకితం తీసికొని గౌరవించారు శ్రీ ఇ వి రాజేంద్రశర్మ దాశకన్య కృతినీ వారిసోదరులు శ్రీ ఇ.వి సుజాతశర్మ లాస్యగౌరి కృతినీ అంకితం తీసికొని, బంగారు ఉంగరాలిచ్చి, కాశ్మీరు, శాలువకప్పి సత్కరించారు మహారాజశ్రీ మద్దూరు సుబ్బారెడ్డిగారు వీరి మహర్షి కృతిని గ్రహించి, స్వర్ణకంకణం తొడిగారు

నావృత్తి వ్యవసాయం, వ్యావృత్తి కవితావ్యవసాయం, ప్రవృత్తి సౌందర్యోపాసన అని విజయాత్రేయగారే చెప్పుకున్నారు. ఇది ప్రత్యక్షరసత్యం. ఈయన కవితకు సంబంధించిన ఒక అతిముఖ్యమైన విషయాన్ని మనవిచేసి, వీరి జీవనాంగణంలో అడుగుపెడతాను. (ప్రారంభంలో సమర్పించవలసిన అంశాన్ని మధ్యలో నివేదించవమున్న నా స్వాతంత్ర్యాన్నీ సాహసాన్నీ మన్నింతురుగాక!)

అభినవకృష్ణరాయలు, సెరదాత, సౌజన్య సౌహార్దక మనస్వి, అఖండ యశస్వి,త్యాగైక తేజస్వి, ప్రముఖ పారిశ్రామికవేత్త మహారాజ శ్రీ యస్.పి.వై రెడ్డి బి.టెక్ గారు శ్రీవిజయాత్రేయగారి కర్షుడు కావ్యాన్ని అంకితం తీసుకోవడమేకాక, ప్రతినెలా వేయిరూపాయలు కర్పూర చందన తాంబూల దక్షిణగా సమర్పించి, తమ ఆస్థానకవిగా పోషిస్తూ, కవితాసరస్వతిని అరాధిస్తున్నారు శ్రీ రెడ్డిగారు నంద్యాల నంది సుజలా పైపుల ఫ్యాక్టరీ యజమాని. ఈ 20వ శతాబ్ది ఉత్తరార్ధంలో ఈ వైయక్తిక కళాపోషణ విచిత్రంగానే కనబడుతుంది

మా విజయాత్రేయ కవిగా తెలుగు విశ్వవిద్యాలయంనుంచీ, జాతీయ సాహిత్య పరిషత్తు సిద్దిపేట శాఖనుండీ, కడప గడియారం స్మారక సంఘం నుండీ, మచిలీపట్నం త్రిపురసుందరీ ఫౌండేషన్ నుండి అవార్డులు అందుకున్నారు సామాన్య సన్మానాలెన్నో గ్రహించారు ఇంకా ఎన్నో ఘరానా అవార్డులు ఆయన్ని వరించవలసి ఉంది. వస్తాయనుకుంటున్నాను. చెయ్యవలసిందేదో శ్రీరాజరాజేశ్వరీ దేవి చేసిపెడుతుంది. పోతే దైవం మానుష రూపేణ కావచ్చు.

కలుగోట్ల విజయాత్రేయ అన్న ఆయన పేరులోనే కవి దాగి ఉన్నాడు. మధురాతి మధురంగా ఒదిగిపోయి ఉన్నాడు మధురం మధురం. . అన్నట్లు, మా విజయాత్రేయ వయసు, సొగసు, మనసు, పలుకు - అంతా మధురమే, మంజులమే, మంగళకరమే, ఆయన సాన్నిహిత్యమే ఒక తీయనిహాయి.

కవితాప్రారంభదశలో '' మణికంకణం '' చిరుకావ్యం పంపినపుడు చదివి, ఆపాత మధురమయిన ఈ కావ్యం, ఇందలి ప్రతి అక్షరం వెనుక తొణికిసలాడే తేనె గుండె తిలకించి పులకించినాను అన్నారు డా. నండూరి రామకృష్ణ మాచార్యగారు డా ప్రసాదరాయకులపతిగారి అంతరంగాన్ని ఆకర్షించింది, అలరించింది ఎందరో నటులు, కవులు, నవలాకారులు వీరి నభిమానిస్తున్నారు విజయాత్రేయ గారి వ్యాపకం చాలా పెద్ద పరిధిలోనే ఉంది తెలుగు కవితా సరస్వతికి మణికిరీటం కవితాకిరీటి క వి !

విజయాత్రేయను గురించి పరిచయ వాక్యాలు పలకటంలో ద్వితీయఘట్టం ముగిసింది. ఒక మెట్టు క్రిందకు దిగి ప్రధమఘట్టానికి రావాలి, వస్తున్నాను

కర్నూలు జిల్లా, నంద్యాల తాలూకా, గడివేముల మండలం, గని గ్రామంలో ఒక మధ్యతరగతి అభిజాత్య నందవరీక బ్రాహ్మణ కుటుంబంలో జన్మించారు కలుగోట్ల విజయాత్రేయగారు తండ్రి కలుగోట్ల శంకరరావు తల్లి లక్ష్మీదేవమ్మ కాని వీరికి తప్పటడుగులు కూడా వెయ్యలేని ప్రాయంలోనే తండ్రి మరణించటంతో, పినతండ్రి - బహుగ్రంధ పరిశోధనా ధురీణులు, భారతసారవేది, పౌరాణిక ప్రవీణ (వృత్తి కాదు), డిగ్రీలు లేని సాహిత్యసార్వభౌముడు, సాము గరిడీలు, కుస్తీలు నేర్చిన అలనాటి పాలెగాడు, పల్లెటూరి రాజకీయాలలో గడితేరి ముడివారిన మనీషి - శ్రీ కలుగోట్ల సుందరరావుగారూ వారి సతీమణి మీనాక్షమ్మగారూ కంటి పాపలా కాపాడిపెంచారు క వి గారిని అందరూ సుందరరావుగారి కొడుకనే అంటారు, అలాగే చలామణి ఔతున్నారు విజయాత్రేయగారి సుందర సౌవర్ణ సాహిత్యసౌధానికి వజ్రాలపునాది సుందరరావుగారి అపారమేధాసంపద.

క.వి గారికి మేనమామ కూతురు విజయలక్ష్మితో వివాహం జరిగింది సంతానం నలుగురు ఆడపిల్లలు, ఒక కుమారుడు కర్నూలు జిల్లాకు విచ్చేసిన కవిగాయక నటపండిత మహాశయులందరూ వీరి అతిధ్యాన్ని రుచి చూచినవారే, అభిమానించినవారే వీరియింట భోజనసౌఖ్యానికి లోటులేదు-రాజభోజనం! కవిగా జన్మించి, కవితకే అంకితం కావించి, కవిగా కొనసాగుతూ, రైతు జీవితాన్ని గడుపుతున్నారు విజయాత్రేయగారు - ఇవండీ, నా అంతరంగిక మిత్రుడు శ్రీవిజయాత్రేయ జీవిత విశేషాలు అపారభావనా బాలం కల మా విజయాత్రేయ ఆంధ్రకవితా సరస్వతి దివ్యవేణిలో ఒకపాయ

నీ లేఖినీ ముఖంలో సరస్వతి నివసించె నయ్యా! విజయం నీ దేనయ్యా! విజయాత్రేయా! అని దాశరధిగారంటే, మా చిరంజీవి ఒక తెలుగు వెలుగు -అన్నారు డా నండూరి ''సరస కవి తిలకా'' అన్నారు మహానటుడు చిత్తూరు నాగయ్య

పద్యరచన మీ చేతిలోపానకంలా పారుతుంటుంది మైనంలా ఒదిగి పోతుంటుంది మాధురీ గుణం మీ కవితలో మారాకు హత్తుకున్న సహజలక్షణం అనుప్రాస మీ కవితలో కోతి కొమ్మచ్చు లాడుకుంటుంది లలిత లలితభావాలకు మీ పద్యాలు హృద్యసదనాలు, పద్యంలో వ్రాసినా మీ కవిత గేయసౌరభాన్నందు కొన్నది- అన్నారు సి నా.రె

రస నీరంధ్ర మహాంధ్ర పద్యకవితా రాజన్య లోకంబునం

దసమాన ప్రతిభాధురంధర మహీయస్సార్వభౌముండు మా

పసివాడీ కలుగోట్ల వంశ జలధి ప్రాలేయ భానుండు, అనీ,,

కవితా నిష్ఠాగరిష్ఠుండు మాధ్వీక స్వచ్ఛ మరందమూర్తి అనీ అన్నారు యుగకవి గుంటూరు శేషేంద్రశర్మగారు

మీ కవితా ధార కాశ్చర్య ముగ్ధుడ నయ్యాను అని ఆచార్య తంగిరాలగారు (బెంగళూరు), ఈ రోజుల్లో తెలుగుదేశంలో ఇంకా మీలాంటి వారున్నారా? అని తిరుపతినుంచి మల్లంపల్లి శరభయ్యగారు అన్నారు

మీ కవిత పలురంగుల పూలతోట పంచవన్నెల చిలక అంటూ అభినందించారు నెల్లూరు నుండి ప్రముఖ రచయిత్రి డా. పి. జయప్రదగారు (వంశీ నర్సింగ్ హోమ్)

నిజంగా నీ కవితలో ఏదో ఆకర్షణ, సమ్మోహనశక్తి ఉంది విజయుడూ! అని అంటుంది డా ప్రసన్నకుమారి.

క వి గారిని గురించి శేషేంద్రుని మత్తేభం

దివికిన్ జేరిరి విశ్వనాథ ప్రభృతుల్ తెల్గున్ బ్రజానీకమున్
నవ కావ్యమ్ము లనేకముల్ మలచి యానందింపజేయంగ నీ
భువిపై విస్మృప్రతిష్ఠజేసి - విజయా! పూర్ణామృతంబైన నీ
కవితాచంద్రిక సోకి మూర్ఛలితి నో కావ్యేంద్రజాలప్రభూ!

క వి గారిని గురించి -నండూరి రామకృష్ణమాచార్య

వెన్నెల పొంగినట్లు, కనువేదురు పింఛము విప్పినట్లుగన్,
క్రొన్నన పూయు లేవలపు కూర్మలు గుండెల పిండినట్లుగన్,
కన్నెల నవ్వు జల్లుల దిగంతరముల్ పులకించినట్లుగన్,
వెన్న ద్రవించునట్లుగ, కవిత్వము అల్లుదు నీవె ఓ కవీ!
మొగలి పొత్తు పొడులు, పొగడపూవుల తావి,
మల్లెమొగ్గ మనసు మార్దవమ్ము,
మధుర భారతీయ మంజీర మణితముల్
కలవు నీ కవిత్వ గళమునందు!

నా పరిచయానికి భరత వాక్యం పలుకుతున్నాను శ్రీ రాజరాజేశ్వరి దేవి అమందాశీస్సుధా ధారలు, కరుణా కంజాతాలూ, వాత్సల్య పారిజాతాలూ - నిరంతరం విజయాత్రేయనూ, ఆయన కుటుంబ సభ్యులనూ, కవితా కళాపతినీ - అభిషేకించు గాక! శుభం భూయాత్!

(ఈ ప్రముఖ కవి కలుగోట్ల విజయాత్రేయగారు ఇటీవల స్వర్గస్థులయ్యారని చెప్పటానికి మిక్కిలి చింతిస్తున్నాం. ఈ వ్యాసం క వి గారు సజీవులై ఉండగావ్రాయబడింది- సంపాదకులు -చైతన్య కవిత సౌజన్యంతో)

---

సీ . ఒక యింట కవ్వంబు లుఱ్ఱూత లూగుచు గాజుల రవళిలో గలసియాడ
నొక యింట నావుల నొడసి పిండిన ధార సుయ్యంచు పాత్రలో సుద్దులాడ
నొక యింట లే బెయ్యలుద్గమించుచు బాలు కుడిచెడి చుపచుపల్ కూర్చ శ్రుతుల
నొక యింట నవనీత ముండగా వెగిరెడి తపతపల్ తాళింపు దరువులేయ
క్రొత్తవారలు వీధుల గుండ బోవ రిచ్చపడెదరు ద్రేపల్లె జొచ్చినా మొ
కాక పదల పుడుకుల లోకంబు మాయ చేత వొచ్చినారమొ యని చెప్పుకొనుచు!

**కీ.శే. అందలం కృష్ణమూర్తి గారి "మహోదాత బుడ్డా వేంగళ రెడ్డి" కావ్యంనుండి**

# కర్నూలు జిల్లా జానపద కళారూపాలు-

కళాప్రపూర్ణ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి

భాగవత భరతనాట్య సంప్రదాయ ప్రవర్తకులలో కూచిపూడివారి కన్నా ప్రథములు పాతకమూరి భాగవతులు, వీరు అహోబిల నృసింహస్వామి సన్నిధిని నాట్యాచార్యులై నిత్య నాట్యసేవ చేశారు

శ్రీ వెలయు పాలవారధి పవ్వళించి జో జో అన్న జోలపాట ఈ భాగవతులు రచించిందే అని వీరిని తాళ్ళపాక అన్నమాచార్యులే పేర్కొన్నారు గీత నాట్యాలలో వీరికి గల ప్రతిభ వ్యక్తం కాగలదని, వీరు 1280 ప్రాంతపు వారని శ్రీ విడుదవోలు వెంకటరావు గారు, ఎల్లోరా వ్రాసిన 'కళలు పుట్టుపూర్వోత్తరాల 'ఉపోద్ఘాతంలో వివరించారు, దీనిని బట్టి భాగవత కళ రాయలసీమలో తరతరాలుగా ప్రచారంలో వున్నట్లు తెలుస్తూవుంది బనగాని పల్లి నవాబు కళా పోషణ

భాగవత కళను రాయలసీమలో విరివిగా ప్రచారం చేయించవలెనన్న తలంపుతో క్రీ శ 1700–1750 ప్రాంతంలో బనగానిపల్లి నవాబు గారు కూచిపూడి నుంచి కొందరు కళావేత్తల కుటుంబాలను ఆహ్వానించి కోటకొండ, కపట్రాల వద్ద వారికి భూములిచ్చి వారి చేత కర్నూలు జిల్లాలో భాగవత కళా ప్రచారాన్ని ప్రోత్సహించారు అప్పటిలో కూచిపూడి నుంచి తరలి వెళ్ళిన కుటుంబాలలో చల్లా వారొకరు వీరు వెలనాటి బ్రాహ్మణుల కుటుంబానికి చెందిన వారు వీరిలో ప్రథముడు చల్లా భాగవతందాసం భొట్లు భాగవత మనేది వీరికి పౌరుష వాచకము సిద్ధేంద్రయోగి నేర్పించిన పారిజాతాపహరణాన్ని పారంపర్యంగా ప్రదర్శించినవారిలో ఈ చల్లావారొకరు

ఈ మధ్య చనిపోయిన భరత శాస్త్రం లక్ష్మీనారాయణ శాస్త్రి వారికి తొమ్మిదవ తరానికి చెందినవారు శాస్త్రిగారు ఆ కళాకారుల కుటుంబానికి చెందిన సుప్రసిద్ధ నాట్యకళలో విశారదులు భామా కలాపాన్ని, గొల్లకలాపాన్ని, క్షేత్రయ్య పదాలను, తరంగాలను అభినయించడంలో దిట్ట సంగీత, నృత్య విద్యలలోనే కాక సంస్కృతాంధ్ర భాషలలో చక్కని పాండితీ ప్రతిభ గడించినవారు నృత్యరీతిలో వీరి బాణీకి, కూచిపూడి వారి బాణీకి అడుగుల క్రమంలోను, జతి విన్యాసాలలోను తేడా వున్నట్లు ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమి వారు ఆనాడు జరిపిన కూచిపూడి నాట్య సదస్సులో వివరించారు. వీరి కలాపంలో కొన్ని భాగాలను అఖిల భారత సంగీత నాటక అకాడమీ వారు టేప్ రికార్డుచేశారు వారి సంప్రదాయం ఎటువంటిదో ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ సేకరించడానికి సన్నాహాలు చేస్తూవుండగా వారు కీర్తిశేషులయ్యారు. ఇందువల్ల వీరి సంప్రదాయం ఎటువంటిదో తెలుసుకునే అవకాశం మనకు లేకుండా పోయింది.

కోటకొండలో లక్ష్మీనారాయణశాస్త్రిగారి అన్న కుమారులైన రంగయ్యగారికి కూడా భారతనాట్య శాస్త్రంలో ప్రవేశమున్నదట. వారిని కలిసి ఈ విషయాన్ని పరిశోధింపడం ఈనాటి నాట్యకళా అకాడమీ వారి విధి మరికొందరున్నా వారందరూ జీవనోపాధి కష్టమై ఇతర వృత్తులలోను, వ్యవసాయంలోను ఆసక్తిని కలిగివున్నారు.

కూచిపూడి భాగవతులకు గోలుకొండ నవాబు తానీషా ఎలా అగ్రహారాన్ని దానం చేశాడో అదే విధంగా కోటకొండ భాగవతులకు కర్నూలు నవాబు రెండు వందల ఎకరాల భూమి శోత్రియంగా కుడివారం, మేలువారం హక్కులతో ఇచ్చారట. ఆ హక్కు ఈనాటికి వారి అనుభవంలో వుంది

వీరి వంశంలో ఒకరో, ఇద్దరో, తప్ప తర్కంలోను, వ్యాకరణంలోను ఎక్కువ మంది ప్రతిభావంతులు లేరట వీరి ఇంట పారంపర్యంగా భరతశాస్త్రమే ప్రసిద్ధంగా వున్నవని లక్ష్మీనారాయణశాస్త్రి వివరించారు వీరి ఇలవేల్పు కొలుట్ల చెన్నకేశవుడు వారి కుటుంబంలోని ప్రతి మగపిల్లవానికి ఐదవ ఏట ఆ దేవాలయంలో ముక్కు కుట్టిస్తారట ఉపనయనానంతరం ఆ దేవుని ఎదుట గజ్జె కట్టించి ప్రథమ పాఠాలు ప్రారంభిస్తారట విద్య పూర్తికాగానే చెన్నకేశవుని సన్నిధానంలో ప్రదర్శనమిచ్చిన అనంతరంగాని రాజుల వద్ద ప్రదర్శించేవారు కారట వీరికి ఎక్కువ అభ్యాసమైన విద్యలు తరంగాలు, అష్టపదులు, క్షేత్రయ్య పదాలు

## కపట్రాల కళాకారులు

రెండు వందల సంవత్సరాలకు పూర్వం బనగానిపల్లి నవాబు కర్నూలుకు సమీపంలో తుంగభద్రా నదికి అవలి ప్రక్కనున్న చారిత్రక సుందర నగరం అలంపూరానికి దగ్గరగా వున్న కపట్రాల గ్రామాన్ని వీరికి ఈనాంగా ఇచ్చారు అనాడే కూచిపూడి నుంచి కొంత మంది చల్లావారు, చింతావారు కుటుంబాలతో వలస వెళ్ళారు కూచిపూడి సంప్రదాయాన్నే వారు నైజాం సంస్థానంలోను ప్రచారం చేశారు కాని రానురాను వారి కళా సంప్రదాయం నిర్వీర్యమైపోయింది వీరు కూడా ఆ గ్రామంలో వున్న కాళత్తయ్య దేవాలయంలో బిడ్డ లందరికి చిన్నతనంలోనే ముక్కులు, చెవులు కుట్టించి, గజ్జె కట్టించి నాట్యాభ్యాసానికి ప్రారంభోత్సవం చేసేవారట అక్కడ వున్న కళాకారులు చల్లా మోహనకృష్ణ మొదలైనవారు భాగవత సంప్రదాయాలను కాపాడుతూ వచ్చారు వీరు ఈ సంప్రదాయాన్ని మహారాష్ట్ర దేశంలో కూడా ప్రచారం చేసి వచ్చారని ప్రతీతి

ఈ విధంగా ఆంధ్రప్రదేశ్ అనేక ప్రాంతాలలో అనేక కళారూపాలలో ప్రసిద్ధులైన అనేక మంచి కళావేత్తలు వున్నారు ఆంధ్రప్రదేశ్ నాట్యకళా అకాడమి వారి ద్వారా ప్రాచీన సంప్రదాయ కళారూపాల పరిశోధన చేపట్టడం ఎంతైన అవసరం

---

(37వ పేజీ తరువాయి - ఉయ్యాలవాడ వీర నరసింహారెడ్డి)

దేశంలో శాంతిభద్రతలకు విఘాతం కల్గినపుడు, విజయనగర రాజుల పిలుపు పై దేశరక్షణకు తమ తమ సైన్యాలతో పాళెగార్‌లు విజయనగర సామ్రాజ్య రక్షణకు పోరాడేవారు కాలక్రమేణా విజయనగర రాజ్యం పతనమయ్యాక వివిధ ప్రాంతాలలోని పాళెగార్‌లు తమ తమ ప్రాంతాలలోని అన్ని అధికారాలను తమ హస్తగతం చేసుకొని స్వతంత్ర పాలకులయ్యారు అనాడు ఒక్క కర్నూలు జిల్లాలోనే 29 మంది స్వతంత్ర పాళెగార్‌లు వున్నారు అనాటి పాళెగార్‌లలో ఒకరైన జయరామిరెడ్డి కొత్తకోట, జయరామపురం, కోయిలకుంట్ల, గిద్దలూరు, కంభం ప్రాంతాలలోని సుమారు 70 గ్రామాలను ఉయ్యాలవాడ కేంద్రంగా తన ఆధిపత్యంలో వుంచుకొని పరిపాలించాడు బ్రిటీష్ వారి ఈస్టిండియా కంపెని దొరల ఆధిపత్యం దేశంలో క్రమక్రమంగా ప్రబలడంతో దేశంలోగల చిన్నచిన్న రాజ్యాలను, సంస్థానాలను తమ పాలనలో కలుపుకొని రైత్వారీ పద్ధతిని ప్రవేశపెట్టి పాళెగార్‌ల స్వతంత్ర పాలనను రద్దుచేసే క్రమంలో జయరామిరెడ్డిని తొలగించి అయనకు రూ 6/- పెన్షన్ ఇవ్వడానికి నిశ్చయించారు జయరామి రెడ్డికి సంతానము లేదు అందుచే తన తర్వాత తన వారసత్వ హక్కును కాపాడుకొనుటకు తమ సమీప బంధువుల నుండి కాకాని నరసింహారెడ్డిని దత్తత తీసుకొన్నాడు అయితే బ్రిటీష్ వారు ఈ దత్తత స్వీకారాన్ని అంగీకరించక జయరామిరెడ్డిని తొలగించ నిర్ణయించడంతో, ఈ చర్యతో ఆగ్రహించిన జయరామిరెడ్డి తన రాజ్యంలోని రైతులందరు బ్రిటీష్‌వారికి శిస్తు చెల్లించరాదని తన వారసుడైన నరసింహారెడ్డికి

(తరువాయి 48వ పేజీలో)

# కర్నూలుకు జిల్లాకు చెందిన హరిదాసవరేణ్యులు

-మాళిగి వ్యాసరాజ్, యం ఏ, యం ఫిల్

భక్తి సిద్ధాంతానికి బీజాలు వేదాల్లో కనిపిస్తాయి భక్తి సూత్రాలను ప్రతిపాదించిన నారదుడు పురాణ యుగానికి చెందిన వాడు నవ విధ భక్తులలో కీర్తన ముఖ్యమైంది కీర్తన మాధ్యమంగా భగవంతుణ్ణి ఉపాసించే పద్ధతి కూడ అతిప్రాచీనతను కలిగివుంది తంబూరను మీటుతూ గానం చేసే నారదుడే దీనికి నిదర్శనం. అతడి తరువాత శుకాచార్యులు, రామాయణం నాటి లవకుశులు ఇలా ఎందరో ఉత్తరంలోని మీరా, సూరదాసు, తులసీదాసు, కబీరుదాసు, బంగాళానికి చెందిన జయదేవ, చండీదాసు, చైతన్యుడు, గుజరాత్‌కు చెందిన నరసీమెహతా, తమిళనాడులోని ఆళ్వారులు, ఆంధ్రదేశంలోని అన్నమయ్య, రామదాసు, త్యాగయ్య, కర్ణాటకు చెందిన హరిదాస వరేణ్యులు- వీరంతా వేద ప్రతి పాద్య వస్తువును, త్రిమతా చార్యుల బోధలను వారివారి కీర్తనల్లో మేళవిస్తూ భక్తి ఉద్యమాన్ని నడిపారు

ద్వైత మతా చార్యులైన శ్రీమధ్వాచార్యుల భక్తి సిద్ధాంతాన్ని గాన మాధ్యమంగా కన్నడంతో ప్రచారం చేసిన వారు హరిదాసులు వారిలో ప్రముఖులు శ్రీ పురందర దాసులు, శ్రీకనకదాసులు, శ్రీవిజయదాసులు. కర్ణాటక నుండి ప్రవహించే తుంగ భద్రానదిలా అక్కటి నుండి ఆంధ్రదేశంలోని కర్నూలు జిల్లాకు ఈ ధార్మిక ప్రచారగంగ గలగల నడిచి వచ్చింది శ్రీ రాఘవేంద్ర యతివర్యులు, శ్రీ విజయదాసులు, శ్రీ గురు జగన్నాధదాసులు కర్నూలు జిల్లాకు చెందిన హరిదాస శ్రేష్ఠులు

మంత్రాలయం శ్రీ రాఘవేంద్ర తీర్థులు

తుంగభద్రా నదీ తీరవు ప్రఖ్యాతమైన తీర్థక్షేత్రంగా వెలుగొందేదీ మంత్రాలయం ప్రహ్లాదావతారులైన శ్రీ రాఘవేంద్రులు సజీవ బృందావనస్థులై భజించే వారికి కల్పవృక్షమై వారి మహిమలను చూపుతున్నారు సంస్కృత సాహిత్యానికి ఎనలేని సేవనందించిన వీరు, కన్నడ భాషలో ధీరవేణుగోపాల అనే ముద్రికలో పలుకీర్తనలు వ్రాసారు అయితే ఇందు ''ఎనగెగోవింద'' అనే కీర్తన మాత్రమే మనకు లభిస్తుంది శ్రీ విజయ దాసుల వంటి వారికి ప్రేరకులయ్యారీ మంత్రాలయ ప్రభువులు

చిప్పగిరి – శ్రీ విజయదాసులు –

శ్రీ విజయ దాసులు క్రీ శ 1681 నుంచి 1754 వరకు జీవించారు దాసప్పగా కడుపేదస్థితిలో ఈతని బాల్యం గడిచింది చక్కని శరీర పుష్టి, మంచి యవ్వనంలో వుండిన ఈ దాసప్పను యింట జరిగే వివాహ సందర్భపు భోజన సమయంలో అవమానించారు విసుగు చెందిన దాసప్ప కాశీకి వెళ్ళాడు అక్కడ పండితుల సాంగత్యంలో గడిపాడు అక్కడే ఒక రోజు ఇతడి స్వప్నంలో శ్రీ పురందరదాసులు దర్శన మిచ్చారు అతని నాలుకపై శ్రీ విజయవిఠల అనే అక్షరాలు వ్రాసారు అప్పటి నుండి వీరు ఎన్నో కీర్తనలు వ్రాస్తూ విజయ దాసులయ్యారు విజయ విఠల వీరి ముద్రిక శ్రీ విజయదాసుల వారిని భృగు అంశ సంభూతులుగా తలుస్తారు వీరు మొత్తం 25 వేల కీర్తనలు వ్రాసారు పురందర దాసులు వ్రాసిన కీర్తనలను 5 లక్షలు చేయదలచు కున్నారు క్రీ.శ 1754వ సంవత్సరంలో ఇప్పటికి కర్నూలు జిల్లాలోని చిప్పగిరి గ్రామంలో తమ ప్రాకృత దేహాన్ని విసర్జించారు అక్కడే వారి స్మారక మందిరం (కట్ట) కూడా నిర్మించబడింది

కోసిగి – శ్రీ గురుజగన్నాధదాసులు –

వీరు క్రీ శ 1837లో కర్నూలు జిల్లాలోని కోసిగి గ్రామంలో జన్మించారు బాల్యంలో స్వామి రాయలుగా పిలువబడేవారు వీరి స్వప్నంలో వాయుదేవుడు కనిపించి, నాలుకపై బీజాక్షరాలు వ్రాసి, మంత్రాలయ రాఘవేంద్రులను సేవించవలసిందిగా ఆజ్ఞాపించారు వారి అనుగ్రహంతో గురు జగన్నాధ విఠల అనే ముద్రికతో అనేక కీర్తనలు వ్రాసారు శ్రీ గురు జగన్నాధ దాసులుగా ప్రఖ్యాతి గాంచిన వీరు తిరుమల శ్రీనివాసునిపై అనేక కీర్తనలు వ్రాసారు వీరి ద్వారా ముద్రికను పొందిన హరిదాసులెందరోవున్నారు

(46వ పేజీ తరువాయి-ఉయ్యాలవాడ వీర నరసింహారెడ్డి)

శిస్తు చెల్లించేటట్లుగా ఏర్పాటు చేశాడు అప్పటికే పరాయి పాలకులపై ద్వేషంతోనున్న రైతుల తమ ప్రభువుపై విశ్వాసంతో, జయరామిరెడ్డి దత్తకుమారుడైన ఉయ్యలవాడ నరసింహారెడ్డికి తమ శిస్తులు చెల్లించ నిర్ణయించారు

ఈ చర్యతో ఆగ్రహించిన బ్రిటిష్ వారు, నరసింహారెడ్డి దత్తత చెల్లదని, నరసింహారెడ్డిరాజద్రోహానికి పాలుపడ్డ విప్లవకారుడని ప్రకటించి, నరసింహారెడ్డిని బంధించి, రైతులనుండి శిస్తు వసూలు చేసుకొని రమ్మని ఒక బ్రిటిష్ అధికారిని ఉయ్యాలవాడ పంపించారు ఆ అధికారి అహంకార ధోరణికి అనుచిత ప్రవర్తనకు ఉగ్రుడైన నరసింహారెడ్డి అతనిని మట్టు పెట్టడంతో బ్రిటిష్ ప్రభుత్వానికి, నరసింహారెడ్డికి మధ్య యుద్ధ వాతావరణం ఏర్పడింది అందుచేత మైదాన ప్రాంతంలో ఉంటే రక్షణ ఉండదని భావించి నరసింహారెడ్డి, తన తండ్రి అంతకు ముందే కొత్తకోట అడవులలో నిర్మించిన కోటకు, తన సహచరులు, సైన్యంతో చేరుకుని ఆత్మరక్షణ కోసం తమ సొంత సైన్య పోషణ కొరకు, ప్రజల పరిపాలన కొరకు, ఉయ్యాలవాడ కేంద్రంగా ఎంచుకొని, బ్రిటిష్ ప్రభుత్వ ఆస్తులను కొల్లగొడుతూ, అధికారులను ముప్పుతిప్పలు పెడుతూ గెరిల్లా పోరాట పద్ధతులతో తెల్లదొరలతో దీర్ఘకాల పోరాటానికి పూనుకొన్నాడు విస్తృతంగా సమకూర్చుకున్న ఆ ధనంతో కొత్తకోటలో ఒక బురుజు నిర్మించి ఆ కోటపై 12 ఫిరంగులను ఏర్పాటు చేసాడు కోట చుట్టూపైభాగాన గోడలపై తుపాకులతో సైనిక పహారా ఏర్పాటు చేసాడు ఈ కారణాల వల్ల ఈ కోటను వశపర్చుకునేందుకు బ్రిటిష్ వారు చేసిన ప్రయత్నం విఫలమైంది 1846లో కోటను వశపర్చుకోవటానికి సైన్యంతో వచ్చిన ఒక బ్రిటిష్ ఉన్నతాధికారి ఆ ప్రయత్నంలో విఫలమై ప్రాణాలను కోల్పోయాడు

దీనితో బ్రిటిష్ వారికి సహజమైన ఎత్తుగడలు, మాయోపాయంతో నరసింహారెడ్డి అంతరంగికులలోని ముఖ్యుని ప్రలోభముతో లోబర్చుకుని, అద్రోహి ద్వారా నారేటవ్ అనే బ్రిటిష్ సేనాని నరసింహారెడ్డిని బందీగా పట్టుకుని రాజద్రోహం నేరారోపణ చేసి విచారణ కొరకు గ్రామస్తులను పిలువగా ఒక్కరు కూడా హాజరు కాక నరసింహారెడ్డి పై తమకు గల భక్తి విశ్వాసాలను వెల్లడి చేసారు అయినా తెల్లదొరలు విచారణా తతంగం జరిపి ప్రజలను భయభ్రాంతులు చెందేటట్లుగా మన వీరుడు ఉయ్యాలవాడ నరసింహారెడ్డి ఆ దేశభక్తుని 1846 ఫిబ్రవరి 22న కోయిలకుంట్లలో బహిరంగంగా ఉరితీసి ఆ శవాన్ని అలాగే కొన్నిరోజులు దహన క్రియలు లేకుండా చెట్టుకు వేలాడగట్టి ఉంచారు

నరసింహారెడ్డి సంపాదించిన 12 ఫిరంగులలో 11 ఫిరంగులను బ్రిటిష్ వారు స్వాధీనం చేసుకున్నారు ఒక ఫిరంగిని మాత్రం తరలించ సాధ్యం కాక వదలి వెళ్లారు ఈనాటికి ఆ 15 టన్నుల బరువుగల ఆ ఫిరంగి, తుప్పు పట్టకుండా తెల్లదొరల కుటిల పాయాలను, దోపిడిని, నరసింహారెడ్డి వీరోచిత పోరాటాన్ని, దేశభక్తిని మనకు జ్ఞప్తికి తెస్తూ కొత్తకోటలోనే మనకు దర్శనమిస్తూ ఉన్నది ఆనాటి పాలెగార్ల పౌరుషానికి దేశభక్తికి ఆ ఫిరంగి ప్రత్యక్షసాక్షి నరసింహారెడ్డిని ఉరి తీసిన 1846 ఫిబ్రవరి 22 తేదిన ఆ దేశభక్తుని సంస్మరణ దినంగా చెప్పుకొని ప్రజలు గర్వపడుతుంటారు

గత వైభవాలకు పౌరుషాలకు సాక్ష్యంగా ఇప్పటికీ అనేక చోట్ల కోటలు, బురుజులు, ఫిరంగులు ఇంకా మిగిలి ఉన్నాయి అలాటి వాటిలో చిరస్మరణీయమైనది గిద్దలూరు ప్రాంతాన ఉన్న కొత్తకోట బురుజు జయరామిరెడ్డి కోట మరియు ఉయ్యాలవాడ నరసింహారెడ్డి చరిత్ర, అక్కడ శిథిలావస్థలో ఉన్న కట్టడాలను జ్ఞాపక చిహ్నాలుగా రక్షించుకోవటం నరసింహారెడ్డి లాంటి దేశభక్తులను స్వతంత్ర కాంక్ష కలిగిన ఆనాటి వీరుల చరిత్రను భవిష్యత్ తరాల వారికి తెలియచెప్పడం మన కర్తవ్యం

(విశాలాంధ్ర సౌజన్యంతో- గుజ్జుం వెంకట రెడ్డి గారికి కృతజ్ఞతలతో)

# తుంగభద్రా నదీ విశేషాలు

-గడియారం రామకృష్ణ శర్మ, అలంపురం

శ్లో. తుంగానారాయణ స్సాక్షాత్, భద్రాదేవోమహేశ్వర 1

తయోః సంగమరూపేణ, తుంగభద్రా విశిష్యతే!!

దక్షిణా పథంలోని నదుల్లో తుంగభద్ర చెప్పుకోదగినట్టిది కృష్ణానదికి ఉపనదుల్లో ఇదే పెద్దది కర్ణాటక రాష్ట్రంలోని పడమటి కనుమలలో పుట్టిన తుంగా-భద్రా అనే రెండు నదుల కలయిక తుంగభద్ర. ఈ రెండు నదులూ, షిమోగా పట్టణానికి 8 మైళ్ళ దూరంలో కూడ్లి గ్రామం దగ్గర కలుస్తున్నాయి తుంగభద్ర కర్ణాటకంలో చిత్రదుర్గ, బళ్ళారి, రాయచూరు జిల్లాల్లో ప్రవహించి గద్వాల తాలూకా సరిహద్దులో ఆంధ్రప్రదేశ్‌లోకి ప్రవేశిస్తుంది ఇక్కడ 50 మైళ్ళు పారి అలంపూరు తాలూకా సరిహద్దులో కృష్ణానదిలో కలిసి పోతున్నది

తుంగభద్రకు ఉపనదులు మూడు (1)వరదా (2)హగరి (3)హంద్రి అనేవి. వరద మల్లాపురం దగ్గర కలుస్తున్నది హగరి బళ్ళారి దగ్గర కలుస్తున్నది హంద్రి కర్నూలు దగ్గర కలుస్తున్నది ఈ మూడింటిలో హంద్రే పెద్దది ప్రాచీనమైంది మత్స్య- వాయు పురాణాలలో ఆంధ్రీ నదిగా పేర్కొనబడినిది ఆంధ్రీ అపభ్రంశమై హంద్రి అయినది

ప్రాజెక్టులు. తుంగభద్రా పరీవాహక ప్రాంత వైశాల్యం 26,998 చదరపు మైళ్ళు ఈ నదికి విజయనగర రాజులు(1520-60) బళ్ళారి జిల్లా వల్లభపురం నుండి కర్నూలు జిల్లా రాంపూరు వరకు 17 ఆనకట్టలు కట్టించి కాలువల ద్వారా 30 వేల ఎకరాలకు నీళ్ళు అందించినారు 1856 ప్రాంతంలో కాటన్ దొర సుంకేసుల దగ్గర ఆనకట్ట కట్టి కడప-కర్నూలు కాలువ ద్వారా 3 లక్షల ఎకరాలకు పారుదల సౌకర్యము కలిగించాడు ఇవన్నీ చక్కగా ఉపయోగపడుతున్నాయి అవిభాజ్య మద్రాసు ప్రభుత్వము, హైదరాబాదు ప్రభుత్వాలు కలిసి హోస్పేటు దగ్గర తుంగభద్రా ప్రాజెక్టు నిర్మించినారు దాని నుండే కుడివైపున రెండు కాలువలు ఎడమ వైపు ఒక కాలువ త్రవ్వించినారు గద్వాల, అలంపూరు తాలూకాల కొరకే రాజోలిబండ దగ్గర ఆనకట్ట కట్టి కాలువ త్రవ్వించినారు

తుంగభద్రా తీర పుణ్యక్షేత్రాలు -

తుంగభద్రా నదీ తీరంలో ఎన్నో క్షేత్రాలు వెలసినాయి. ఎన్నో దివ్యశిల్ప కళాలాలితములైన భవ్యదేవాలయాలు విరాజిల్లుతున్నాయి ఈ తీరంలో కర్ణాటకలోను, ఆంధ్ర ప్రాంతంలోను ఉన్న కొన్ని ముఖ్య క్షేత్రాలను తెలుసుకుందాము.

(1) శృంగేరి- ఇది తుంగా తీరంలో ఉన్నా తుంగభద్రకు సంబంధి క్షేత్రముగా పరిగణిస్తారు ఇక్కడ శంకర భగవత్పాదుల దక్షిణామ్నాయ అద్వైత పీఠమును స్థాపించినారు ఈ మఠంలో శ్రీ చంద్రమౌళీశ్వర లింగము, శ్రీ శారదా దేవి మూర్తి ఉన్నాయి. ఇక్కడి ప్రకృతి శోభను, అపూర్వ శిల్ప విరాజితమైన విద్యాశంకర దేవాలయాన్ని చూడడానికి దేశ విదేశ యాత్రికులు వస్తుంటారు

(2) కూడ్లి క్షేత్రము.- తుంగ భద్రా నదులు సంగమిస్తున్నాయి శృంగేరికి సంబంధించిన ఒక మఠమున్నది

(3) హరిహర క్షేత్రము - ఇక్కడ హరిహరులు కుడిఎడమలుగా ఒకే మూర్తిలో తీర్చబడినారు ఈ పట్టణంలోని సుందర దేవాలయాలు- పారిశ్రామిక కర్మాగారాలు చూడతగినవి

(4) హంపీ క్షేత్రము – బళ్ళారి జిల్లా హొస్పేట దగ్గర ఉంది చాలా ప్రాచీన క్షేత్రము రామాయణములో ప్రస్తావించబడిన పంపా సరోవరం, ఋష్యమూక పర్వతం ఇక్కడనే ఉన్నాయి

శ్లో భరతస్యచ దుఃఖేన, వైదేహ్యా హారణే నచ ।

శోకార్తస్యాపి మే పంపా । శోభతే చిత్రకాననా ॥

(రాముడంటాడు, భరతుని దుఃఖం చేత, సీత అపహరణం చేత శోకతప్తమైన నాకు సుందర అరణ్యంతో కూడిన పంపా సరోవరం మనస్సమాధానం కలిగిస్తున్నది ) (రామాయణం) పంపయే కన్నడంలో హంప, హంపి అయ్యింది 14వ శతాబ్దంలో వైదిక ధర్మమును నాశము చేయుచున్న ముస్లిం సైన్యాలను పారద్రోలి వేద ధర్మ రక్షణకు కంకణము కట్టుకున్న శ్రీ మాధవ విద్యారణ్య స్వామి అజచే నిర్మించబడి ఆయన స్థాపించిన విజయనగర సామ్రాజ్యానికి రాజధాని అయిన విద్యానగరము ఇక్కడనే ఉన్నది

శ్లో విద్యాభిధాన నగరీ విజయోన్నతశాలినీ

విద్యారణ్యకృతా తస్యాం । రత్న సింహాసనే స్థితః ॥ (బుక్క–శాసనం)

ఇక్కడి క్షేత్ర దేవతలు – భువనేశ్వరీ, విరూపాక్షేశ్వరులు హరిహర – బుక్క – కృష్ణరాయలు కట్టించిన సుందర దేవాలయములు ప్రస్తుతం శిథిలావస్థలో ఉన్నాయి

(5) మంత్రాలయము:– మహాయోగి అయిన శ్రీ రాఘవేంద్రస్వామి సజీవంగా ప్రవేశించిన దివ్య బృందావనం ఇక్కడ ఉంది. ఆయన మహిమలు సుప్రసిద్ధాలు. ఎందరో ఆర్తులు బాధానివారణకై ఇక్కడికి వచ్చి సేవలు చేస్తుంటారు. ఇక్కడికి కర్నూలు నుండి ఇతర పట్టణాల నుండి బస్సులున్నాయి. మఠంవారు ఏర్పాటు చేసిన వసతులు, భోజన సౌకర్యాలున్నాయి.

(6) దక్షిణ కాశీ – అలంపూరు .– కర్నూలుకు 8 మైళ్ళ దూరంలో ఈ క్షేత్రముంది కర్నూలు నుండి ప్రతి గంటకు బస్సులున్నాయి. క్షేత్ర దేవతలు శ్రీ జోగులాంబా మహాశక్తి, బాలబ్రహ్మేశ్వరులు నది ఒడ్డు మీదనే ఉంది ఆ దక్షిణకాశీ అలంపూరు. ఇక్కడ బాదామీ చాళుక్యులు నవబ్రహ్మేశ్వరాలయాలను కట్టించినారు షణ్మతాలకు సంబంధించిన (శైవ, వైష్ణవ, శాక్తేయ, సౌర, గాణాపత్య, కౌమారములు) దేవాలయాలున్నాయి ఈ విధముగా అన్ని సాంప్రదాయములకు చెందిన ఆలయాలు ఒకే చోట ఉండడం అరుదు ఇక్కడికి సమీపంలో పాపనాశిని క్షేత్రం ఉంది సంగమేశ్వరాలయాన్ని తెచ్చి అదేవిధంగా ఇక్కడ కట్టినారు

(7) సంగమేశ్వరము – అలంపూరుకు 12 మైళ్ళ దూరంలో ఉండిన కృష్ణా–తుంగ భద్ర సంగమస్థానము ఇప్పుడు 4 మైళ్ళ దూరంలో గుందిమళ్ళ గ్రామం దగ్గర ఏర్పడింది ఈ ఊరి బయట చిన్న గట్టు మీద ఒక భక్తురాలు శ్రీమతి ఇర్వింటి నాగలక్ష్మమ్మగారు తన ఇష్టదేవత అయిన శ్రీ ఝంకారేశ్వరీ దేవికి, శ్రీ మౌనేశ్వరీ దేవికి ఆలయాలు కట్టించి అక్కడనే ఉండి సాధనలు చేసుకుంటున్నారు ఆలయాల సమీపంలోనే రెండు నదులు కలుస్తున్నందున ఆనందం కలుగుతుంది. స్నానములకు అనుకూలంగా ఉంటుంది అడవి కావున యాత్రికులు తమ ఆహారపు యేర్పాట్లు చేసుకోవలెను.

(8) కర్నూలు పట్టణము:– ఇది జిల్లా కేంద్రము ఆంధ్రప్రదేశ్‌లోని ప్రాచీన పట్టణాలలో ఇదొకటి శాతవాహనుల తరువాత ఇక్ష్వాకులు ఈ ప్రాంతాలను పాలించినారు వీరి రాజధాని విజయపురి నేటి నాగార్జున

కొండ 3వ శతాబ్దంలో ఈ వంశీయుడు రుద్రపురుషదత్తుడు హలంపుర స్వామికి భూదానం చేసి వేయించన శిలాశాసనం రెంటచింతలలో ఉంది ఇక్ష్వాకుల ప్రతినిధిగా మహాప్రతీహార, మహాతలవర విశాఖస్కంద నాగుడు మహబూబ్‌నగర్- కర్నూలు ప్రాంతాలకు పాలకుడుగా ఉండెను స్కంద శబ్దం ప్రాకృతంలో ప్రాంతీయ బాషల్లో కంద అవుతుంది అతడు కట్టించినదే ఈ పట్టణము అతని పేర కందని ప్రోలు అది రానురాను కందనవోలు, కందనోలుగా మారి ఇంగ్లీష్ వాళ్ళ కాలంలో కర్నూలైంది ఇతడు మహబూబ్ నగర్ జిల్లాలో గూడ నాగర్‌కర్నూలు కట్టించినాడు కందనవోలు ఆంధ్రప్రబంధ సాహిత్యంలో పేర్కొనబడింది వసుచరిత్రలో రామరాయలు కందనోలు పురమును పాలించినట్లుంది ప్రసిద్ధచాటువులో "ప్రణత ప్రాభవ కందనోలు పురగోపాల క్షమావల్లభా" అని ఉంది ఇక్కడ చూడదగినవి చాలా వున్నాయి

---

## జాతీయ కావ్య కర్త - కీ. శే. కె. సిహెచ్. సుబ్బరాయుడు, యం.ఏ.,

-డా కశి రెడ్డి, కార్యదర్శి, జాతీయ సాహిత్య పరిషత్, ఆంధ్రప్రదేశ్, హైదరాబాదు

శ్రద్ధాంజలి

కీ శే కె సి హెచ్. సుబ్బరాయుడు గారు కవి, సుప్రసిద్ధ సాహిత్యవేత్త, అధ్యాపకులు, కర్నూలు జిల్లా జాతీయ సాహిత్య పరిషత్ కార్యదర్శి, ఎమ్మిగనూరు జాతీయ సాహిత్య పరిషత్ వ్యవస్థాపక సభ్యులు కర్నూలు జిల్లా ఆదోని తాలుకాలోని పెద్దకడుబూరు జిల్లా ప్రజా పరిషత్ ఉన్నత పాఠశాలలో తెలుగు పండితులైన శ్రీ సుబ్బరాయుడు గారు 1993 మే 1వ తేదిన దివంగతులైనారు ఆరోజంతా గీతా పారాయణం చేస్తూ ఆ సాయంకాలం 5 గంటల ప్రాంతములో శ్రీ రామ నామము జపిస్తూ కన్నుమూశారు. జాతీయ సాహితీ సంస్కృతుల వికాసానికి విశేషంగా కృషిచేసిన కావ్యకర్త కార్యకర్త

1942లో జన్మించిన శ్రీ సుబ్బరాయుడు గారు కర్నూలు జిల్లాలో అనేక ఉన్నత పాఠశాలలో ఆంధ్ర పండితులుగ పనిచేశారు. ఆంగ్ల నాటక చక్రవర్తి షేక్స్పియర్ కావ్యాన్ని "లూక్రెన్ భంగపాటు" పేరిట గేయ కావ్యంగా 1981లో అనువదించి సాహితీ రసికుల మన్ననలందుకొన్నారు

1993లో కచుని జీవితాన్ని ప్రధానంగా స్వీకరించి ఒక ఆధునిక జాతీయ పద్యకావ్యాన్ని "దేశం కోసం" అనే పేరుతో రచించారు ఆ గ్రంథానికి వారి మిత్రులు, సుప్రసిద్ధ సాహితీవేత్తలు, ధార్మిగ సాంస్కృతిక రంగాలలో విశేషంగా పరిశ్రమిస్తున్న కార్యకర్తలు శ్రీ జె యస్ ఆర్ కె శర్మ గారికి అంకితమిచ్చారు ఈ గ్రంధాన్ని ప్రమరించాలనే ప్రయత్నం జరుగుతుండగానే శ్రీ సుబ్బరాయుడుగారు స్వర్గస్థులు కావటం విచారకరము ఎమ్మిగనూరు, జాతీయ సాహిత్య పరిషత్ వారు ఈ కావ్యాన్ని సర్వాంగ సుందరంగా ముద్రించారు

### కావ్యానికి స్వాగతం

"దేశంకోసం" ఆధునికాంధ్ర పద్యకావ్య ప్రపంచంలోకి వచ్చిన మరో ఉత్తమ కావ్యం ఇతివృత్తం పౌరాణికం, భారతాంతర్గతం, రచనకు ప్రేరణం జాతీయత-భారతీయత ఆశయం-సత్య,ధర్మ,శీల విజయ ప్రచారం, ఫలితం అక్షరామృత కావ్యసృష్టి.

ఇతివృత్తం మహాభారతంలో ఆదిపర్వం తృతీయశ్వాసంలోని 33 పద్యాల్లో నడచిన కథను శ్రీ కె.సి హెచ్ సుబ్బరాయుడుగారు సుమారు 500 పద్యాల జాతీయ పద్య ప్రబంధంగా తీర్చిదిద్దారు.

కావ్య నిర్మాణం: కవి ఎన్నుకొన్న ఉపశీర్షికలు 1. సుధర్మ 2 స్నాతకోత్సవం 3 దేశంకోసం 4 స్వీకారం-శ్రీకారం 5 హననం జననం 6 హననం-దహనం 7. విద్యావిజయం 8 దివాస్వప్నం 9 శీల విజయం. ఇవి సనాతన కథను నిత్యనూతనంగా తీర్చిదిద్దే యత్నాన్ని ప్రదర్శిస్తాయి

(తరువాయి 53వ పేజీలో)

# తుంగ భద్రా పుష్కరాలు-భారతీయ శాస్త్రీయ దృక్పథం.

-జిరగ్లపూడి సీతారామకృష్ణశర్మ ఎం.ఏ ,

శ్లో॥ తుంగా నారాయణప్సాక్షాత్ భద్రాదేవోమహేశ్వరః
తయోనంగమరూపేణా తుంగభద్రావిశిష్యతే

పృథివ్యాపస్తేజో వాయురాకాశాత్ ఇవి పంచభూతాలు నేల, నీరు, నింగి, తేజస్సు, వాయువు అనేవి పంచభూతాలు ఆకాశం నుండి శబ్దం, వాయువు నుండి స్పర్శ తేజస్సునుండి రూపము, నీటి నుండి రసము, నేలనుండిగంధము అనే పంచతన్మాత్రలు ప్రభవించాయి ఈ సృష్టికి ఈ ఐదు మూలకాలు ఆధారం అని మన నమ్మకం మన సర్వశాస్త్రాలకీ పంచీకరణ సిద్ధాంతంపునాది పరబ్రహ్మమునకు ఐదు ముఖములు ఈశానమువలన ఆకాశము, పరమాత్మ, తత్పురుషమువలన వాయువు, జీవాత్మ, అఘోరమువలన అగ్ని, తేజస్సు, వామదేవమువలన నీరు, చంద్రుడు, సద్యోజాతము వలన పృథ్వి సూర్యుడు కల్గిరనిమన శాస్త్రము

శ్లో॥ పంచానామపి భూతానాం అపోశ్రేష్ఠత్వమాగత

పంచభూతములలో నీరు శ్రేష్ఠమైనది నీటిలో నవసించు వాడు నారాయణుడు జీవము అనగా నీరని, బృహస్పతియని అర్థములున్నవి. బృహస్పతి తుంగభద్రా నదిలో ప్రవేశించు కాలము తుంగభద్రా పుష్కరము

శ్లో॥ కావేరి తుంగ,భద్రాచ కృష్ణ వేణ్యాచ గౌతమీ
భాగిరధీతు విఖ్యాత పంచగంగా ప్రకీర్తతే

ఇవి ఆంధ్రులు పంచగంగలని భక్తితో పిలుచుకొంటారు
తుంగభద్ర కృష్ణకు ఉపనదియుని దానికి పుష్కరాలు లేవను అభిప్రాయము తప్పు

శ్లో॥ మేషేగంగా, వృషేరేవా గతేయుగ్మేసరస్వతీ
యమునా కర్కటేచైవ గోదాసింహం గతేపిచ
కన్యాయాం కృష్ణవేణీచ కావేరీచ తులాగతే
వృశ్చికేశ్యాత్ భీమరధీ చాపే పుష్కర వాహినీ
మకరే తుంగా ఘటే సింధు, ప్రణీతాతటినీఝషే
తిష్ఠన్నిబ్దాత్ మరగురుః క్రమాత్ సర్వేమునీశ్వరాః

బుద్ధికి అధిపతిఐన బృహస్పతి ఒక సంవత్సరం పాటు తుంగభద్రా నదిలో సర్వదేవతా పుష్కరక్షేత్రదేవతలతో పాటు ఉంటారు 1996 డిసెంబరు 26 నుండి 12 రోజులు అంటే 1997 జనవరి 6వరకు తుంగభద్రకు పుష్కరాలు .

భూమి అంతరిక్షాలను సమన్వయపరచే అద్భుత శాస్త్రీయ విజ్ఞానం మనది. సూర్యుడు గ్రహరాజు, బృహస్పతి గ్రహం. వీరు ఆకాశంలో ఉంటారు నేలపై ప్రవహించే నది తుంగభద్రా జీవజలాలు. గాలితో ప్రాణాయామంచేస్తూ ఆకాశంలోని సూర్యునికి అర్ఘ్యంవదలుతూ పృథ్వీ సూక్తంపలుకుతూ అఘమర్షణ మంత్రాలతో తుంగా పూజతోనదిలో స్నానం చేసి బృహస్పతిని పూజించి పుష్కరాది తీర్థక్షేత్ర దేవతలకు నమస్కరించి పితృదేవతలకు తర్పణాలు వదలి దానధర్మాలు చేసే పంచభూతతృప్తి సర్వం పుష్కరం.

పండిత్ జవహర్ లాల్ నెహ్రూ "నా జీవన గంగ" అని గంగపై తనకున్న భక్తిని ప్రకటించుకున్నాడు కర్నూలు వారికి తుంగభద్ర తల్లి తుంగభద్రా తటంలో విజయనగర సామ్రాజ్యం విలసిల్లింది దక్షిణ భారతంలో స్వర్ణయుగాన్ని మెరిపించింది తుంగభద్ర తెలుగు సాహితీ సమరాంగణ సార్వభౌమి తిమ్మరుసు ధీయుక్తికి

కృష్ణరాయల కీర్తికి కారణమైంది భువన విజయం చేసి, విద్యారణ్యస్వామిని, పంపావిరూపాక్షుని స్మరించుకొని హిందూధర్మాన్ని రక్షించుకొన్నది పంపసాగరాన్ని, కంభం చెరువుల వంటి ఎన్నో తటాకాలు నిర్మించుకొని సస్యకేదారాలతో పాటు కావ్యనందనవనాల ఫలాలను పండించుకొన్నది 'అల్లసానివారి వరూధిని, ముక్కుతిమ్మన సత్యభామ, వసుచరిత్రకారుని గిరికతో, కళాపూర్ణ సుగాత్రితో, రాయలగోదా దేవితో కబుర్లాడింది తుంగభద్రా. విజయనగర వీరులు శత్రుసంహారంచేసి కత్తులు కడగటంతో కించిత్ రాగరంజితమైంది తుంగభద్ర నేటికి కర్నూలు కడప కుల్యద్వారా రాయలసీమకు అన్నదానం చేస్తున్నది తుంగభద్రా జీవనది

భారతీయ నాగరికత అంతా నదీ తీరజన జీవన సంస్కృతీ విలసితమే! జీవనదులన్నీ విభిన్న భాషా సంస్కృతులను, వివిధ మతానుయాయులను భావసమైక్యతతో పెనవేసి భిన్నత్వంలో ఏకత్వాన్ని సాధించగల, జాతీయ సమైక్యతకు అంకితమయ్యే శుభపర్వాలు తుంగభద్రా నదీ పుణ్యపుష్కరాలు.

శ్రీకృష్ణదేవరాయల అష్టదిగ్గజ ప్రఖ్యాత కవి తెనాలి రామకృష్ణుడు తన పాండురంగమాహాత్మ్యంలో తుంగానదినిలా ప్రస్తుతిస్తాడు

శా !! గంగా సంగమ మిచ్చగించవె మదిన్ కావేరి దేవేరిగా
నంగీ కారమొనర్చునే యమునతో నానందమును బొందునే
రంగత్తుంగ తరంగ హస్తముల నారత్నాకరేంద్రుండు నీ
యంగంబ ంటి సుఖించునేని గుణభద్రా తుంగభద్రానదీ!

---

(51వ పేజీ తరువాయి-కీ. శే కె సి హెచ్ సుబ్బరాయుడు)

ఆత్మీయం- పరమాత్మీయం లో శ్రీకారంతో కావ్యాన్ని ప్రారంభించి కవివంశ వర్ణన-కావ్య స్వీకర్త వర్ణన- ఇష్ట దేవతా స్తుతి ఇత్యాది ప్రాచీన కావ్య నిర్మాణ పద్ధతిని అనుసరించిన కవి సమకాలీనతను అడుగడుగునా సమకూర్చి తనదైన వినూతన అధునాతత్వాన్ని చాటుకొన్నాడు. ఆధునిక కావ్యనిర్మాణ శాస్త్ర మర్మజ్ఞుడనిపించుకొన్నాడు

దేశం రెండుగా చీలింది అయినా రాక్షసులకు తృప్తిలేదు. వాళ్ళు ఇంకా భూమి కబ్జా చేస్తున్నారు. దేశానికి, జాతికి ముప్పు ఏర్పడింది ఆ రాక్షసుల దగ్గర వున్న మృత సంజీవని విద్య మనమూ నేర్చుకోవాలి జాతీయతనీ ధర్మాన్ని కాపాడాలి అదే మనకు ముక్తి సుధర్మ అనే ప్రధమ ఖండంలో ఈ చర్చ జరిగింది ఈ చర్చ అంతా ప్రస్తుత భారత పరిస్థితిని తెలియజేస్తున్నది

జాతీయ మహోద్యమ నిర్మాణంలో తెలుగువారిలో జాతీయ భావ ప్రతిష్ఠాపనానికి 'శివభారతం' 'రాణాప్రతాప సింహచరిత్ర' ఆరోజా అవిర్భవించాయి

ఇవాళ దేశం చీలింది సమాజంలో వ్యక్తిగత శీలం, జాతీయత కొరవడింది వాని నిర్మాణం కోసమే శ్రీ సుబ్బరాయుడు గారు కలం పట్టారు. అందుకే "దేశంకోసం బలివినా మళ్ళీ మళ్ళీ దేశంకోసం జన్మిస్తాను అమృతస్య పుత్రుడనని నిరూపిస్తాను." ఈ ధ్యేయంతో కవి కచుని పాత్ర అత్యుదాత్తంగా మలచాడు. కవి కచుడైనాడన్నా తప్పులేదు శీలానికి విజయం కలిగించాడు. శత్రువుల దివాస్వప్నా లను బదాబదలు చేశారు సుధర్మ నుండి-శీలవిజయం వరకు కథ ఈ ధ్యేయంతోనే నడచింది ప్రబంధ నిర్మాణాన్ని కలిపి నిలిపిన "సిమెంట్" జాతీయత

దేశంకోసం సద్గుణ సంశోభితమైన జాతీయ కావ్యం జాతీయ కావ్యానికుండే ప్రధమ లక్షణం నేలతల్లిని కాపాడుకొమ్మనే ప్రబోధం. నేల ఉంటే తామంటాడు నేల లేకపోతే తానులేడు కుటుంబము

(తరువాయి 60వ పేజీలో)

# తుంగభద్ర సాక్షిగా...

-జె.యస్.శ్యామసుందరశాస్త్రి ఎం.ఏ , పి జి డి (జర్నలిజం)

(శ్రీకృష్ణదేవరాయల ఆత్మభూమిపైకి వచ్చి తను పాలించిన ఈ సీమ ఎలా ఉందో చూడాలను కుంటుంది తుంగభద్ర కూడా మానవరూపం దాల్చి శ్రీకృష్ణదేవరాయలకు ప్రస్తుతం కర్నూలు జిల్లా గురించి వివరిస్తుంది )

శ్రీకృష్ణ గంగా సంగమమిచ్చగింమనె. గుణభద్రా తుంగభద్రానదీ!

తుంగ : ఎవరూ? కృష్ణరాయలవలె నున్నదే!

కృష్ణ అవునమ్మా తుంగభద్రమ్మ తల్లీ! నీ ప్రియ పుత్రుడను! ఇదే నమస్కరించుచున్నాను

తుం ఎన్నాళ్ళకు మళ్ళీ నిన్ను చూడగలిగాను నాయనా!

కృష్ణ నాలోనూ అవే భావవీచికలు తల్లీ! నారాజ్యం, నేను పాలించిన ఈ సీమ ఎలాఉందో చూచి పోవాలన్న కోరిక ఉదయించి స్వర్గలోకం నుండి సరాసరి ఇక్కడికి వచ్చా నమ్మా!

తుం అంతకంటే సంతోషమేమున్నది నాయనా! నేను స్వయంగా నీ వెంట ఉండి ఈ కర్నూలు జిల్లానంతటినీ చూపించే ప్రయత్నం చేస్తాను.

కృ : అంతకన్నా భాగ్యమా తల్లీ! కృతార్థుడిని

తుం ప్రస్తుతం నీవున్న ఈవేల కర్నూలు జిల్లా ముఖ్యపట్టణం ఈ తెలుగు నేల 1950లో ఆంధ్రరాష్ట్రంగా అవతరించినప్పుడు ఈనగరమే రాష్ట్ర రాజధాని. గతంలో కందనవోలుగా పిలువబడేది ఇప్పుడు కర్నూలు గా పిలువబడుతోంది

కృ : ఆ కనబడే ఎత్తైన కట్టడం ..

తుం అది కొండా రెడ్డి బురుజు ప్రస్తుతం పురాతత్వశాఖ వారి సంరక్షణలో ఉంది. శాతవాహనుల కాలంలో ఇది స్కందప్రోలు అని పిలువబడేది. కందనవోలుగా కాలక్రమంలో మారిపోయింది కందనవోలు, కందవోలు, కందనోలు ఇటువంటి పేర్లు కనిపిస్తాయి. కర్ణి రాజుల కాలంలో వెలసిన నగరమిది అనర్వరాఘవకర్త అయిన బిజ్జల తిమ్మారెడ్డి తమ్ముడు కొండారెడ్డి ప్రాతకోట సీమకు అధిపతి అయ్యాడు. బహుమనీ సుల్తానుల కాలంలో గోలకొండ నవాబులు ప్రాతకోటను కైవసం చేసుకుని కొండారెడ్డిని తీసికొని వచ్చి ఈ బురుజులో బంధించారు అందుకే దానిని కొండారెడ్డి బురుజు అని పిలుస్తున్నారు ఇక్కడే బీజాపూర్ పాలకుల సేనాపతి అబ్దుల్ వహాబ్, ఇక్కడ, పరిపాలిస్తున్న విజయనగర రాజుల వంశీయుడైన గోపాల్ రాజును ఓడించి కర్నూలు నగరాన్ని స్వాధీనం చేసుకున్నాడు. ఆ అబ్దుల్ వహాబ్ సమాధి ప్రదేశమే అబ్దుల్ వహాబ్ గుమ్మజ్ అధునిక కాలంలో గ్రంధాలయోద్యమం ద్వారా ప్రజలకు విస్తృత చైతన్యాన్ని కలిగించిన గాడిచర్ల హరిసర్వోత్తమరావు, విద్యావిధాన కర్తలుగా పేరు గాంచిన అర్కాటు సోదరులు రామస్వామి మొదలి యార్, లక్ష్మణ స్వామి మొదలియార్, సురవరం ప్రతాపరెడ్డి వంటి పండితులు, శ్రీనాయకంటి శంకర రెడ్డి, పద్మభూషణ్ డా శ్రీపాదపినాక పాణి, డా. పి శివారెడ్డి వంటి వారి స్వక్షేత్రమిది. తెలుగులో తొలి నవలగా భావించే రంగరాజ చరిత్రం రచించిన నరహరి గోపాలకృష్ణమచెట్టి ఇక్కడి వాడే!కాకర్ల త్యాగరాజు, బహుముఖప్రజ్ఞాశాలి మోక్షగుండం విశ్వేశ్వరయ్యా కూడా ఇక్కడివారే!

కృ జాగున్నదమ్మా! మరి ఎటువైపు బయలు దేరుదాం?

తుం మంత్రాలయం వైపుగా నాయనా! ఆ. అదిగో పెద్దపాడు. అది ప్రజానాయకుడు దామోదరం

సంజీవయ్య స్వగ్రామం రాచరికం పోయి ప్రజాస్వామ్యవ్యవస్థ ఏర్పడిన తరువాత స్వతంత్ర భారతావనిలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ముఖ్యమంత్రిగా ఆయన సేవచేశాడు

కృ కాలగమనంలో మార్పు సహజం కదా తల్లీ ఆ కొంచెం దూరంగా అక్కడ కనిపిస్తున్న ఆనకట్ట వంటి కట్టడం

తుం మాటల్లో నే కొడుమూరు పట్టణం దాటి వచ్చేశాం అది గాజులదిన్నె ప్రాజెక్టు నాయనా! రైతుల కోసం ప్రభుత్వం నిర్మించిన సేవా ప్రకల్పమది

కృ విజ్ఞాన శాస్త్ర ప్రయోజనాలకు అది ఒక తార్కాణం కదమ్మా!

తుం అవును నాయనా! అదుగో ఆ కనిపించే పట్టణం ఎమ్మిగనూరు చేనేత కార్మికులకు నెలవైనదీ ఊరు పారిశ్రామిక వేత్తలుగా ఎందరికో జీవిక లేర్పరచిన మాచాని సోమప్ప, సోదరులు ఈవూరి వారే!

కృ చాల సంతోషం తల్లీ ఏదో పుణ్యక్షేత్రానికి వచ్చినట్లున్నాం!

కృ అదె మంత్రాలయం కృష్ణరాయా! మహిమాన్వితుడని భక్తులు నమ్మే రాఘవేంద్రస్వామి సజీవ సమాధియైన ప్రదేశం ఇది అక్కనే నాప్రవాహం కనిపిస్తోంది కదా! అదుగో సమీపంలోని ఆదోని పట్టణనివాసి దేవులపల్లి వెంకసుబ్బయ్యకవి ఈక్షేత్రాన్ని కీర్తిస్తున్నాడు

సత్య సద్ధర్మరతుడగు సాధుమూర్తి
కామితార్థమ్ములిచ్చెడి కల్పతరువు
పూజ్యుడగు రాఘవేంద్రుండుపుణ్యమూర్తి
అవని వెలసిన క్షేత్రంబు మంత్రాలయంబు

కృ నీ వొడిలో వొదిగిన ఈ పుణ్యక్షేత్ర సందర్శన మాత్రం చేత ఎ:నసు కేదో తెలియని సాంత్వన కలుగు తున్నదమ్మా! ఆకనిపించే పట్టణం ఆ

తుం అదే ఆదోని గొప్పవ్యాపార కేంద్రం! ఒకప్పుడు రెండవబొంబాయి నగరంగా పేరు పొందింది. ఆ చివర గుట్టమీద కనబడేదే రణమండల ఆంజనేయ స్వామి ఆలయం ఆ స్వామి నిలిచిన చోటు ఆదవాని కొండ ఈ ప్రాంతం శాతవాహనుల జన్మస్థానం దీనినే శాతవాహన దర్గం అనేవారు ఆదవాని కొండ మీద విజయనగర సేనలు విడిదిచేసేవి బీజాపూరు నవాబులకు, విజయనగరసేనలకు కొల్లాలం, దగ్గర యుద్ధాలు జరిగాయి ఆయుద్ధానికి ఇక్కడి నుండి సైన్యం తరలి వెళ్ళేది అందువల్లే ఈ స్వామి రణమండల ఆంజనేయస్వామి అయినాడు గత స్మృతులేవో నిన్ను వెంటాడు తున్నట్లున్నాయి కదా కృష్ణరాయా!

కృ: అవునమ్మా! మా పరాక్రమానికీ, శౌర్యానికీ అద్దం పట్టే వీరస్థలి కదా ఇది

తుం: ఇక్కడి నుండి మనం ఆలూరు వైపుగా వెళదాం అదుగో ఆకనపడే పుణ్యక్షేత్రం ఉరుకుంద నరసింహస్వామి - ఇక్కడ ఉరుకుంద-వీరన్న గా కొలువబడుతూ ఉన్నాడు ఇక్కడ ప్రజలకు ఈయనపట్ల గల భక్తి విశ్వాసాలు తిరుగులేనివి

కృ. అది ఆప్రజల పుణ్యవిశేషం కదా తల్లీ!

భక్తవరదు డు ప్రహ్లాద పాలకుండు
శ్రీనృసింహుడు వెలసిన క్షేత్రమిదియె
అరయ వీరన్నయన్న పేరొంది యెపుడు
భువిని వెలకొన్న ఉరుకుంద పుణ్యభూమి

తుం ఆకనిపించే గ్రామం చిప్పగిరి ఈ చిప్పగిరి ప్రాచీన కాలంలో శిల్పగిరి పేరిట ప్రసిద్ధం ఇప్పటికీ పాడుబడిన జైన మందిరాలు అక్కడ ఉన్నాయి అక్కడి వెన్నకే శవదేవాలయుం పరిసరాల్లో అలియ రామరాయుల నాటి శిలా శాసనం ఉంది ఊరినడుమ అప్పాజీ తిమ్మరుసు దాన ప్ర స్తావన చేసిన శాసనం ఉంది విజయనగర పతనం తర్వాత శిల్పగిరినే రాజధానిగా చేయాలనుకున్నారు ఇది కర్నూలుకు ఒక సరిహద్దు వ్యాసరాయుల వరంపరలోని విజయదాసులు, గోపాలదాసులు భాగవత తత్వాన్ని వివరించిన చోటిది ఆ ప్రక్కన పత్తికొండ మౌర్యుల, శాతవాహనుల కాలం నుండి ఈ ప్రాంతం ప్రసిద్ధం అశోకుని దక్షిణ బారత రాజధాని సువర్ణగిరి ఇక్కడదే! ఈ ప్రాంతంలోని మిట్టలు, గుట్టల నుండి పురోగమించిన ప్రవాహం హంద్రీ దీనికి అంధ్రి అని పూర్వనామం ఆంధ్రజాతికి ఎనలేని సేవచేసిన బ్రిటీష్‌వారిలో సర్‌థామస్ మన్రో ప్రముఖుడు మన్రో రైత్వారీ విధానాన్ని అమలు చేయడానికి, పాలెగాళ్ళను అణచివేసి చక్కటి పరిపాలనావ్యవస్థ నేర్పరచడానికి ఎంతో కృషి చేశాడు ఆయన పేరిటే ఇప్పటి మన్రోతోపు వెలసింది పాపం కలరా తగిలి పత్తికొండలోనే కన్నుమూసాడు ఇక మనం ఇలా ప్యాపిలి వైపుగా వెళదాం

కృ ఆబాటపై అంతగా వాహన సంచారం ఉన్నదేమిటమ్మా?

తుం. అది ఏడవ జాతీయ రహదారి నాయనా! రాష్ట్ర రాజధాని భాగ్యనగరం నుండి కర్నూలు, అనంతపురాల మీదుగా కర్ణాటక రాష్ట్రరాజధాని బెంగళూరుల మీదుగా ఈ ఏడవ జాతీయ రహదారి ప్రయాణిస్తుంది అదుగో అది ఎఱ్ఱగుడి ఎఱ్ఱగుడి, రాజాల మండగిరి అనే ప్రదేశాలు పత్తికొండకు చేరువుగా ఉన్నాయి ఇక్కడి స్వర్ణగిరి సువర్ణగిరి గా ఆరోజుల్లో ప్రసిద్ధం అశోకుని దక్షిణసామ్రాజ్యానికి ఇది రాజధాని ఆయన శాసనం ఇక్కడ ఎఱ్ఱగుడిలో ఉంది అహింసా సిద్ధాంతాన్ని ప్రచారం చేసే భావాలు అశాసనంలో కనిపిస్తాయి ఇక ఇదుగో . ఇది ప్యాపిలి, పశువిక్రయానికి ప్రసిద్ధి

కృ చక్కటి మార్గదర్శనం తల్లీ! ఈ పశుగణాభివృద్ధికి ఇక్కడి ప్రభుత్వం ఏమైనా చర్యలు తీసుకుంటున్నదా?

తుం లేకేం నాయనా! పశుసంవర్ధకశాఖ అకార్యక్రములను చేపడుతుంది పశురోగ నిరోధకచర్యలు, జాతి పశుగణాభివృద్ధి వంటి ప్రత్యేక కార్యక్రమాలు ఈ శాఖ చేపడుతుంది ప్రస్తుతం గొఱ్ఱెల పెంపకం విషయాలలో ఈ శాఖ జాతీయ ఉన్ని బోర్డు సహాయంతో ప్రత్యేక టీకాలు, మందులు సరఫరా చేయడం జరుగుతుంది. ఈ గొఱ్ఱెల పెంపకం ద్వారా ఉపాధి కల్పన కూడా జరుగుతుంది ఇతర పశువుల విషయంలో కూడా జాతీయ మూసరవ్యాధి నిర్మూలనా కార్యక్రమాన్ని చేపట్టి పశుప్రాణాలను రక్షించే ప్రయత్నం ప్రభుత్వం చేస్తున్నది

అదుగో ఆకనిపించేదే ద్రోణాచలం, వెల్దుర్తి అప్రక్కన బ్రహ్మకుండ పుణ్యక్షేత్రం

కృ మళ్ళీ మనం కర్నూలు నగరం వైపుగా వెళుతున్నామా అమ్మా?

తుం అవును నాయనా! ఈ పట్టణ శివార్లలో ఒక జంతుప్రదర్శనశాల కూడా నిర్మాణ దశలో ఉంది వన్యమృగాలను కూడా రక్షించే చర్యలలో భాగమిది ఇక ఆ కనిపించేవది హంద్రీనది నా ఉపనది దాని మీదుగా వెళుతున్న ఆకాలువ కర్నూలు-కడప కాలువ వ్యవసాయాభివృద్ధికోసం సర్ ఆర్డర్ కాటన్ అనే బ్రిటీష్ దొర ఈ కాలువను నిర్మించాడు

ప్రస్తుతం మనం పద్దెనిమిదవ జాతీయ రహదారిపై వెళ్తున్నాం అక్కడ కనిపించే పుణ్యక్షేత్రం కాలువబుగ్గ పరమేశ్వరుడు, రామలింగేశ్వరుడుగా పూజలందు కుంటున్న స్థలం ఇక్కడి నీటి బుగ్గవల్ల, దాదాపు వేయి ఎకరాలు నీటి సదుపాయాన్ని పొందుతున్నాయి దగ్గరలోని హుసేనా పురం

చక్కటి చుక్కరటి పళ్ళకు ప్రసిద్ధి

కృ. చక్కటి వసతి కల్పించాడమ్మా రామలింగేశ్వరుడు మరి వ్యవసాయానికి సంబంధించి

తుం దాదాపు 40 సం క్రితం వరకూ మన జిల్లాలో కొత్తరకమైన పంటలు పండించడం, ఎరువులు వాడడం లేవు కేవలం పశువుల ఎరువు మాత్రమే వేస్తుండేవారు ఇప్పుడు పత్తిరైతు అధిక దిగుబడినిచ్చే హైబ్రీడ్ విత్తనాలు వేస్తున్నారు అన్నిరకాల వసతులు ఇప్పుడున్నాయి దాదాపు 1070-72 నుండి వ్యవసాయం చెప్పుకోదగినస్థితిలో ఉంది.

ఈ జాతీయ రహదారి వదలి కొద్దిగా పక్కకు వెళదాం కొద్దిగా గుట్టలలో కనిపిస్తున్న ఈ ప్రాంతం దాటితే బేతంచెర్ల పట్టణం ఇక్కడి ఈ అటవీ ప్రాంతంలోనే బిల్లసర్గం గుహలున్నాయి. ఆదిమ మానవుడు ఇక్కడ జీవించినట్లు పరిశోధకులు చెబుతారు

కృ. బాగుంది తల్లీ! అకనపడే పట్టణం

తుం బేతం చెర్ల నాయనా చక్కటి నునుపైన, బలమైన బండలకు ఈ ప్రాంతం ప్రసిద్ధి ఈ బండ లేకుండా గృహనిర్మాణం ఈ ప్రాంతంలో జరుగదంటే అతిశయోక్తి కాదు సుదూర ప్రదేశాలకు కూడా ఎగుమతి చేస్తుంటారు.

కృ ఇక్కడ పారిశ్రామిక జీవనం ఎలా ఉందమ్మా?

తుం ఆధునిక యంత్రాలు, ఆధునిక ప్రపంచం నీ ఉత్సుకతను పెంచినట్టుంది. మైనింగ్స్, రకరకాల ఇనుపఖనిజం, సున్నపురాయి, లభిస్తాయి. నూనె వ్యాపారం, పరిశ్రమ బాగా అభివృద్ధి చెందాయి గుజరాత్ తర్వాత మనప్రాంతం అస్థాయిలో ఉంది ఇండస్ట్రియల్ ఎస్టేట్ కూడా ఉంది ఇంగా ఎన్నోరకాలుగా పారిశ్రామికాభివృద్ధికి వీలున్న ప్రాంతం కర్నూలు జిల్లా వరి ఎక్కడెక్కడ పండితే అక్కడ పేపర్ కర్మాగారం నిర్మించుకోవడానికి వీలుంది

కృ అమ్మా! అకనిపించే పట్టణము

తుం ఆదే బనగానపల్లి మధురమైన, మామిడి పండ్లకు పెట్టిందిపేరు ఇక్కడే సిద్ధపురుషుడైన బ్రహ్మంగారు కాలజ్ఞానాన్ని రచించారు ఆయన జ్ఞాపకార్థం నిర్మించిన మఠం అదే!

కృ అమ్మా! ఈవైపేదో పుణ్యక్షేత్రం ఉన్నట్లుంది!?

తుం అదీ యాగంటి క్షేత్రం ఇక్కడి గుహలు ఎంతో భక్తిని, ఉల్లాసాన్ని కలిగిస్తాయి అదుగో నంద్యాలకు చెందిన కవి గొట్టిముక్కల సుబ్రహ్మణ్య శాస్త్రి యాగంటి క్షేత్రాన్ని కీర్తిస్తున్నాడు

ఎఱ్ఱమల కొండల వరుస నెత్తుమించు
మూలకొండల మధ్య, శాంత్యాల వాలమైన
లోయను సుందరంబైన రూపుదాల్చిన
ఉమా మహేశుని అందాల కొలువు
లేపాక్షి బసవు బోలిన కోపాద్రిక్తాంగ
ఫణితి గూర్చిన దివ్యత్ రూపశిలాబసవన
ఇట చూపులకు ఆకర్షకమయి చోద్యము నింపున్

ఆకనిపించే పట్టణమే కోవెలకుంట్ల స్వచ్ఛమైన నేయికి పెట్టింది పేరు ఆ ప్రక్కగా కనిపించే గ్రామమే బెలుం ఇక్కడి బెలుం గుహలు బొర్రా గుహల కన్నా విశిష్టమైనవి ఆసియాలోనే పొడవాటి గుహలివి మెక్సికొ గుహల సొగసులు ఇక్కడ కనిపిస్తాయి జర్మనీ యాత్రికుడు గేబరు ఈ గుహలను

పరిశోధించాడు అవుకు , బనగానపల్లి, ద్రోణాచలం ఓర్వకల్లు తదితర ప్రాంతాల్లో సుమారు 72 గుహలు ఉన్నట్లు ఇక్కడి పరిశోధకులు అంచనా వేశారు

కృ ఈవైపు కొంచెం పెద్ద పట్టణమే కనిపిస్తున్నదమ్మా!?

తుం అదే నంద్యాల నీ తర్వాత కొంత కాలానికి అరవీటి వారి పాలనలో ఈ పట్టణం ఉండింది ఆ పాలకులలో ఒకరైన అరవీటి కృష్ణభూపతి సంస్థానం ఇది కళాపూర్ణోదయం,ప్రభావతీ ప్రద్యుమ్నం వంటి ప్రబంధాలను రచించిన కవి దిగ్గజం పింగళి సూరన ఇక్కడి వాడే! ఈ పట్టణం మంచి వాణిజ్య కేంద్రం కూడా

కృ చాల సంతోషం తల్లీ ప్రస్తుత సమాజంలో పరిపాలన ఎలా ఉందమ్మా?

తుం పరిపాలనా పరంగా ఎన్నో విభాగాల నేర్పాటు చేశారు సాధారణ పరిపాలనా అంశాల విషయాలన్నీ సంయుక్త మహామండలేశ్వరులు, మహామండలేశ్వరులు(కలెక్టరు) చూసుకుంటారు శాంతి భద్రతలు చూసుకోవడానికి రక్షణభట విభాగం ఉంది తిండి పదార్థాలు, నీటివసతి, నీటిపారుదల, భూపంపిణీ తదితర అంశాలన్నీ వారు చూచుకుంటారు

కృ బాగున్నదమ్మా! ఆకనిపించే పుణ్యక్షేత్రం

తుం అదే మహానంది క్షేత్రం మహాదేవుడు, మహానందీశ్వరుడుగా భక్తులను పాలించే పుణ్యక్షేత్రము ఇక్కడి సహజమైన నీటి ఊట దాదాపు మూడువేల ఎకరాల సుక్షేత్రానికి నీటి వసతి కూరుస్తున్నది ఇక్కడి అరటి పళ్ళు రుచిచూస్తే వదలిపెట్టరు ఎవరూ!

దట్టమైనట్టి కొండల దాపునందు
పారదర్శక జలములు పారుచుండ
శ్రీగిరికుమారి కామేశ్వరీ సహిత
భవ్యమహనంది శంభుండు పరిఢవిల్లె
పుష్కరిణి జలములు స్వాస్థ్యపూరకములు
జరర చైతన్య దీపక శక్తిదములు
స్వామికరుణా మయుండు, ప్రశస్త దేవి
నంది నవకాగ్రగణ్యమీ నంది నెలవు.

చక్కటి వ్యవసాయాభివృద్ధి ఉద్దేశ్యంగా ప్రభుత్వం నంద్యాలలో వ్యవసాయపరిశోధనా స్థానాన్ని నెలకొల్పింది. గత 9 దశాబ్దాలుగా ఈ కేంద్రం తన సేవలందిస్తోంది అధికదిగుబడి రకాలన్ని ఈ సంస్థకృషే! మనం మళ్ళీ 18వ జాతీయ రహదారిపైకివచ్చాం ఆకనపడే పట్టణం ఆళ్ళగడ్డ శిల్పకళ ఇక్కడ ఇప్పటికీ బాగా విరాజిల్లుతోంది. ఆవైపు కనిపించేదే అహోబలమహాక్షేత్రం

కాక తీయాన్వవాయు విఖ్యాత పురుషుడు
ఆదిరుద్రుండు నిలిపిన ఆదిమూర్తి
ప్రబల శ్రీమదహోబిల ప్రథితదైవము
ఔర! నవనారసింహ ప్రమాణమూర్తి.
శంకర భగవత్పాదుల సకలలోక సన్నుత
కరావలంబ మహోన్నత రచనము ఇట
ఉద్భవించినది యన అమిత మహిమ

గలిగి కాపాడుదైవము ఈ కలిమిరేడు
(జి సుబ్రహ్మణ్య శాస్త్రి)

ఈ ప్రాంతం నారసింహమూర్తి, చెంచులక్ష్మితో సైయాటలాడిన చోటు ఇక్కడి రామానుజాచార్యుల వారి పరంపరకు చెందిన శరగోప యతీంద్రులవారు ఉండేవారు. అల్లసాని పెద్దన, తాళ్ళపాక అన్నమాచార్యులు వంటి మహానుభావులకు విద్యాలయంగా విలసిల్లింది.

మనం మళ్ళీ కర్నూలు పట్టణం వైపుకు ప్రయాణించాలి ఆకనిపించే పట్టణం పాణ్యం. చక్కని పూల పండ్ల తోటలకు,మొక్కలకు అంటుకట్టే కేంద్రముగా ప్రసిద్ధిగాంచింది

కొంచెం దూరంలో కనిపించేది సిమెంటునగర్! అది సిమెంటు కర్మాగారం

కృ క్రమతెలియకుండా ఎన్నోవివరాలు తెలియజెప్పావమ్మా! తరువాయి మన పయనం .

తుం శ్రీశైలం వైపుకు నాయనా! ప్రశాంత గంభీరమైన మల్లికార్జున సన్నిధికి

కృ ప్రశాంతత అంటే గుర్తుకు వచ్చింది తల్లీ శాంతి భద్రతల వ్యవస్థ ఎలాఉంది ఈ జిల్లాలో?

తుం మురాతత్వాన్ని అణచివేయడానికి ఒక ప్రత్యేక విభాగం ఉంది సమాచారం సేకరించడం- అవసరమైతే దాడులు నిర్వహించి మురాల మధ్య గొడవలు తొలిగి పోయేటట్లు ప్రయత్నిస్తారు ఈ శాంతి భద్రతల విభాగంలో ఎన్నో ఉపవిభాగాలు- గూఢచారి వ్యవస్థ, రక్షణవ్యవస్థ, రహస్య విచారణా విభాగం, ఇలా ఎన్నో ప్రస్తుతం మద్యనిషేధం అమలులో ఉంది కూడా

కృ అలాగా తల్లీ

తుం 75 శాతం ఖచ్చితంగా అమలులో ఉంది అందుకోసం ఒక ప్రత్యేక విభాగం పని చేస్తోంది

కృ మనమేదో పట్టణం దరిదాపులకు వచ్చినట్టున్నాం తల్లీ!

తుం అవును నాయనా! అది నందికొట్కూరు వరిపంట బాగాపండే ప్రదేశం ఆకనిపించే ప్రదేశం, రోళ్ళపాడు అంతరించి పోతున్న బట్టమేక పక్షులకు అక్కడ ఒక రక్షణ కేంద్రాన్ని ఏర్పాటు చేశారు ప్రపంచంలో మరెక్కడా కనిపించని పక్షులివి ఈవైపు కొంచెం దూరంగా కనిపించే ప్రవాహం- కృష్ణానది ప్రవాహం- కొంచెం దూరంలో నా ప్రవాహం కృష్ణవేణి ప్రవాహంతో కలవడం కనిపిస్తున్నది కదా! ఆ ప్రాంతంలో సంగమేశ్వరక్షేత్రం ఒకప్పుడు ఉండేది శ్రీశైలం జలవిద్యుత్ కేంద్రం కట్టడం ప్రారంభించిన తర్వాత కృష్ణవమ్మ నీటి మట్టం పెరిగి గ్రామాలలోకి నీరు ప్రవేశించింది. అందువల్ల ఆప్రాంతమంతా-సంగమేశ్వరక్షేత్రంతో సహ నీటిలో మునిగి పోయింది ఆక్షేత్రాన్ని ఒక్కొక్కరాతిగా విడదీసి మళ్ళీ అలాగే అలంపూరు క్షేత్రంలో పునః నిర్మించారు ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం వల్ల ఇది సాధ్యపడింది కొంచెం దూరంగా కృష్ణమ్మ అవలి వైపుకు దృష్టిసారిస్తే కనపడేదే సంగమేశ్వర ఆలయం దగ్గరగా కనిపించేదే అలంపూర్ జోగులాంబా-బాలబ్రహ్మేశ్వర స్వామి ఆలయం

కృ మరి ప్రజలందరినీ ఏం చేశారమ్మా?

తుం సురక్షిత ప్రాంతాలకు తరలి వెళ్ళమని నచ్చజెప్పారు. వెలలేని తమ త్యాగానికి సర్దుబాటుధోరణిలో ప్రజలందరికీ నష్టపరిహారాన్ని కూడా చెల్లించడం జరిగింది స్వయంగా భారత ప్రధాని, లోక్‌సభ స్పీకరు, భారత ప్రధాన న్యాయమూర్తి ఆ నష్టపరిహారాలను చెల్లించే కార్యక్రమాన్ని ప్రారంభించారు. లోక్ అదాలత్ పేరిట ఆ కార్యక్రమాన్ని నిర్వహించారు దాదాపు 40 వేల కుటుంబాలకు అవిధంగా న్యాయం చేకూర్చారు

కృ సమర్థవంతమైన న్యాయవ్యవస్థ లేకపోతే ఇదంతా సాధ్యపడి ఉండేది కాదు కదమ్మా?

తుం అవును నాయనా! జిల్లా జడ్జి జటప్రోలు దాశరథి కృషి లేకపోతే ఏమి సాధ్యపడేది కాదు ఆయన సారథ్యంలో అంతా నిర్విఘ్నంగా సాగింది ఇక అవైపు ఆకనబడే పట్టణం ఆత్మకూరు దట్టమైన నల్లమల అడవులు వ్యాపించి ఉన్నాయి ఈ అడవుల్లో దేశంలో కెల్లా పెద్దదైన పులుల అభయారణ్యాన్ని నెలకొల్పారు ఈ అడవులలో టేకు, ఎఱ్ఱచందనము, తదితర కలప బాగాలభిస్తుంది ఈ అడవులను ప్రత్యేకంగా కాపాడడానికి అటవీవిభాగం ఉంది వీరు అడవులలోని కలపను, ఇతర అటవీసంపదను సంఘవిద్రోహులు కొల్లగొట్టకుండా పరిరక్షిస్తూంటారు

కృ. మరి జిల్లాలోని స్వయం ఉపాధి కల్పనా కార్యక్రమాల గురించి

తుం జిల్లా పరిశ్రమల కేంద్రం ఇందుకోసం పనిచేస్తుంది గ్రామోదయ పథకం కొన్నినాళ్ళు అమలులో ఉండేది. ప్రస్తుతం ప్రధానమంత్రి రోజ్‌గార్ యోజన పథకం అమలులో ఉంది

ఇక ఆకనబడే శిఖరం శ్రీశైల క్షేత్రశిఖరం దర్శన మాత్రం చేత సమస్త పాపాలూ నశింపచేసే శిఖరమిది ఆ గోపురాన్ని గుర్తించావా? అది నీవు నిర్మింప జేసినదే!

కృ గుర్తించానమ్మా! శ్రీశైల శిఖరం దృష్ట్వాపునర్జన్మ నవిద్యతే!

శ్రీగిరివిహారుడు అమర సంసేవితుండు
భక్తమానస కాసార పరమహంస
అరయ భ్రమరాంబికా హృదయాబ్జ
భృంగమైన మల్లికార్జున దేవునభినుతింతు

నా కోసం నీ వింతవరకూ తీసికొన్న శ్రమకు ధన్యవాదాలు తల్లీ! నేనిక్కడ కొంచెం సేపు విశ్రమించి తర్వాత వెళతాను

తుం మంచిది నాయనా! అదిగో మల్లికార్జునుడు దర్శనమిస్తున్నాడు ధన్యోస్మి! నేనూ నా సోదరి కృష్ణవేణిని కలిసి వెళతాను శలవు!

(ఆకాశవాణి, కర్నూలు కేంద్రం సౌజన్యంతో)

---

(53వ పేజీ తరువాయి–కె సి.హెచ్. సుబ్బరాయుడు)

లేకపోతే సమాజం లేదు జాతిలేదు సంస్కృతి లేదు కావ్యాలు లేవు అందరు శివ, రామ, కృష్ణులు కాలేరు ఆదిశంకర విద్యారణ్యులు లేరు అసలు ప్రత్యేక వ్యక్తిత్వం లేదు రామాయాణంలో శ్రీరాముడు, భారతంలో శ్రీకృష్ణుడు, ఈ కావ్యంలో కమడు చెప్పిందిదే! ఈ కావ్యానికి ''స్వాగతం'' పలుకుదాం

సీ॥ ఏ దేశ మృత్తిక ఈ దేహమేర్పడ
భూమిక యయ్యెను పుణ్యభూమి
ఏ దేశ పవనమ్ము లింత కాలము పీల్చి
బ్రతికితి నంతటి భవ్యభూమి
ఏ దేశ జలముచే ఇవతలించెనొ మేను
ఆ గంగ నందించు అమృత భూమి
ఏ దేశ వహ్ని యనిష్ట గుణాలెల్ల
దహియించి రహించె ధర్మభూమి
కట్టి జన్మభూమి కాపద వాటిల్ల
వార్త విన్న దేశ భక్తుడెవడు
పూనుకొనునొ యాత్మ పూర్ణాహుతికినైన
వాని జన్మ ధన్యమౌను నిజము

(తరువాయి 65వ పేజీలో)

# DESILT TUNGABHADRA PROJECT and BALANCE THE ECOLOGY

-K. Chandrasekhara Kalkura
Ex. Chairman, District Library Authority, Kurnool

According to Mythology Pushkara is described in various forms and interpretation of Pushkaram has been manyfold, Pushkara is none other than the Raingod, (Varuna), Pushkara is a great Yogi, Pushkara is the name of a great mythological stream However, the widely believed theory is that the Great Saints of the ages of the Vedas and the Puranaas urged Varuna, the Raingod to make His abode in the twelve perennial rivers of India by rotation, so that the people of this country can take holy bath every year Varuna conceded partially and restricted the period to twlelve days Thus he enters the rivers Ganga, Narmada, Saraswathi, Yamuna, Godavari, Krishna , Kaveri, Bhimarathi, Pushkara, Sindhu, Pranitha and Thungabhadra When there is a particular combination of the stars and the Constellations (Rashi), there is Pushkaram by rotation in all the twelve rivers for twelve days in the year Pushkaram occurs when Brihaspathi enters the particular constellation (Rashi) Accordingly when the Brihaspathi enters Makara Rasi there is Pushkaram in Thungabhadra

The Raghavendra Swamy Mutt at Manthralayam in Kurnool Dist,in Kurnool city and in Alampur in Mahaboobnagar Dist observed The Purskaram from 26th Dec 1996 to 6th Jan 1997

The significance of this particular Puskaram is that this is the last Pushkaram of this country in S India Usually Puskaram is observed only in A P in S India and few years back Kaveri Puskaram was observed in Tamil Nadu Offerings of special Poojas, donations, gifts, performing Sradhdha Karma and Yagnas, holy dip in the river ans such other good deeds during the Pushkarams is believed to shower 'Punyam' manyfold than when it is done elsewhere on other times

This is the very right time to make some soul searching on the state of affairs of the Holy Thungabhadra Celeberated Telugu Poet and one among the wellknown Astadiggajas of the Court of the Poet Emperor Sree Krishnadevaraya of the mighty Vijayanagara empire, Tenali Ramakrishna in his Magnum Opus, PANDURANGA MAHATHMYAM said in praise of the Thungabadhra, "If only the Lord of the water (Sea) were to have the pleasure of the touch of the limbs and parts of the good natured flow and the stream of the river Thungabhadra, would he have accepted the Ganga? Would he have embraced the Kaveri? Would he have sought the company of Yamuna? (Not a literal translation only a notional adoption) The poet explains the majesty of the Thungabhadara and does poetic justice to the nonfulfilment of the life's ambition of a river, i e mingling with the sea Age old adage is very popular all over India 'Ganga Snanam

and Thunga Panam ' ('Dip in the Ganga and Sip the Thunga')

Two separate rivers, the Thunga and the Bhadra originate near Sringeri in Varaha Parvatha, in Malnadu, in Western Ghats, Chikkamagalur Dist, Karnataka They traverse in Shimoga and Chikkamagalur Dist and join at Kudligi about 12 K M from Shimoga and the Thungabhadra passes through the Dists of Chitradurga, Dharwad and Bellary in Karnataka and Kurnool and Mahaboobnagar Dists A P before mingling with the Krishna at Sangameswara in Kurnool Dist Hagari and Chikka hagari in Bellary Dist and Handri in Kurnool Dist are the principal tributaries of the Thungabhadra Though the length of the river is less than 500 k ms it is the life line of the arid region in S Karnataka and the Rayalaseema and a seat of many an important place and many industreis are established on its bank, particularly mineral based It hosted the seat of the mighty Vijayanagara Empire, the pride of the Middle Ages and also some holy places of national fame are located on its bank.

Established by the Adi Shankaracharya, on the banks of the Thunga, Sringeri is one of the Dharma Peethams, founded by him Of Shankaracharya and the Peetams Pandit Nehru said in Glimpses of World History "He seems to have been a person of amazing genius Another fact which Shankara's brief but strenuous life brings out is the cultural unity of India Shankara's choice of the four centres all over India

It is widely believed that when Shankara visited Sringeri, a King Cobra with its raised hood was sheltering a pregnant frog, screaming with labour pain in the sun, on the bank of the Thunga and that moving scene inspired Shankara to have his most famous Math and the Sharada Peetham was thus established

Harihareswara Temple at Harihara, a confluence of Dwaitha and advaitha philosophies is a welknown pilgrimage centre Manthralayam in Kurnool dist has been visited by thousands of devotees of all castes, creed, religions and all regions of the country It is the firm belief that Guru Raghavendra swamy, in His eternal sleep blesses his devotees in their dreams and shower success on them and offers boons to them The Early Chalukyas built several temples at Alampur Though they are small in size, that is the beginning of the temple Architecture in India Till then there used to be cave temples Temples those were built at the confluences of Thungabhadra and the Krishna were to be submerged in the back waters of the Sreesailam Project Many of them were dismantled and some of them are being transplanted at Kurnool and around One of them is already replanted at Alampur

Many kingdoms like the Nayakas, Chalukyas, Rastrakutas either ruled from the banks of the Thungabhadra or had their sway over the region The most outstanding among them was the Vijayanagar Empire in Hampi, near Hospet The Portuguese traveller, Paes, who visited Vijayanagar in 1522, was perhaps a product of the Renaissance Movement in Europe Apparently he has

the intimate knowledge of Italian cities He writes in his diary, "Vijayanagara is as large as Rome and beautiful to the sight It is the best provided city in the world . for the state of the city is not like that of other cities, which often fail of supplies and provisions, for in this everything abounds He (Sree Krishnadevaraya) is the most feared and perfect king that could possibly be, cheerful of disposition and very merry, he is one that seeks to humour foreigners, and recieves them kindly, asking about all their affairs whatever their condition may be"

Thunga Dam in Gajanoor near Shimoga, the Bhadra dam at Lakkavalli near Bhadravathi and the Thungabhadra Project near Hospet, as the names indicate, across the respective rivers are the major irrigation projects across the Thungabhadra. While the Thunga and the Bhadra Reservoirs are exclusively for the benefit of the farmers in Karnataka, the Thungabhadra Project was started as joint venture of the then Nizam State and the erstwhile composite state of Madras Now Thungabhadra Board, a statutory body constituted under an Act of Parliament manage the project Its capacity is to store 210 tmcft of water and was intended to irrigate about six lakhs of acres of land in Karnataka and Andhra Pradesh through various channels

However on account of silting the storage and consequently the irrigating capacity of the dam has been reduced by about 30% As a result the tail end farmers are suffering a lot It is also possible at the same rate siltation within another 10-15 years the capacity will be reduced to less then 50% It is also said that Thungabhadra is the fastest silting dam in the country Desilting is ruled out in official circles, as the cost is supposed to be enormous Reliable sources say that the silt consists of mineral wealth and some Japanese agencies have come forward to desilt and carry away the silt, as it contains rich mineral wealth If that is really so, why it should be objected? Mineral resources from the mighty Khuduremukh Iron Ore Project in Chikkamagalur Dist, and Donimalai and Sandoor mines primarily cause the silting If it is not mineral wealth it must be natural manure Possibility of starting fertiliser factory, by making use of this silt as the primary raw material should also be explored as otherwise the consequences will be disastrous and perilous The desilted material can be transported to the nearby fallow barren land which are rocky and pebble infested and such land can be converted into a fertile agricultural land Likewise the industrial effluents can be converted into many beneficial purposes

Large number of major and medium industries all along the course of the river bank contribute highly for the contamination and pollution of the sacred Thungabhadra The Visweswaryya Iron and Steel Limited, Paper Mills and Cement Factory at Bhadravathi, Sugar factories at shimoga and Bhadravathi, Harihara Polyfibres and Kirloskar at Harihara, I T C promoted solvent Oil factory at Thungabhadra near Manthralayam, Rayalaseema Paper Mills,

Rayalaseema Alkalies and the Hitachi at Kurnool are worth noting Taking advantage of the backwardness of the Raichur Dist Industrial House like the Kirloskars are setting up their units in Koppal and the gigantic Vijayanagar Plant, originally scheduled to be commissioned as a Public Sector Undertaking (P S U ) is now entrusted to Mukund and Jindal and the work is progress in between Hospet and Bellary Those units make use of the rich mineral deposits located in and around the area and their establishment contribute both for degradation of environment and pollution Coupled with the existing units these industrial effluents will cause harm, which may be difficult to mitigate, once they are set up Therefore fool proof effluent treatment plants in all these industries must be made obligatory before starting commercial production

Leaving aside conservation and fanaticism and adopting orthodoxy and catholicism, the technocracy should come forward with concrete proposals to recycle the industrial wastes and the silt for beneficial pupose usefully As suggested earlier, conversion of silt into manure is a very sound proposal Generating electricity and L P G at least for self utilisation is another important method, by which the poison can be converted into gold As otherwise the danger is that the poisonous elements will reach even Chennai, through Telugu Ganga, as the Bellary-Hospet industrial belt is downstream of the Thungabhadra Dam and the next major dam in the course is the Sreesailam dam only

There is wholesale deforestation and degradation of environment in the Malnadu region where the Thungabhadra originates Attempts to exploit mining deposits at the Varaha Parvatha is being stoutly resisted by the people Sahyadri Hill Range in Chikkamagalur and Shimoga districts possesses very rich flora and fauna. Flush green forest consists of rare and unique botanical species and animals and reptiles like the Elephants and the King Cobra Bird sanctuary in Mandagadde near Shimoga attracts visitors Birds fly from even as far as Siberia and the tourists and Ornithologists from all over the country flock there to study as well as a treatment for the watching eyes There is decay in all these nature's bounty and possession owing to indiscriminate ecological exploitation There is widespread lift irrigation and growing nurseries and vegetables on the river bed not only along the course of the Thugabadra but even on the banks and beds of the innumerable streams and rivers and as a result feeder source has become dry and the perennial Thungabhdra is going dry during summer months.

Encroachment of the river bed for various purposes has caused the shrinkage of the river This has effected the flowing capacity of the river Ecological imbalance is causing erratic monsoon Malnadu region is not receiving adequate seasonal rains South West Monsoon is playing hide and seek causing unseasonal rains in other areas creating unexpected havocs Of course linking of the major rivers and creating a national water grid may be a long term and

workable solution to the problems the Thungabhadra is facing As the problems that facing are not peculiar to it and it shares the onslaught with as many sister rivers in the country

However as the course of the Thungabhadra is comparatively small, when compared to the other major rivers, an honest attempt can be initiated with the Thungabhadra for cleaning and development Another Advantage is that some of the major industries are just coming up and as such it will not be difficult for creating an inbuilt mechanism for eradicating and avoiding so many ills of the rapid industrialisation Afforestation in the catchment area on warfooting is a must Working out the cost/benefit/disposal/utilisation of desilting the dam across the river is not an insurmountable problem This is the time to think and act to retain the pristine glory of the Thungabadhra so eternally so that the Sea Lord for ever feel for his permanent loss, non-confluence of the Thungabhadra with him

---

(60వ పేజీ తరువాయి - కె సి హెచ్ సుబ్బరాయుడు)

ఇది కచుని భావనేకాదు ఇంద్రుడి భావన కూడా!

ఇంత వివేకశాలి గలడేయని యెవ్వడు కీర్తి తెచ్చునో
యంతటి పుత్రుగన్న పితృహర్షమనంతము నీదు తండ్రికిన్
సంతసమొప్ప గూర్చితివి! సార్థకమైనది నందనోక్తియున్
అంతటి వాడ వింక గనవయ్య స్వజాతికి గల్గునాపదల్!

ఇక బృహస్పతి ఇలా అంటాడు కచునితో,

తే॥గీ॥ వంశ రక్షకు తన్నైన వదలవలయు
గ్రామమ్మునకై కులమ్ము త్యాగమ్ము తగును
దేశమునకు గ్రామమ్మునే తివిరి విడువు
పరమ పదమునకై పృథ్వి వదలవలయు

కచుడు చదువుతున్నా, స్నాతకోత్సవంలో ప్రప్రథమ స్థానం వచ్చి కీర్తించబడినా, తండ్రితో చర్చించినా, సత్యవచనుడై శుక్రునిముందు నుంచున్నా, దేవయానికిష్టమైన పనులు చేసినా, అనిష్టమైన శాపమిచ్చినా ఏ సందర్భంలోనైన జాతి, దేశము, ధర్మము కచుని మనసు నిండిఉంటాయి దాని చుట్టే కథంతా మలచబడింది అందుకే దీన్ని ''జాతీయ కావ్యము'' అంటున్నాను

ఇది సందేశ కావ్యం! ఈ కావ్యం శీలానికి అత్యున్నత స్థానమ్మిచ్చి ఒక అధ్యాయాన్ని సంతరించింది ప్రహ్లాదుని నుండి రాజ్యలక్ష్మి, భాగ్యలక్ష్మి మొదలైనవారు వెళ్ళిపోయినా అతడు బాధపడలేదు కాని శీల లక్ష్మిని మాత్రం అతడు పోనివ్వలేదు శీల లక్ష్మి ఉండటం వలన మిగిలిన లక్ష్ములన్నీ తిరిగి వస్తాయి ప్రహ్లాదునికి

వ్యక్తిగత శీలంతో పాటు జాతీయ శీలం ఉండాలని, దేశమాతను సేవించి రక్షించాలని, ధర్మాన్ని అనుసరించాలనీ వీని కొఱకు ఎంతటి త్యాగమైన చేయవలెననీ సందేశమిచ్చే జాతీయ కావ్యం ''దేశంకోసం''

**జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ!**

రాయలసీమ రత్నం - ఆంధ్ర జాతి ఆణిముత్యం- స్వాతంత్ర్యపోరాట వజ్రం
-ఆంధ్ర తిలక్- ఆంధ్ర ఆదిశేషుడు' అను బిరుద నామాలు గల

# ఆంధ్ర విజ్ఞాన భాస్కరుడు 'శ్రీ గాడిచెర్ల హరిసర్వోత్తమరావు'

-జె. సీతారామ కృష్ణ శర్మ, తెలుగు పండితులు, ఓర్వకల్లు

శ్రీ గాడిచెర్ల హరిసర్వోత్తమ రావు గారి జీవితాన్ని ఒక వ్యాసరూపంలో ఉంచటమన్నది కుంజర యూధాన్ని దోమకుత్తుకలో ఉంచటమే ఔతుంది ఈ ప్రయత్నం అసాధ్యమైనది. ఆ మనీషి విశ్వస్వరూపాన్ని రేఖాచిత్రంగా వ్రాయటం గుదరదు అది బహుముఖీనమైన 1/2 శతాబ్దపు నిష్కామ నిర్విరామ నిష్కల్మష నీతియుత నిరాడంబర ప్రజాసేవ ఈ ఏబది ఏండ్ల ఆంధ్ర చరిత్రలో ఆయన లేని సాహిత్య, రాజకీయ, ఆర్థిక, నిర్మాణాత్మక, వైజ్ఞానిక, కళాత్మక, విద్యా, ఆరోగ్య, ప్రజాసంబంధ, యువజన, కార్మిక, కర్షక, విద్యార్థి ఉద్యమాలు, సభలు, సమావేశాలు లేవన్నది నిప్పువంటి నిజం .వారి 77 ఏండ్ల జీవితకాలంలో 1888 నుండి 1906 వరకు 24 సంవత్సరాలు విద్యాభ్యాసం- 1906 నుండి 1955 వరకు 50 సంవత్సరాలు రావుగారి జీవిత మొక సత్కార్య సత్సంగ స్రవంతీ సంగమం- ఎన్నెన్నో ఉద్యమ నదులా మహాసాగరంలో లీనమైనవి రావుగారి ప్రజా జీవితంలో ఎన్నో మహోద్యమములు ఉత్తుంగతరంగాలై ఉవ్వెత్తునలేచి ప్రజా ప్రయోజనాలను వర్షించాయి విద్యా విజ్ఞానాలను పంచాయి ఎన్నో సమస్యలకు పరిష్కారం చూపించాయి హరిసర్వోత్తమరావుగారన్ని ఉద్యమాలందు అంతర్యామికాదు అర్థ శతాబ్ది కాలం అతడు సర్వాంతర్యామి. అతడొక కవి, పండితుడు, బహుభాషాభిజ్ఞుడు విమర్శకుడు, రచయిత, పత్రికా సంపాదకుడు, వక్త, వేదాంతి, స్వతంత్ర పోరాట యోధుడు, రాజనీతిజ్ఞుడు, ధైర్యశాలి, నిస్వార్థ పరుడు, నిష్కామకర్మయోగి, నిరాడంబర భక్తుడు, మూఢాచార నిరసనము, మహిళాభ్యుదయము, హరిజనోద్ధరణ సల్పిన సంఘ సంస్కర్త, కులమతాల కతీతుడు, మంచి పార్లమెంటేరియన్, సమన్వయవాది, సంప్రదాయజ్ఞుడు, ప్రజాస్వామ్యవాది, ఉద్యమశీలి, ఉత్తమ విద్యావేత్త, శిక్షకుడు, కార్యకర్త కార్మిక ప్రేమికుడు, గ్రంథాలయ, వయోజన విద్యాది అనేక ఉద్యమాలకు యోజక పితామహుడు అతని సంపూర్ణ మూర్తిమత్వమునకు అక్షరరూపము కల్పించుటకు పదజాలము చాలదు భావజాలము చిన్నబోవును ఐనను అతని బహుముఖీన ప్రజా సేవలను సాహిత్యం, స్వతంత్రపోరాటం, శాసన సభాసభ్యత్వం, నిర్మాణాత్మక ఉద్యమాలు, ఆంధ్ర ఉద్యమం, కార్యక్రమాలు,దృక్పథం, తత్త్వం, మూర్తిమత్వం అన్న శీర్షికల క్రింద క్లుప్తీకరించ యత్నింతును

**సాహితీ ద్రష్ట – సర్వోత్తమరావు**

కర్నూలులో 1883 సెప్టెంబరు 14వ తేదిన శ్రీమతి భాగీరథీబాయి శ్రీయుతులు వేంకట్రావు దంపతులకు ఆంధ్రుల, భాగ్య ఫలంగా జన్మించారు శ్రీ గాడిచెర్ల హరిసర్వోత్తమరావు గారు. ప్రాథమిక విద్య కర్నూలు మునిసిపల్ స్కూల్లో నడచింది గుంతకల్లు లండన్ మిషన్ పాఠశాల ప్రధానోపాధ్యాయులు శ్రీ రఘునాథాచారిగారు పుస్తక పఠనంలో అభిరుచి కల్గించటం భవిష్యత్తులో గ్రంథాలయోద్యమ శిల్పిగారూపొందటానికి దోహదం చేసింది తెలుగు పండితులు శ్రీ గని శేషావధానులు కల్గించిన సాహిత్యభిరుచి రావుగారిని కవి, పండిత, విమర్శకులుగా వక్తలుగా పేరు పొందేటట్లు చేసింది. పూవు పుట్టగానే పరిమళించిదన్నట్లు నూనుగ మీసాల విద్యార్థి వయసులోనే పురప్రముఖులను పిలిచి సాహిత్య సభలు నిర్వహించే వారు శ్రీ రావుగారు.

మద్రాసు క్రిష్టియన్ కళాశాలలో 1901 నుండి 1906 వరకు చదివి ఆంధ్రులలో స్నాతకోత్తర పదవీధరులలో రెండవవాడుగ నిలిచాడు యం.ఎ లో తెలుగు,కన్నడం, తులనాత్మక భాషాశాస్త్రం వారి అభిమాన

విషయాలు శ్రీకృష్ణదేవరాయలన్న రావుగారి హృదయం రసపరవశమౌతుంది గురువులు వేదంవారి అభిప్రాయాలకు వ్యతిరేకంగా ఆముక్తమాల్యద శ్రీకృష్ణదేవరాయ కృతమని సిద్ధాంత వ్యాసము రచించిన ధీనిధి అందులకే దత్తమండలములు అన్నమాటను తీసివేయించి, రాయల సీమ అనుపదము వాడుకలోనికి తెచ్చిన కృష్ణదేవరాయాభిమాని అట్లే గురువుగారు యం ఎ పరీక్షలో అనువాదము కొరకిచ్చిన సంగీతశాస్త్రీయ అంశము సీసపద్యములలో ఆశువుగా సమాధానించిన కవి కిశోరము

తల్లిదండ్రి ఋణమును తీర్చికొనుటకు క్రమముగ శ్రీరామ చరిత్రమును, ప్రచ్ఛన్న పాండవమును, శ్రీ గనిశేషాచార్యుల వారికి గురుదక్షిణగ విస్మృత కవి చక్రవర్తి అన్న రాయల చరితమును అంకితము చేసి, ఋషి ఋణమును గ్రంధాలయోద్యమము ద్వారా, దేశమాత ఋణమును స్వతంత్ర పోరాటము ద్వారా తీర్చికొన్న సంప్రదాయజ్ఞుడు.

వందేమాతరం స్ఫూర్తితో 1906లో అనగా విద్యార్థి దశలోనే కొమర్రాజు, కాళేశ్వరరావులతో పాటు విజ్ఞాన చంద్రికా మండలి పేరుతో తెలుగులో మొదటి ప్రచురణ సంస్థను స్థాపించి దేశభక్తిని రగుల్పొల్పు గ్రంధములు రచించి ప్రబోధించెను కట్టమంచి 'సీనియర్' అని సగౌరవముగ పిలువవలసినంత సాహితీ ఖని అబ్రహం లింకన్ చరితమును అనువదించెను (మొదటి ప్రచురణ) మల్లంపల్లి, చిలుకూరు, గోటేటి,వేమాని వంటి ప్రముఖుల గ్రంధములు ప్రచురింపబడెను గురువులు వేదంవారి పేరుతో తరువాత ఒక ప్రచురణ సంస్థ నెలకొల్పెను ఈ సంస్థపక్షాన ప్రకటించిన విజ్ఞాన సర్వస్వములో రావుగారి కృషి అద్యము, అనవద్యము. 'అచ్చు-యంత్ర' మనువారి వ్యాసము తజ్ఞాలకాలోచనామృతము వారు గాంధేయులు గాంధీజీ రచించిన (1)నీతిధర్మము (2) మూర్ఖరాజు (3) జాతీయ మానవతా వాదము (4) హిందూ స్వారాజ్యము అను గ్రంధములను అనువదించెను వోట్ అను గ్రంధము, ప్రిజర్వేషన్ ఆఫ్ వైల్డ్‌లైఫ్- మహనంది, ప్రపంచ చరిత్ర, సభలూ సమావేశాలు ముద్రితాలు వారి అనేక అముద్రిత గ్రంధాలు, వ్యాసాలు, ఉపన్యాసములు, నోట్సులు వైవిధ్యం కలవి అమూల్యమైనవి వ్యవహారిక భాషను నవ్యకవిత్వాన్ని విశాల దృక్పథంతో ఆదరించారు రావుగారు క్రొత్తగా వచ్చే కవిత్వానికి భావ కవిత్వం అని నామకరణం చేశారు అదే తరువాత స్థిరపడింది అలానే **EDITOR** అనే ఇంగ్లీష్ మాటకు 'సంపాదకు' డన్న పదాన్ని మొదట వాడింది శ్రీ హరిగారే.

### స్వాతంత్ర్య పోరాట అగ్రణి – సర్వోత్తమరావు

1907లో యం.ఎ. తర్వాత ఉపాధ్యాయ శిక్షణకోసం రాజమండ్రి కెళ్ళారు. 90 మందితో వయోజన శిక్షణ ప్రారంభించారు. వందేమాతరం బ్యాడ్జితో కళాశాలకు వచ్చిన విద్యార్థులతో ఘర్షణకు దిగిన ప్రిన్సిపాల్ హంటర్ ను విద్యార్థుల నుండి రక్షించారు కాని దీనికంతా కారణంవారేనని రావుగారిని 'డీబార్' చేసి ఉద్యోగానర్హునిగా ప్రకటించింది ప్రభుత్వం 30 సంవత్సరాల తర్వాత రాజాజీ ప్రభుత్వం ఈ ఉత్తర్వును రద్దుచేశారు కాకినాడకు ఈ ఉద్యమం ప్రాకింది కెంపు అనే డాక్టర్ విద్యార్థులను కొరడాతో కొట్టారు. విద్యార్థులు కోర్టుకువెళ్ళి కెంపు కే జరిమానా విధింపచేశారు ప్రభుత్వ కళాశాలలు మూతబడ్డాయి ఆంధ్రలో వందేమాతరం విద్యార్థి ఉద్యమమయింది రావునేతృత్వంలో 1908లో తిలక్ 'కేసరి, మరాఠా' లు, కృష్ణా పత్రిక, అరవింద ఘోష్ 'యుగాంతర్' లతో పాటు శ్రీ రావు గారు 'స్వరాజ్య' పత్రిక స్థాపించారు తిరునల్వేలి ఆష్‌హత్య సందర్భంగా చెలరేగిన విప్లవం- కాల్పులకు నిరసనగా ' అరరే! ఫిరంగీ ! క్రూర వ్యాఘ్రమా' అంటూ తీవ్ర నిరసన తెల్పుతూ ఉత్తరం వ్రాయుటం వలన ప్రభుత్వం రాజద్రోహ నేరం మోపి కేసు పెట్టారు. కెర్షాస్పు అనే

పార్శీజడ్జి రావు గారి దేశభక్తికి ఉప్పొంగి పోయి రావుగార్కి 6నెలలే శిక్షవేశారు ప్రభుత్వం 'కేర్తాన్స్' రాజీనామాచేసి వెళ్ళేలా చేసి రావు గార్కి అప్పీలులో 3 సంవత్సరాల కఠిన కారాగార శిక్ష వేసింది

తిలక్‌ను అరెస్టు చేసిన రోజునే రావు గారిని అరెస్టు చేశారు. అభిమానులంతా అందుకనే 'ఆంధ్ర తిలక్' అన్నారు. తొలి ఆంధ్రా రాజకీయ ఖైది శ్రీ గాడిచెర్ల హరి సర్వోత్తమరావు గారు అనుభవించిన శిక్ష గూర్చి తెలుసుకోవటం అవసరం దర్శిసెంచయ్య గారిలా వ్రాశారు.

బట్టలూడదీసి మొలతాడు కోసి జందెం తీసివేశారు 2 చిన్ని గోచీలు ఇచ్చారు ఈత చాప మట్టి మూకుడు అన్నంతినటానికి ముంతనీళ్ళు తాగటానికి మలమూత్ర విసర్జనకొక చిన్న చట్టి కాలికి మెడకు చేర్చి ఇనుపగొలుసు-రాగి సంకటి ముద్ద, పురుగులతో కూడిన ఆకుకూర పులుసు 3 నెల్లకో ఉత్తరం ప్రత్యుత్తరం అపుడు పత్రిక సంపాదకుడుగా ఇలా 1200 రోజులు శిక్ష అనుభవించారు 14 సం భార్య గర్భవతి ఆ సందర్భంలో తనకు సహకరించిన బందిపోటు దొంగ సహకారాగార వాసియైన 'ఎఱుకల సుంకడి' ని తన రచనల్లో మనస్సులో నిలుపుకొన్న రావుగారి మనసెంతో నవనీతం కృతజ్ఞతాపూతం

తొలిపత్రికా సంపాదకునిగా ఇలాంటి శిక్ష అనుభవించినా జీవితాంతం ఆయన ఎన్నో పత్రికలు స్థాపించాడు సంపాదకత్వం వహించాడు, నష్ట పోయాడు 2 ఆంధ్ర కేసరి 3 నవయుగం 4 ఆంధ్ర పత్రిక 5 ది నేషనలిస్ట్‌లో వ్రాసి డిపాజిట్ నష్టపోయాడు 6 సౌందర్యవల్లి మొదటి మహిళా పత్రిక 7 మాతృసేవ (హరిజన సేవ) 8. కౌమోదకీ నంద్యాల 9 గ్రంథాలయ సర్వస్వం 10 సహకారం 11 గ్రామ పంచాయతీ జర్నల్ 12 అడల్ట్ ఎడుకేషన్-కోయిలకుంట్ల 13 పంచాయతీ రాజ్యం 14 ఆంధ్ర వార్త మొ ఇవన్ని రావుగారి విజ్ఞాన సర్వస్వానికి దర్పణాలు రాజద్రోహ శిక్ష తర్వాత ఆయన రచనల్లో ఆయన పేరు వేయటానికి, పత్రికల్లో వేసుకోవటానికి కళాశాలల అధ్యాపకత్వం ఇవ్వటానికి మిత్రులే భయపడ్డారు ఆయనకు ఆస్తి పాస్తులు లేవు ఈయన శిక్షవల్ల మామగారి పెన్షన్ పోయింది ఆర్థికంగా ఆత్మాభిమానంతో ఎన్నో బాధలు పడ్డదాకుటుంబం 1974లో అనిబిసెంట్ కాంగ్రెస్ అధ్యక్షురాలైంది హోంరూల్ లీగ్ ఏర్పడింది రాష్ట్ర శాఖాకు గాడిచెర్ల వారు ప్రధాన కార్యదర్శి

1913లో ప్రథమ ఆంధ్ర సభ ఏర్పడింది అది భాషా ప్రయుక్త రాష్ట్రాలకు బీజం అయింది 1917లో తిలక్ ప్రమేయంతో కాంగ్రెస్ ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్‌ను ఆమోదించింది ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ మహాసభకు రావుగారు కార్యదర్శి

1919లో గాంధీజీ రౌలట్ చట్టానికి వ్యతిరేకంగా గళమెత్తారు రావుగారు ది నేషనలిస్ట్ పత్రికలో వ్యాసం వ్రాయగా ప్రభుత్వం డిపాజిట్టును లాక్కొని పత్రికను మూయించింది

1920లో గాంధీజీ సహాయ నిరాకరణ ఉద్యమం ఆమోదం పొందింది. గాంధీజీ నాయకత్వం స్థిరపడింది దక్షిణ ఇండియా సత్యాగ్రహ సంఘ కార్యదర్శిగా రావుగారు నియమింపబడ్డారు

గాంధీజీ ఒక సందర్భంలో కోర్టు బహిష్కారం నుండి వాదులను మినహాయించాలని తీర్మానం ప్రవేశపెట్టారు. న్యాయవాదులు మాత్రం కోర్టులను బహిష్కరించాలి అన్నారు 250 మంది వున్న సభలో అందరు ముఖాలు చూసుకొంటు వుంటే రావుగారు లేచి అది పొరపాటు నిర్ణయం అని చెప్పారు నిర్భయంగా గాంధీజీ తీర్మానాన్ని ఉపసంహరించుకొన్నారు యంగ్ ఇండియా పత్రికలో రావుగారిని గురించి 'ధైర్యశాలి శ్రీ

హరిసర్వోత్తరావు' అని మెచ్చుకుంటు వ్రాసారు

1922లో గాంధీజీ, రాజాజీలు శాసన సభా ప్రవేశం వద్దంటే చిత్తరంజన దాసు, మోతీలాల్ మొదలగు వారు శాసనసభా ప్రవేశం అవసరమని స్వరాజ్యపార్టీ ఏర్పాటు చేసుకున్నారు. రావుగారు స్వరాజ్య పక్షంలో చేరి 1924 నవంబరు 28వ తేది నుండి రాష్ట్ర నాయకులు అయ్యారు.

నాయకంటి శంకర రెడ్డి గారిని పార్టీ కర్నూలు శాసన సభ్యునిగా నిలుపగా వారు జనవాక్యం 'మీ వైపు' వున్నదని శ్రీ రావుగారికే అభ్యర్థిత్వం వదలి వేశారు జస్టిస్ పార్టీవారు రావుగారికి విరుద్ధంగా శ్రీ కంభం శరభారెడ్డి గారిని నిలిపారు శరభారెడ్డి గారు రావు గారి మిత్రులే. అందువలన తమ ప్రచారంలో రావు గారి గొప్పతనం చెప్పి కాంగ్రెస్ వారు కాబట్టి ఓటు వేయవద్దని మాత్రమే చెప్పారు. ఈ విధంగా సర్వుల గౌరవాభిమానాలను పొందిన వారు సర్వోత్తరావు గారు 1927 జనవరి 10వ తేదిన శ్రీ రావుగారు అత్యధిక మెజార్టీతో కర్నూలు శాసనసభా సభ్యులయ్యారు అలానే 1926లో ఆంధ్ర యూనివర్సిటీ స్థాపకులు అనే అర్హతతో ఆంధ్ర విశ్వవిద్యాలయం సెనేట్ సభ్యులయ్యారు

ఆదర్శ శాసన సభ్యుడు – సర్వోత్తమరావు

59 రోజులు శాసనసభ జరిగితే 55 రోజులు సభకు హాజరైనారు. 304 ప్రశ్నలు అడిగారు అన్ని చర్చల్లో పాల్గొన్నారు వాయిదా తీర్మానాలు ప్రతిపాదించి ప్రజల కష్టాలు ప్రభుత్వం దృష్టికి తెచ్చారు. వారు శాసనసభా సభ్యునిగా చేసిన కృషి అనన్య సామాన్యం అందులో కొన్ని.

1 తుంగభద్ర రైతులపై పెనాల్టీల రద్దు 2 కె సి. కెనాల్ ఆయకట్టు విస్తరణ 3 కాలువ పెడల్పు చెరువుల మరమ్మత్తు, ఫారెస్టు చట్టాల్లో లోపాలు సవరింపజేసారు 4 అణచబడిన జాతులకు భూము లిప్పించారు 5 రైతులకు రుణాలిప్పించారు 6. కలరా వ్యాధి నిరోధక కృషి 7. శ్రీశైలమునకు మొట్టమొదటి సారి రోడ్డు వేయించుట 8 అహోబిలం నంద్యాలకు నీటి సరఫరా 9 గ్రామోద్యోగుల, యన్ జి ఓ., ల గవర్నమెంటు ప్రెస్ వర్కర్ల జీతాల పెంపు 10. హరిజన మంచినీటి వసతి 11 ప్రెస్ వర్కర్స్ యూనియన్ స్థాపన 12 మహానంది ఆయుర్వేద కళాశాల స్థాపన. 13 కల్లు సారాయి దుకాణాలు మూయించుట 14 చేతి పరిశ్రమల స్థాపన

1928లో ఆంధ్ర కేసరి 'రండిరా కాల్చుకొండిరా', 'సైమన్ గో బ్యాక్' అన్నారు 1929లో జవహర్ సంపూర్ణ స్వరాజ్యం కోరాడు 1930లో ఉప్పుసత్యాగ్రహం శాసనోల్లంఘనం. శాసనసభా పదవులకు రాజీనామా ఇవ్వాలన్నారు గాంధీజీ పదవులుంటేనే తెల్లవారిని బాగా ఎదుర్కోవచ్చు అన్నారు చిత్తరంజన్, మోతీలాల్ రావుగారు తిలక్ అనుయాయి, తరువాత దాసు వచ్చాడు కాబట్టి రాజీనామా ఇవ్వలేదు కాని 1930లో గాంధీజీని అరెస్టు చేయగానే రాజీనామా సమర్పించారు. ఆయనకు పదవి కాదు పద్ధతి ముఖ్యం

1930–35 సంవత్సరాల్లో శ్రీ రావు గారు కాంగ్రెస్ కార్యక్రమాన్ని తు–చ తప్పకుండా పాటించారు పత్తికొండ–''ఇంద్రావతి'', నంద్యాల ''కౌమోదకి'' పత్రికలు ఈ విషయాన్ని ధ్రువపరుస్తాయి ''గాంధీజీ జైత్ర యాత్ర'' –అనే గేయం వ్రాసి ప్రచారం చేశారు సత్యాగ్రహులను తయారు చేశారు, శిక్షణ ఇచ్చారు, పికెటింగ్‌లు చేయించారు గుంటూరు కలెక్టర్ గాంధీ టోపి పెట్టుకోరాదు అని చెప్పారు విద్యార్థులంతా గాంధీ టోపి పెట్టుకున్నారు రావుగారు దీన్ని సమర్థిస్తూ డిల్లీకి ఇంగ్లండుకు ఉత్తరాలు వ్రాసారు ఇంగ్లండు పార్లమెంటులో

ఈ విషయం చర్చించబడింది పార్లమెంట్ సభ్యుడు ఫెన్నర్‌బ్రాక్ వే కలెక్టర్ చర్య తప్పని వాదించి తాను కూడా గాంధీ టోపి పెట్టుకున్నారు ఇలా తెల్లవారిలో కూడా కొందరు మనలను సమర్థించేలా చేయగలిగారు రావుగారు

1932లో గాంధీ గారి ధ్యేయాలైన ఖద్దరు ప్రచారం, మద్యపాన నిషేధం పై సభలు జరిపి ప్రచారం చేశారు హిందూ మహమ్మదీయ సఖ్యతకు కృషి చేశారు 1933లో నెహ్రూ అరెస్టుకు విరుద్ధంగా సభ జరిపి త్రివర్ణ పతాకం పట్టుకొని ఊరేగింపులో పాల్గొన్నారు 1935లో కాంగ్రెస్ సత్యాగ్రహం విఫలమైంది స్వరాజ్య పార్టీ పునరుద్ధరణ జరిగింది రావుగారు అహ్వాన సంఘ అధ్యక్షులు కార్మికులను ఆకర్షించాలని కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ ఏర్పడింది ఈ క్లిష్ట పరిస్థితిలో రావుగారు నిర్మాణ కార్య కలాపాలపై దృష్టి మరల్చారు

<u>ఆంధ్రోద్యమ నాయకత్వం</u>

1921లోనే కేల్కర్ కమిటీలో రావుగారు సభ్యులై ఒరిస్సా, మద్రాసు, మైసూర్ రాష్ట్రాలలోని తెలుగు ప్రాంతాలు ఆంధ్రలో చేరాలని వాదించారు. 1937లో ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర తీర్మానం విషయంలో రావుగారి కృషి వుంది శ్రీ బాగ్ వడంబడిక జరిగింది మాతృ భాషలో వ్యవహారం అవసరమని రావుగారు గట్టిగా వాదించారు రాష్ట్రేతర ఆంధ్ర సంఘాల స్థాపన, వారి సౌకర్యములు కలిగించుట, ఆంధ్రవాణి బలము పెంచుటలో రావుగారి కృషి అనల్పము 1941-42లో గాంధీ గారికి సత్యాగ్రహం చేయగలను అని సూచించారు కాని గాంధీజీ "ముందు ఇంటి సమస్యలు పరిష్కరించుకోమని" వ్రాసారు

1947లో స్వాతంత్ర్యం వచ్చింది భాషా ప్రయుక్త రాష్ట్రముల ఏర్పాటును రాజ్యాంగములో ఇముడ్చాలని పోరాడారు ఆంధ్ర రాష్ట్రాన్ని రాజ్యాంగ షెడ్యూల్లులో చేర్చాలని ప్రయత్నించారు. థార్ కమిషన్ అన్యాయం చేసింది కాని సరిహద్దుల విషయం తర్వాత సవరించకోవచ్చు అన్నది. రావుగారు వెంటనే సరిహద్దు సంఘాలను ఏర్పరచుకొని 1949లో ఢిల్లీకి రాయబారం వెళ్ళారు. నెహ్రూను , పటేల్‌ను కలిసి సమన్వయం చేశారు రాయలసీమ వారి అనుమానాలు తొలగించారు స్వామి సీతారాం 30 రోజుల నిరాహార దీక్ష చేపట్టారు స్వతంత్రం వచ్చింది కనుక సంప్రదింపులతో ఆంధ్ర రాష్ట్రం తెచ్చుకోవచ్చు అని రావుగారు సలహా ఇచ్చారు 1952లో పొట్టి శ్రీరాములుగారి నిరాహార దీక్షా మరణంతో ఆంధ్ర రాష్ట్రం సిద్ధించింది. రాష్ట్ర ముఖ్యపట్టణం విషయంలో రావుగారు అందరినీ ఐక్యపరచి "ఆంధ్రులు కలిసిమెలిసి వుంటే అదే నాకు ఆనందం" అన్నారు

<u>నిర్మాణాత్మక ఉద్యమకారుడు .</u>

క్రాంత దర్శియైన రావుగారు సామాన్య జనులు విద్యా విజ్ఞానవంతులై చైతన్యశీలురైతే తప్ప స్వతంత్రం, ప్రజాస్వామ్యం నిలువవని తలచేవారు. గాంధీజీ హరిజనుడు రాష్ట్రపతి కావాలి అనే వారు వివేకానందుడు సామాన్యులను మేలుకొలుపు అని ప్రబోధించేవారు. ఈ రెండు వాదాలను వంట పట్టించుకొన్న రావుగారు గ్రంథాలయ, వయోజన ఉద్యమాలను తన రెండు కళ్ళుగా చేసుకొన్నారు

1890లోనే "సరస్వతీ నిలయాలు" అనే పేరుతో ఆంధ్ర దేశంలో స్వల్పంగా గ్రంథాలయాలు వుండేవి వందేమాతరం ఉద్యమ స్ఫూర్తితో ఇవి విస్తరించాయి. 1907లోనే రాజమండ్రిలో 90 మందితో "తిరుగుబాటు రాత్రి వయోజన పాఠశాల" స్థాపించారు రావుగారు. 1914లో రావుగారి అధ్యక్షతతో ఆంధ్ర గ్రంథాలయ సంఘం ఏర్పడింది 1918లో కేంద్ర ప్రభుత్వమే దేశంలో ప్రభుత్వ పక్షాన గ్రంథాలయ సమావేశం జరిపింది కాని ఆంధ్ర సంఘాన్ని ఆహ్వానించలేదు 1941లో గ్రంథాలయ అధికారుల శిక్షణా శిబిరం తొలిసారి ఏర్పడింది దానికి

సిలబస్ వ్రాసి శిక్షణ ఇవ్వటంలో రావుగారి కృషి సాటిలేనిది ఆంధ్ర గ్రంథాలయ ఉద్యమం ప్రభుత్వానికే స్ఫూర్తిదాయకం అయింది 1941లో వయోజన విద్యను చేపట్టింది దీని ద్వారా ప్రజలు చైతన్యవంతులు కావడంతో ప్రభుత్వం సహించలేక నిషేధించింది తర్వాత తీవ్రమైన ఆందోళన చేయగా నిషేధాన్ని రద్దుచేసింది. మహారాష్ట్రలో గైక్వాడ్ రాజు ప్రోత్సాహంతో గ్రంథాలయ ఉద్యమం వ్యాప్తి చెందితే ఆంధ్రలో శ్రీ రావుగారి వంటి వారు గ్రంథాలయ, వయోజన ఉద్యమాన్ని ప్రజల ఉద్యమంగా తీర్చిదిద్ది డా.లాబాక్ ప్రశంసలు అందారు 1937లో రాజాజి ప్రభుత్వం ఆయన సేవలను గుర్తించి ఆంధ్ర రాష్ట్ర వయోజన విద్యా డైరెక్టరుగా నియమించారు 1948లో గ్రంథాలయ వయోజన విద్యలకు ఆయన చేసిన అపూర్వ సేవలను గుర్తించి కార్యకర్తలు వారి షష్టిపూర్తి ఉత్సవాలు నిర్వహించారు అపుడు వసూలైన పైకంతో విజయవాడలో శ్రీరావుగారి పేర సర్వోత్తమ భవనం నిర్మించారు ఇది వారి కృషికి ఆంధ్ర దేశం అందించిన నివాళి. 1953లో అఖిల భారత వయోజన విద్యా మహాసభలకు రావుగారు అధ్యక్షులు అయ్యారు 1956లో శ్రీ సంజీవ రెడ్డి ప్రభుత్వం ఒక వంక వయోజన విద్య అవసరం అంటూనే రావుగారి పదవిని రద్దుచేశారు 1958లో సర్వోత్తమ భవనం పైఅంతస్థుకు బాపూజీ మందిరం అని నామకరణం చేశారు. నిర్విరామంగా చివరి శ్వాస వరకు అనేక కార్యక్రమాలు చేపట్టడంతో రావుగారి దేహం జర్జరితమైనది 1960లో దివంగతులయ్యారు

ఒక ద్రష్ట – దృక్పథం – వ్యక్తిత్వం

పాకీపని వారి సంఘం, ప్రెస్ పనివారి సంఘం విద్యార్థి సంఘం, ఉపాధ్యాయ సంఘం, హిందీ ప్రచారం, పంచాయతీలు, సహకార రంగం, యువజన సంఘాలు, పత్రికా రచయితల సంఘం, స్వతంత్ర పోరాటం, వ్యవసాయ పనిముట్ల వారి సంఘం, చేనేత సంఘం, పశుప్రదర్శన, రాయలజయంతి, సంఘ సంస్కరణ, మహిళాభ్యుదయం, పంచముల ఉద్ధరణ, సంగీతనాటకకళాపరిషత్తులు, క్షామనివారణ, క్షామ సహాయం, రాయలసీమ ప్రాజెక్టులు, కరువు నివారణ, పరియావరణ అటవీశాఖ, రాయలసీమ సేవాసమితి, రైతుసంఘం, ఆరోగ్యం, ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం వంటి విభిన్నమైన, విలక్షణమైన ఎన్నో ఉద్యమాలకు వారు పోసి నీరుపోసిన వీరిని ఆంధ్ర ఆదిశేషుడు లేదా ఆంధ్ర విజ్ఞాన భాస్కరుడు అనవచ్చు ఇంతటి మహావ్యక్తికి రాజకీయ పదవులు దక్కక పోవటానికి కారణం ఆయన నిర్లిప్తత, నిష్కామకర్మయోగమే కారణం.

ఆయన హృదయం ఎలాంటిదో గమనిద్దాం "రాజకీయాలు జీవిత సర్వస్వం కాదు. దేశభక్తులు ఎంతటి వాడైనను ఒక ధర్మమును అనుసరింపక తప్పదు తాను నాయకత్వం వహించుటకు వీలులేనప్పుడు నాయకత్వం వహించినవారికి తమ శక్తిని అనుసరించి తోడు పడుట జాతిపురోగమనమునకు అత్యవసరం . తాను కష్టపడి చెమటోడ్చి నిర్మించిన సౌధం తనకనులముందే బీటలు వారినప్పుడు చూచి పకపక నవ్వగలవాడే నిజమైన వేదాంతి, ప్రజానాయకుడు"

శత్రులు–మిత్రులు, కలిమియు–లేమియు, కష్టము–సుఖము‌ను నిలుకడ నందక కలుగుచు అడగును

ఇవి ఎల్లయు జడభవమగు గుణములు వీనిని సమతం వీక్షింపగలుగు జీవి నిజమగు విరగతి అమరున్ –అంటారు ఒక కవితలో

ఈ మహోన్నత నిష్కామకర్మయోగికి విరగతి కలుగుటలో వింత ఏమున్నది! ఆయనే వ్రాసిన 'ది ఫర్గాటన్ పొయెట్ ఎంపరర్ వలె ఈయన కృషి విస్మృత మగుట ఆంధ్రులకు భాగ్యముకాదు! ఈ సందర్భమున కర్నూల్లు కేంద్ర గ్రంథాలయ భవనమునకు గాడిచెర్ల వారి పేరు పెట్టిన జిల్లా గ్రంథాలయ సంస్థ అధ్యక్షులు శ్రీ. కె చంద్రశేఖర కల్కూర అభినందనీయులు

# రాయల రమ్య సాహితి

-జె.యస్ ఆర్.కె శర్మ

మ॥ పదవాక్యమ్ముల కృష్ణరాయ! కడు గీర్వాణాంధ్ర వాక్ప్రౌఢిమల్
పాదలవ్ వ్రాసి విపశ్చి దగ్రణులు ప్రోద్భూతంబుగా మెచ్చ నీ
సదలంకార విశేష యుక్తమగు ఆంధ్ర భాషాప్రేమ ఆముక్తమా
ల్యదలో చాటితి వాంధ్రభూమిని జగత్ప్రఖ్యాత సత్కీర్తితో

ఆ వె తెలుగదేల యన్న దేశంబు తెలుగు-ఏను
తెలుగు వల్లభుండ తెలుగు కండ - కలకండ
ఎల్లనృపులు గొలువ యెరుగవే బాసాడి
దేశ భాషలందు తెలుగు లెస్స- అని

ఆంధ్రభాషాయోషకు అధికార పీఠమిచ్చిన తెలుగు చక్రవర్తి భగవద్వాణిగ ఈ ధ్రువ పత్రమును గ్రంధస్థమొనరించి అక్షర సత్యముగ మార్చిన మహామనీషి, కలము, ఖడ్గము నడిపించి, ఝళిపించి రాజకవియై, కవిరాజై, సాహితీసమరాంగణ సార్వభౌముడని, ఆంధ్రభోజుడని, అభినవభోజుడని బిరుదపట్టములంది, పెద్దనాది కవులకు నాన్యాతో శ్రుతముగ కాళ్ళకు గండపెండేరము తొడిగి పల్లకిలో మోసి గౌరవించి సాహిత్య చరిత్రలో ప్రబంధమను మాతన ప్రక్రియను పాదుకొల్పి ఆంధ్ర సరస్వతికి వినూతనాభరణములు తొడిగి అంగరంగ వైభోగముగా ఊరేగించిన ఆంధ్రుల అదృష్ట ఫలము శ్రీశ్రీశ్రీ శ్రీ కృష్ణదేవరాయలు

రాయల కాలమున ఆంధ్రావని శాంతి సౌఖ్యములతో పాడిపంటలతో అనల్పకవితాశిల్పకల్పనములతో తులతూగుట చరిత్ర ప్రసిద్ధ సత్యము పరమశాంతి తుష్టి, పుష్టులు సరస్వతీ లాస్యవిలాసములకు అదనైనది రాజులు, వారి అనచరులుకూడా భోగవిలాస లాలసులై యుండిన కాలమది. వైదిక నిష్ఠాగరిష్ఠత సడలిన ఆకాలములో వ్యక్తిగత శీలము నిర్మాణము చేయగల ముక్తిప్రదాయకములు, భక్తిప్రబోధాత్మకములునగు కావ్యములు వెలసినవి ఇట్టి కావ్యములకు తలమానికము అల్లసానివారి మనుచరిత్ర

కటకము మొదలు కన్యాకుమారి వరకు ఆంధ్ర సామ్రాజ్యమును విస్తరింపజేసి సిరిసంపదలతో సుభిక్షమొనర్చి కళామతల్లిని షోడశోపచారముల పూజింపుటకై భువనవిజయ సభామంటపమును నిర్మించి కృష్ణరాయదేవేంద్రుడు అష్టదిగ్గజములను నియమించి తన కీర్తిని దిగ్దిగంతముల వ్యాపింపజేసెను

అల్లసాని వాని అల్లిక జిగిబిగి, ముక్కుతిమ్మనార్యు ముద్దు పల్కు, ధూర్జటి శైవాంకిత అతులిత మాధురీమహిమ, తెనాలి రామకృష్ణుని పదగుంభనములు, అయ్యలరాజు సుధామయ సూక్తులు, మాదయగారి మల్లన కథాకథన చాతురి, పింగళిసూరన నూతన కల్పనా శిల్పము, భట్టుమూర్తి మధురసంగీత శ్లేషోక్తులతో భువనవిజయ సభామంటపము మార్మ్రోగినది

నిశిత ధిషణా సంపన్నులై శస్త్రశాస్త్ర ప్రతిష్ఠనందిన ప్రభుపుంగవులలో రాయలు ఒకడు జన్మసిద్ధమగు ప్రతిభతో అదృష్టముగా సిద్ధించిన తిమ్మరుసయ్య శుశ్రూషతో వ్యుత్పత్తి సాధించి నిరంతర సాహితీగోష్ఠుల అభ్యాసమును సంతరించుకొని యెనలేని మొనగాడు కవిపండితుడు అయినాడు కృష్ణదేవరాయలు దిగ్గజముల యోగ్యతాయోగ్యతలు నిర్ణయించుటయే గాక వారి కవితలను రమణీయోచితముగ వ్యాఖ్యానించు స్థాయిని

సంపాదించారు సంస్కృతమున మదాలస చరిత్రను ఉపమ ఉత్ప్రేక్షలతో రసికులు తలలూపునట్లు రచించెను ధ్వని, వ్యంగ్య, భావనిధిగా సత్యావధూప్రీణనమును వివరించెను. వేదపురాణ సంద్రములు తరచి సకలకథా మౌక్తిక సారమును కూర్చెను. విమవారి పావము పటాపంచలగునట్లు సూక్తి నైపుణితో జ్ఞానచింతామణిని సంతరించెను. అంతేకాక రసమంజరి ఆది గీర్వాణకృతులను అనేకము రచించెను.

ఇట్లు సాహితీసేవ యొనర్చి తన యాస్థానమున నున్న కళాధిక వివిధ భాషా కవి పండితులను మణిగణ విభూషితులజేసెను శ్రీ లొల్ల లక్ష్మీధర పండితులు అతని దానమువలన రత్నాకరము మణులులేనిదై కేవలము నీరధి అని పిలువబడుచున్నదని పలికి రాయల కీర్తిని అతిశయింపజేసెను. ఇట్లు సరస్వతిని, సరస్వతీమూర్తులను సేవించి రాయలు ఆంధ్రమహావిష్ణువు ఆజ్ఞపై "ఆముక్త మాల్యద" ను అనన్య సామాన్యముగ రచించి కీర్తి గాంచెను రాయల సంస్కృత కృతులైన జాంబవతీపరిణయము, ఉషాపరిణయములు రెండు మాత్రము తాళపత్ర రూపమున లభించుచున్నవి మిగిలిన కృతులన్నియు అలభ్యమగుట రసికుల దురదృష్టము కాని ఆంధ్రుల అదృష్టమోయన అతడు తెలుగులో వ్రాసిన ఆముక్తమాల్యద విద్వదౌషధముగ అనన్య ప్రచారమున నుండి తెలుగు పంచ కావ్యములలో ఒకటియై అలరారుచున్నది

శ్రీ కృష్ణ దేవరాయలు ఆముక్తమాల్యదను రచించుటలో కొన్ని ఆశయములున్నవి. కృష్ణరాయల తనూజాత తన మారీచీపరిణయ కావ్యములో రాయల నిట్లు ప్రశంసించినది.

చం. అకలుష మాధురీ కలితయై అలసాని కవీశుబోలె న
ల్లికజిగి, ముక్కుతిమ్మ కవిలీలను ముద్దగు బల్కు, పాండురం
గ కవి గతిన్ పదక్రమము గల్గు కవిత్వము తోడ విష్ణుచి
త్తు కథ రచించు మజ్జనకు తోరపుభక్తి నుతించి మ్రొక్కెదన్!

అష్టదిగ్గజ కవీంద్రులకు తీసిపోని ప్రబంధము వ్రాయుట ఒకటి పన్నిద్దరు ఆళ్వారులలో అగ్రగణ్యులగు విష్ణుచిత్త, ఆముక్తమాల్యదల చరితలు రచించి వైష్ణవమత సిద్ధాంతమును స్థాపించుట మరొక ఆశయము. అందులకే విష్ణుచిత్తునిచే యామునాచార్యునిచే శైవాది మత నిరసనము చేయించెను యామునాచార్యుని జ్ఞానభక్తి, బ్రహ్మరాక్షసుని మూఢభక్తి, గోదాదేవి మధుర భక్తులతో భక్తి ప్రబంధమును రచించి ముక్తిపొందుట మరియొక ఆశయము. భోగులైన రాజులును చండాలురును వర్ణసంకరులును మోక్షము పొందగలరు అని అల్లసాని వారికి, ధూర్జటికి సమాధానమిచ్చుట మరియొక ఆశయము అందులకే మూలకథలోలేని యామునాచార్య రాజభగినీ పరిణయమును గ్రంథస్థముచేయుట. మాలదాసరిచే బ్రాహ్మణునకు మోక్షమిప్పించుట రాయల సంస్కరణవాదమునకు ఒక నిదర్శనము ఇన్ని ఉదార ఆశయములతో వినిర్మించబడిన ఆముక్తమాల్యదలో రాయల రమ్య సాహితిని అనుశీలింతము.

పాండ్యదేశమును పడుమకు పాపట బొట్టు శ్రీ విలుపుత్తూరు

అందుండున్ ద్వయపద్మ పద్మ పదముండు అద్వంద్వుడు అక్రాంత యో
గాందా బద్ధ మధు ద్విషద్వరదు డ న్వర్థాభిధాముండురు
చ్ఛందో బృంద తదంత వాగవరనా సంజాత తజ్జన్య ని
ష్పందా ద్వైత సుసంవిదాలయుడు నిష్ణవిష్ణు చిత్తుండనన్

ద్వయమను వైష్ణవ మంత్రమును నిరంతరము జపించువాడు, శీతోష్ణ సుఖ దుఃఖాదులు లేనివాడు,

యోగమును సంకెళ్ళచేత భగవంతుడనెడి ఏనుగును మనమున కట్టివేసినవాడు చదువకనే సహజముగ వేదాంతసారమైన ద్వైతమును పొందినవాడు, సదాచార సంపన్నుడు సార్థకనామధేయుడు అయిన విష్ణుచిత్తుడు అందు నివసించెను ఈ పద్యమున రాయలు బిందుపూర్వక ''ద, డ'' కార ప్రయోగములతో శ్రుతి పేయ మొనర్చుటయే కాక విష్ణుచిత్తుని ధ్యాన వైశిష్ట్యమును కూడ ధ్వనింపజేసెను.

శ్రీ విలుపుత్తూరులోని విష్ణుచిత్తుడు న్యాయార్జిత విత్తమున ప్రాలేయ పటీరాచల యాతాయాత వైష్ణవావళికి నిరంతరము కాలోచితమైన విందు భోజనమును సమకూర్చును వర్షాకాలమున జడిబట్టిన రోజులలో విష్ణుచిత్తుడు భార్యకనులు పొగమూరకుండ ఎండిన టెంకాయ బోండములను సమకూర్చునట ఆ సతియూ అంత వర్షములోను కలమాన్నము, చాయపప్పు, నాలుగు కూరలు, వడియములు, నేయి, పెరుగులతో అన్నపూర్ణవలె వండివడ్డించునట

ఈ పద్యమున రాయలు విష్ణుచిత్తుని అతిథి సేవా పరతంత్రతనేకాక, కాంతా శుశ్రూషనుకూడ ప్రదర్శించి మంచి గృహస్థునిగా చిత్రించినాడు వేసవి కాలము నందు అతిథులకు చందన చర్చితోపాటు నులివెచ్చని సన్నబియ్యపు అన్నము, తియ్యనిచారులు, మజ్జిగపులుసు, పాయసము, చరకు పాలు, లేతటెంకాయ నీళ్ళు, రసగుల్లాలు, కదళీ రసాలాది ఫలములు, పరిమళముతోడి చల్లని నీరు, వడనుపోగొట్టు ఉరవేసిన లేత మామిడి పిందెలు, నీరు మజ్జిగలతో విందుభోజనము సమకూర్చును

ఇక సీతాకాలమందు పుమగు రాజన భోజనము, మిరియపు పొడి, వేడివేడికూరలు జలుబును పోగొట్టెడి ఆవాలపిండితో కలసిన పచ్చళ్ళు, చేయిచురుక్కు మను నేతిధార, అమరగాచిన పాలతో భోజనము వడ్డించునట ఇట్లు ఋత్వనుకూలముగా భోజనమును వర్ణించిన కవి మరొకరులేరు

శ్రోత్రియుల మధ్య నిరంతరము కూరుచొను రాయలు మాంసాహారి అతనికి చేపలనిన మక్కువ ఎక్కువ ఈ చేపల త్రేణుపు వాసనకు రాయలు మందు కనిపెట్టినాడు ఇసుకలో దాచిన టెంకాయ నీరు త్రాగిన ఈ దుర్వాసన పోవునట ఎంతటి పాకశాస్త్రకళాప్రవీణుడు రాయలు!

మధురానగరమునగల పుష్పలావికలు, పణ్యయువతులను రాయలు వర్ణించిన తీరు విలక్షణమైనది పుష్పలావికలు, విటులు వర్మగర్భముగ వేయు ప్రశ్నలకు శ్లేషతో జవాబిచ్చుట ఇందలి సొగసు

సీ వెలది నీ దండ వెలయెంత ? నా దండకును వెలబెట్ట నెవ్వనితరంబు ?
కలువతావులు కాన మలి కదంబక వేణి- కలువతావులు వాడకయె కలుగునె
కడివోదు నాకిమ్ము పడతి ఈగేదంగి - నన కడివోమి ముందరికి జాడు
జాతులేవంబు జేషణ ? పద్మినులు సైత మున్నయెడ జాతులునికి యరుదె ?

ఇత్యాదిగా మాటలాడుదురట నా దండ యనగా నా పూలదండ, నా ప్రక్కన చేరుట అని రెండు అర్థములు తావులు అనగా వాసనలు, సంకేత స్థలములు, కడివోదు అనగా వాడనిది, ముద్దనోటికిపోదు, జాతి అనగా జాజిపూలని, పద్మినీ మొదలైన స్త్రీ జాతులని అర్థము

పాండ్యరాజా వేశ్య ఇంటికి పోవుచుండెను ఆ రాజా భోగియేకాదు- జ్ఞానికూడ. మార్గమధ్యమున రాజా ఒక పండితుని పద్యమును వినెను

చం వినియె నెలన్ చతుర్థ్యయుని, వృష్టిదినాలికి, రాత్రికై దివం
బున జరకై వయస్సునను పూని పరంబున కిప్పు డుద్యమం

ఒనుపుగ జేయుగావలయునంమ పురోహిత ధర్మము అత్మగిల్కొన రాజావినెను అతనికి వైరాగ్యము జనించెను భోగినికి ఇవ్వవలసిన తాంబూలమును పండితునకు ఇచ్చి గిరుక్కున మరలెను సభ చేసెను మోక్షమిచ్చు దైవమును నిర్ణయింమవానికి బహుమానము ప్రకటించెను శ్రీ విలి పుత్తూరులోని విష్ణుమూర్తి ఆ రాజును వీరవైష్ణవునిగా మార్చుటకు ఇదియే సమయమని తలచెను ఆ బాధ్యతను విష్ణుచిత్తునకు అప్పజెప్పుటను రాయలు కవితా రమణీయముగా వర్ణించెను విష్ణుచిత్తుని వినయ భక్తిప్రపత్తులను అందముగ ప్రకటించెను "ఓహోగుణఖని" అను నిందను పావుకొనుటకు అతడు సరళసుందరములైన ఘట్టములు ఎన్నో విలిఖించెను అందుల్లో ఇది యొకటి విష్ణుచిత్తుడు

శా॥ స్వామీ నన్ను నితః పురాపరిత శాస్త్రగ్రంధ జాత్యంధు నా
రామ క్ష్మాఖనన క్రియా ఖర ఖనిత్ర గ్రాహితోద్య త్కిణ
స్తోమా స్పిద్ధ కరున్ భవద్భవన దాసున్ వాదిగా బంపుచో
భూమీ భృత్సభ నోటయ్యెన అయశంబుల్ మీకు రాకుండునే?

దేవా నేను శాస్త్రములు చదువలేదని మీకు తెలియును నీ ఉపవనమున పారతీసికొని త్రవ్వుటచే చేతులు కాయలు కాసిన మొరటువాడనని నీకు తెలియును నాకున్న ఆర్హత నీ గుడికి పూజారి నగుటయే ఇట్టివానిని శాస్త్ర వాదమునకు పంపిన అచట నేను ఓడినా మీకు అవమానము కదా స్వామీ!

మ॥ గృహ సమ్మార్జనమో! జలాహరణమో! శృంగార పల్యంకికా
వహనంబో, వనమాలికా కరణమో, వాల్లభ్యలభ్య ధ్వజ
గ్రహణంబో, వ్యజనాత పత్ర ధృతియో, ప్రాద్దీపికారోప మో
నృహరి వాదములేల? లేరె ఇతరుల్ నీలీలకున్ పాత్రముల్?
విష్ణుచిత్తుని వాదనకు దేవి ముఖముచూచి విష్ణువు ఇట్లనియెను

నీ ఇచ్చయె? మిన్నక పోవోతః మునిప్రవర! నిన్ను ఒప్పింతును భూ
నాయక సభ! ఇందులకై యే అడ్డము వలదు అవల నేనున్నాడను
అని విష్ణుచిత్తుని యోగక్షేమములు స్వామి వహించెను.

విష్ణుచిత్తుడు గెలిచెను భగవంతుడు సాక్షాత్కరించెను గజారోహణము చేసి ఏనుగుకు ఇరువైపుల వున్న గంటలు వాయించుమ విష్ణుచిత్తుడు చేసిన స్తుతి వీనులవిందు చేయును కందపద్యములనిన రాయలకు ఎక్కువ ఇష్టము సగము కంద పద్యములో దశావతారములను వర్ణించిన తీరు కడుంగడు ప్రశంసనీయము

కం జలచర, కిటి, హరి, వటు, భృగుకుల, రఘుకుల, సీరి, బుద్ధ, ఘోటి, ప్రముఖో
జ్వల, జనికృత, జనరక్షా! అలమేల్మంగాభి ధేందిరాలయ వక్షా!

ఖాండిక్య కేశధ్వజ సంవాదము అతిరమణీయమైన కథ జ్ఞానులైన ఇరువురు రాజకుమారులు ఖడ్గోపజీవులై ఏళ్ళు తరబడి యుద్ధము చేయుదురు కేశధ్వజుడు జయించుమ ఖాండిక్యుడు అడవి జేరి తపమొనర్చుమ ఒక ధర్మ సూక్ష్మము కొరకు కేశ్వధ్వజుడు ఖాండిక్యుని ప్రార్థించును. ఖాండిక్యుడు అధర్మసూక్ష్మము వివరించి గురుదక్షిణగ కేశధ్వజుని బ్రహ్మజ్ఞానమడుగును సోదరుడు రాజ్యమడుగ కుండుటకు ఆశ్చర్య పడిన కేశధ్వజుడు ఖాండిక్యుని కుమారునకు రాజ్యాభిషేకము చేసి సోదరునకు బ్రహ్మోపదేశము చేయును ఇరువురును ముక్తి

పొందుదురు రాజ్యము గోరుమన్న మంత్రులతో ఖాండిక్యుడు

కం పరలోక సుఖము శాశ్వత మరయ మహిరాజ్య సౌఖ్యమల్పానేహః
పరిభోగ్యంబిందులకై దురితము కావించి తొలగుదునె పరమునకున్ అంటాడు

కేశధ్వజుడుతత్త్వబోధ చేస్తూ, రాజా! తానుగాని దేహము తానను కొనుట, తనదికాని వానిని తనవనుకొనుట రెండును అజ్ఞానమను మహావృక్షమునకు బీజములు అని విష్ణుపురాణ శ్లోకమును రాయలు తేట తెనుగున స్పష్టీకరించెను

శ్రీహరి దివ్యమంగళ విగ్రహమును ఎట్లు ధ్యానము చేయవలెనో తెల్పుచో రాయలు రచించిన సీసపద్యము సాధకులకు ఒజ్జబంతిగ నుపయోగించును

సీ॥ శ్రీవిష్ణునీగతి చింతింపవలయు తన్మయుడగు యోగి క్రమంబుతోడ
ఒక్క అంగమె మున్ను చిక్కలోభావించి అది దృఢంబగుటయు యవలియంగ
కము మరి చింతింపగా దగు నట్టి యభ్యాసంబువలన నయ్యవయవములు
నడిచిన నున్న మానక యెద్ది యెనియు జేయు చున్నను మదిబాయడేని
అతని సామ్యంబుగని ముక్తుడగు సురాదిభేద సంజనకాజ్ఞానమెద
అలము కల్యాణగుణముల హరికి తనకు లేని భేదమెవ్వాడు కల్పింపగిలడు?

ఇచట రాయలు యోగియై మనకు దర్శనమిచ్చినాడు యామునాచార్య రాజ నీతి ప్రబోధ ఘట్టమున రాయలు రాజనీతిజ్ఞతయే కాక నన్నయాదుల శైలిని పుణికిపుచ్చుకొనినాడు ఈ సందర్భమున రాజా దిన చర్యను గూర్చిన వివరణ రాయల దినచర్యను గుర్తుకు తెచ్చుచు ఆదర్శవంతమై యొప్పుచున్నది

రాజానకు ప్రభాతసమయ మందు, సుఖముగా నిద్రపట్టినదా అని యడుగు వైద్యులతో మొదలు పెట్టి జ్యోతిశ్శాస్త్ర పండితులతో చర్చజరుపవలెను జాముతరువాత మంత్రులు, సామంతులు, అర్థిక ప్రముఖులతో, కరణములతో గోష్ఠిచేయవలెను మధ్యాహ్నమున అంగమర్దనము చేయు మల్లులతో, వంటివానితో, వేటగాండ్రతో సాంగత్యము చేయవలెను అపరాహ్ణమున దేవపూజమొదలుగ పూజ్యులతో, ధర్మాధికారులతో, మంత్రులతో చర్చచేయవలెను భోజనము పిమ్మట విదూషకులతో, పౌరాణికులతో, కవులతో సభచేయవలెను సాయంకాలము చారులతో మొదలు పెట్టి గాయకులతో గోష్ఠి జరుపవలెను రాత్రి ప్రియురాలితో గోష్ఠి పిమ్మట నిదురించవలెను

బిడ్డలులేని విష్ణుచిత్తునకు తులసి వన మందు గోదా దేవిలభించెను ఆ దంపతుల చేతిలో ఆమె దినదిన ప్రవర్ధమానయై బాల్యము దాటి యవ్వనమును పొందెను గోదాదేవి మునుపటి వలె మాటలాడుట లేదు ఆమె నెరికురులు వంకరలు తిరిగెను కనులు విలాస వంతము అయ్యెను కనుబొమలు కాంతివంతములయ్యెను స్తనములు పెరుగ ఉరము కనిపించుటలేదు పాణి పాదములు ఎఱ్ఱవారెను నడుమునకు దరిద్రముకలిగెను శరీరమునకు శుభ్రత హెచ్చెను నాభి లోతయ్యెను బాల్యము తననామె చౌక చేసినదని కోపించి వెడలి పోయెను ఆమె హరిని వరించెను చెలికత్తెలు హరి భజనలు పాడు చుండగా వ్యంగ్యముగా స్వామిని ఉపాలంభించుచున్నది ఆహరి నామన పరశురామ బుద్ధ రామావతారముల యందు స్త్రీలను తపింపచేయుట కంటె మత్స్యకూర్మ, వరాహ, సింహరూపముల యందే ప్రతి యుగమున నుండటమేలు ఏలనన మనుష్య స్త్రీలు ఇతరులతో చెప్పికొని విరహమును కొంత తగ్గించుకొన వచ్చును

రామావతారమున శూర్పణఖ మొర్రోయనుచుండగ ముక్కు చెవులు కోయించెనుకదా! ఈ సందర్భమును

వర్ణించుటలో రాయలుచూపించిన సొగసు ఇంతింతన రానిది చెలికత్తెలు గోదాదేవితో యనుచున్నారు ।ఎవరైనా అంతే తల్లీ! భర్త దూరముగా వున్నప్పుడు తిట్టుట-భర్త వశము కాగానే అతడే ఇంద్రుడు అని, చంద్రుడు మిగిలిన వారిని మరచి పోవుట సామాన్యమే కదా!

విరహాముతో మున్న గోదాదేవి కోపము ఈ సారి రాధపైకి వెళ్ళినది

అక్కట రాధనీకు తగవా! మగవారల వత్తమామలం
దక్కి ముకుంద వేణు కలనాదవుటీలకు లేటి మొత్తమై
త్రెక్కొను కాకచే నడికి రేలరు దెంచిన గోపికావలిన్
పొక్కగజేసి తద్రువిర భోగము గుత్తగ నీవ్వైకొనన్!

ఏ మమ్మా రాధా! కృష్ణుడునీ గుత్త సొమ్మా యేమి? కృష్ణుని మురలి రవళివిని భర్తలను, అత్తలను , మామలనుగికురించి వచ్చిన గోపికలందరను మోసగించి, ఏడిపించి కృష్ణునితో నీవొక్కతెవే గడవుట న్యాయమా?

ఈ పద్యము రాయల శృంగార రస పరాకాష్టకు నిదర్శనము రాయల శాస్త్ర పరిచయము అతిగహనము అతని రాజనీతి విస్తారము అతని పద సంచయము విస్తృతము- అతని ఋతువర్ణనలు అప్రతిమానములు అతని చేతిలో పాత్రలు కథోన్మీలితములగును అతని వస్తు పరిశీలనలు సూక్ష్మాతి సూక్ష్మము అతని ఆముక్తమాల్యద భారతీయ విజ్ఞాన సంస్కృతీఖని జాంబవతీ పరిణయములోని రాయల మంగళాను శాసనముతో ముగింతము

శ్లో దర్మపాద చతుష్టయేన కృతవత్ స్థైర్యం సమాలంబితాం
చాతుర్వర్ణ్య ముపైతు కర్మసతతం స్వస్వాధికారోచితం
శేషక్ష్మాధర నాయకస్య కృపయా సప్తార్ణవీమధ్యగాం
రక్షన్ గామిహ కృష్ణరాయనృపతీః కావ్యం శాశ్వతం సమాః

---

స్వాతంత్ర సమరయోధుల సంస్థ వ్యవస్థాపకులు, కాకలుతీరిన కాంగ్రెస్ కార్యకర్త,

## కందుల ఓబులరెడ్డి

ప్రకాశం జిల్లా గిద్దలూరు తాలూకా (గతంలో ఈ తాలూకా కర్నూలు జిల్లాలో ఉండేది) లింగాపురంలో 1911 జూన్ 7న జన్మించారు తండ్రి నాగిరెడ్డి, బి ఎ వరకు చదివారు వ్యవసాయదారు 1930-32 శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నారు 1934లో నిడుబ్రోలులో జరిగిన రాజకీయ శిక్షణ శిబిరంలో విద్యార్థిగా పాల్గొన్నారు రాయలసీమలో జరిగిన భూమిశిస్తు రిసెటిల్‌మెంట్ సందర్భంగా 1934లో రాయలసీమలో పర్యటించారు 1936లో రాష్ట్రకిసాన్ కాంగ్రెస్ అధ్యక్షులుగా ఎన్నికయ్యారు 1936-37 సంవత్సరాల్లో కర్నూలు, చిత్తూరు జిల్లాలలో కొన్ని రాజకీయ పాఠశాలలు నిర్వహించారు 1940-41 వ్యష్టి సత్యాగ్రహోద్యమంలో పాల్గొన్నారు బ్రిటిష్ ప్రభుత్వ చట్టాలను ఉల్లంఘించ వలసిందిగా ప్రజలకు ఉద్బోధించారు రైతుల రహస్య సమావేశాలు జరిపి, ప్రభుత్వానికి భూమిశిస్తు చెల్లించవద్దని ఉద్బోదించారు క్విట్ ఇండియా ఉద్యమం సందర్భంగా 1942లో అరెస్టు కాబడి ఒక సంవత్సరం పాటు బళ్ళారి జైలులో కఠిన కారాగార శిక్షకు గురయ్యారు జైలు శిక్ష పూర్తికాగానె 1943 ఫిబ్రవరి 10వ తేది నుండి 1945 జూలై 8 వరకు నెల్లూరు, తంజావూరు జైళ్ళలో డిటైన్ చేశారు 1939-41 మధ్య కర్నూలు డి సి సి అధ్యక్షులుగా పనిచేశారు 1939లో జిల్లా బోర్డు సభ్యులుగా ఎన్నికయ్యారు 1946మే నుండి 1951 వరకు పి సి సి అధ్యక్షులుగా పనిచేశారు 1933లో జిల్లా బోర్డు

(తరువాయి 80వ పేజీలో)

# సాహితీ సదస్సు మూలస్తంభం
# ఆచార్య మేడూరి దీక్షితుల వెంకట సుబ్బయ్య

- సాహిత్య ప్రపూర్ణ - ఆచార్య శ్రీ యన్.వి కృష్ణమూర్తి

సాహిత్య పితామహుడు అను బిరుదు గన్న కీ శే మేడూరి దీక్షితుల వెంకట సుబ్బయ్య సామాన్యమైన మంచి మనిషి, అసామాన్యమైన మనీషి శ్రీ శంకర భగవత్పాదులు వివేకచూడామణిలో ప్రబోధాత్మకంగా చెప్పిన మాట ఇది

శ్లో!! దుర్లభం త్రయమేవైతత్ దేవానుగ్రహ హేతుకమ్!
మనుష్యత్వం, ముముక్షుత్వం మహాపురుష సంశ్రయః

మానవ జన్మ, మోక్షకాంక్ష, మహనీయుల ప్రాపు ఈ మూడును దొరకడం అతి దుర్లభం ఇంత దుర్లభమైన మానవజన్మ వచ్చిన తర్వాత సార్ధక జీవనం గడపడమే దైవత్వం కంటే గొప్పదనే సందేశాన్ని రామాయణం శ్రీరాముని ద్వారా మనకు అందజేస్తుంది మనిషి మనిషిగా బ్రతకడమే చాలా కష్టమైనది అంటే స్వార్ధరాహిత్యం, సేవాతత్పరత, భూతదయ, సత్యసంధత, ఈర్ష్య లేకపోవడం మొదలైన గుణములున్న మానవుని జీవితమే ధన్యము ఈ గుణసంపద మెండుగా వున్న ఉత్తమ వ్యక్తి శ్రీ వేంకట సుబ్బయ్య ఆయనతో నాకు గల 45 ఏండ్ల (1950-1995) సన్నిహిత మైత్రిలో ఎన్నో ఎన్నదగిన సన్నివేశాలున్నాయి

ఉస్మానియా కాలేజిలో రెండు దశాబ్దాలు అత్యంత ఉల్లాసభరితంగా, విరాట్ స్వరూపం దాల్చి, తనచుట్టు వున్న విద్యార్థులను, సహాధ్యాపకులను అందరినీ ఉత్సాహపరచి నిర్వహించిన సాంస్కృతిక కార్య కలాపాలు, కవులను, పండితులను, విమర్శకులను, గాయకులను, నటులను, కళాకారులను రావించి ఉదారంగా సన్మానించును ఝంఝూ మారుతం వలె నిర్విరోధంగా ఆంధ్ర సంస్కృతాది సారస్వతాలకు పట్టంకట్టిన సమారాధనం మరువరానిది, నిస్తులమైనది అంతటా తానై అన్ని తనవే అన్న విచిత్రమైన మమతా భావంతో వ్యవహరించిన ఉదాత్త వ్యక్తిత్వమాయనది ప్రసిద్ధ వైదాంతిక కవి అయిన నీలకంఠ దీక్షితులు ప్రతిపాదించిన

శ్లో!! త్యక్తవ్యో మమకారస్త్యక్తుం యది శక్యతే నాసౌ
కర్తవ్యో మమకారః కింతు స సర్వత్ర కర్తవ్యః (వైరాగ్య శతకం శ్లో.77)
అన్న మమకారానికి లక్ష్యభూతుడు శ్రీ వేంకట సుబ్బయ్య.

అన్నం పరబ్రహ్మ స్వరూపం అని సుష్టుగా భోజనం చేసి భోజనానంతరం కూడా లడ్డు, వడ వంటి తిండి పదార్థాలను మెక్కి, నిక్కి, కూర్చొని అరగించు కొనగల జఠరాగ్ని అతని అనువంశిక సామర్థ్యము ఇది చాల మందికి సుసాధ్యమేకావచ్చు కాని ఏమి దొరకనప్పుడు కొన్ని పూటలు కటిక ఉపవాసము వుండగల నిబ్బరంకూడా ఆయనకు దండిగా వుండేది "నిండుమనంబు నవ్య నవనీత సమానం " అన్నట్లు నిజమైన బ్రాహ్మణునికి వుండవలసిన ఓర్పు ఆయనలోని ప్రత్యేకత ఇది మాత్రం చాల మందికి అసాధ్యం బాగా ఓర్చుకొనే శక్తి బ్రాహ్మణునికి వుండి తీరవలెను అనునది ఆయన అభిప్రాయం.

ఆత్మీయులు ఎవరైన గతించినపుడు, శోకతప్త మనస్కులై ఉన్నప్పుడు, మనిషి గుండె దిటవు ఎంతో గోచరించును ఉన్నట్టుండి చనిపోయిన భార్య శవం ప్రక్కన నిలబడిన వెంకట సుబ్బయ్యలోని చిత్రార్పిత నిశ్చలత,

కంటి నుండి లవలేశమైన పైకుబికి రాక లోపలికే ఇంకిపోయిన కన్నీళ్ళు, విధితో రాజీపడ్డ శుష్కశరీరం, నిర్లిప్తత, మానసిక స్థిరత నామెదడులో నిలిచిపోయాయి ఆ దృశ్యము స్థిత ప్రజ్ఞత్వానికి ప్రతీక!

ఎందరెందరో రచయితలకు, కాల్పనికత మొగ్గలు తొడుగుచున్న యువకవులకు, నటకులకు స్ఫూర్తినిచ్చి పదండి ముందుకు అని మనసార ప్రోత్సహించి, అనువైన రంగస్థలి నేర్పరచి, వారినందరిని ఆంధ్ర భాషామతల్లికి అనుంగు పుత్రులుగా తీర్చిదిద్దిన ఆయన ఔదార్యము, నేర్పరితనము సంస్తవనీయమైనవి ఎందుకంటే ఆయన రచనలు కొద్దియైనా (శీలవతి అనే ఖండ కావ్యం, అప్పుడప్పుడు ప్రచురితములైన మ్యాగజైనులలోని క్వాచిత్క రచనలు) తన రచన, తన స్వరము అన్ని చోట్ల ప్రతిధ్వనింప జేయవలెననే స్వార్థాన్ని విడిచిపెట్టి ఇతరుల వెన్నుతట్టి ముందుకు నెట్టి ప్రాచుర్యం కల్పించిన ఈసులేని మానిసి వేంకట సుబ్బయ్య

అతని పట్టుదల చాలా గొప్పది ఒకమారు శ్రీమద్రామాయణ సప్తాహమును ఇస్కాల కృష్ణస్వామి వారి సత్రములో జరిపినాము ''దినదినంబునకు మన బలంబులు సన్నంబులయ్యె'' అన్నట్లుగా సభాసదుల సంఖ్య సన్నగిల్లుతూ పోయింది కడపటి రోజున ఏదో అనివార్య కారణం వలన నేను కూడా పోవడం సాధ్యపడలేదు. అప్పుడాయన ఒక్కడే ( ఒక్కడే చాలు నిశ్చల బలోన్నతుడు అన్నట్లు) వెళ్ళి దీపారాధన చేసి వేదికనెక్కి కూర్చొని రామాయణ పట్టాభిషేక ఘట్టం ముక్తకంఠంతో రాగయుక్తంగా చదివి రామాయణ సప్తాహాన్ని పరిసమాప్తి చేశాడు. అదే అద్వైతసిద్ధి కాబోలు!

శ్రీ వేంకట సుబ్బయ్య ఆదర్శ ఆచార్య వర్యుడు ఏ విషయాన్నైనా సంపూర్ణంగా విద్యార్థులకు అంకితభావంతో శ్రద్ధతో అపార వాత్సల్యంతో బోధించేవాడు కర్ణపేయంగా పద్యాలు చదువుతూ పాఠాలు చెబితే విద్యార్థులు తదేక ధ్యానంతో ఆ జ్ఞాన యజ్ఞంలో తన్మయులై పాల్గొనేవారు దీనికి సాక్ష్యంగా మన ప్రాంతమంతటా కనిపించే వారి శిష్యులే ఆయన ప్రజ్ఞా పాటవాలను వేనోళ్ళ స్తుతిస్తారు.

సాహితీ సదస్సు అతని ఆరవ ప్రాణం, ఆరని ప్రాణం సదస్సును 25 ఏండ్లు పోషించి పెంచి దాని ద్వారా కర్నూలు పట్టణ మందేకాక యావదాంధ్ర సాహిత్య లోకంలో ఒక ఊపు, ఒక స్పృహ, ఒక మహిత స్ఫూర్తి కలిగించాడు వెంకట సుబ్బయ్య. అతడు భారత భాగవత పురాణ ప్రబంధాలలోని పద్యములను వరుసబెట్టి వేలాదిగా ఏకధాటిగా శ్రావ్యంగా అర్థగౌరవమును తొణికిసలాడునట్లు చదివి వినిపించి ఆశ్చర్యాన ముంచెత్తగల అద్భుత వ్యుత్పత్తి గల మనీషి

సమావేశ ప్రారంభంలో ఆయన ప్రార్థన చేయవలసి వస్తే శివానందలహరిలోని ప్రథమ శ్లోకమైన ''కలాభ్యాం చూడాలంకృత శశికలాభ్యాం నిజతపః ఫలాభ్యాం నతిరియం'' అని గొంతు విప్పి ఆలపించేవాడు. కొన్ని సార్లు శ్రీవిద్యా సారమైన సౌందర్యలహరి లోని మొదటి శ్లోకాన్ని ''శివ శ్శక్త్యా యుక్తో యదిభవతి శక్తః ప్రభవితుమ్ కథ మకృత పుణ్యః ప్రభవతి'' భక్తి పారవశ్యంతో పఠించేవాడు కారణం ఏమంటే ప్రకృతి పురుషుల సామైక్యతత్వాన్ని దైవీశక్తి స్వరూప ప్రాధాన్యాన్ని మననం చేసుకొని తన లోకయాత్రను సుసంపన్నంగా మలచుకొన్న పూజ్యుడు కాబట్టి మహామహులైన శ్రీధర పరశురామ శాస్త్రి, డా చిలుకూరి నారాయణరావు వంటి పండిత పరిశోధకుల వద్ద విద్య నభ్యసించిన వాడు కనుక అతని ప్రతిభావ్యుత్పత్తులు కొట్టవచ్చినట్లు దర్శనమిచ్చేవి ఆయన ప్రతి సభలోను ఆయా ఉపన్యాసకులను ఆనాటి ఉపన్యాస అంశములను పరిచయం చేస్తూ పల్కిన తొలి పలుకులు చక్కని సాహిత్యసౌరభాలను వెదజల్లేవి వాటిని క్రోడీకరించి వుండి వుంటే అవి ఒక సూక్తి సుధా సంపుటిగా రూపొంది వుండేవి అంతేకాకుండా కొందరు విజ్ఞులైన శ్రోతలు ''ఈములాయన ఆ ముందుమాటలు చెప్పకుండా

వుంటే ఈంతో బాగుండేది " (ప్రధాన ఉపన్యాసకుని పల్కులు చప్పబడ్డాయని భావము) అనే వారు

ప్రతిక్షణము వెల్లబికే అతని ఉత్సుకత విద్యుదాఘాతాల వలె, ఏక కేంద్రక వర్తులాలవలె చుట్టూ వ్యాపిస్తూ ముసలితనం దేహానికేకాని మనసునకు కాదు, కాదు అని ఘంటాపథంగా ప్రకటించేది అతని జీవితంలోను మరణంలోను ఒక మహితత్వం ఆవిష్కృతమౌతుంది దైన్యవిహీన జీవనము అనాయాస మరణము ఈ రెండును అతని విశిష్ట జీవితానికి పరాకాష్ఠ

అతడు నయవర్తనుడు, సత్యవ్రతుడు, అజాతశత్రువు, సహనశీలి, త్యాగధనుడు, మృదుభాషి, నిరాడంబరుడు, నిగర్వి, భోజన ప్రియుడు, బహుజన ప్రియుడు, మెటి క్రీడాకారుడు, ధర్మపరాయణుడు, వినమ్రశీలి, విద్వత్కవి, విజ్ఞానఖని, ఉత్తమ ఉపాధ్యాయుడు, సద్విమర్శకుడు, దైవభక్తితత్పరుడు, అనవసర ప్రాచుర్య పరాక్ ముఖుడు, పరమసంతృప్తుడు, భార్యావిధేయుడు, ఆయన జీవితములో ఇట్టి సుగుణములకు నిరూపణాత్మకములైన ఎన్నో సంఘటనలున్నాయి అన్ని విధముల సమగ్ర జీవితాన్ని గడపిన మంచి మనీషి సాహిత్యమేరువనదగిన ధిషణాలంకార సంభార బ్రాహ్మీమయమూర్తి

ఒట్టిమాటలు కట్టిపెట్టి సాహితీ సదస్సు నిర్వహణ ద్వారా ప్రచురణముల ద్వారా ఉత్తమోత్తమ సాహిత్య సంప్రదాయాన్ని, సంస్కారాన్ని ఇదమిత్థమని ప్రాయోగికంగా నిర్దేశించిపోయిన మాననీయుడు శ్రీ వేంకట సుబ్బయ్య అతనికి అత్యంత అభిమాన పాత్రుడైన కవి తిక్కయజ్వ తిక్కన్న తన జీవన ధ్యేయాన్ని తెల్పుతూ "జననంబుఁ సఫలంబు జేసెద పునర్జన్మంబు లేకుండగన్" అన్నట్లు గానే శ్రీ వేంకట సుబ్బయ్య కూడా సమాజానికి సాహిత్యపరమైన సేవచేసి జన్మ సాఫల్యమును సార్థక్యమును పొందిన ధన్యజీవి అదర్శమూర్తి ఇతిశమ్!

---

(77వ పేజీ తరువాయి-కందుల ఓబుల రెడ్డి)

సభ్యులుగా ఎన్నికయ్యారు 1946మే నుండి 1951 వరకు పి సి సి ప్రదాన కార్యదర్శి బాధ్యతలను నిర్వర్తించారు 1951లో కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీని నెలకొల్పారు 1951లో కృషిక్ లోక్ పార్టీ (కె యల్ పి ) లో చేరారు 1955 మధ్యంతర ఎన్నికల్లో ఆంధ్ర శాసనసభకు సభ్యులుగా ఎన్నికయ్యారు 1956 మార్చి-నవంబరులో బెజవాడ గోపాల్ రెడ్డి మంత్రివర్గంలో వ్యవసాయం, అడవులు, పౌరసరఫరాలు, పశుసంవర్ధక శాఖ, మత్స్యశాఖామాత్యులుగా పదవీ బాధ్యతలు నిర్వర్తించారు 1962లో తిరిగి ఆంధ్రప్రదేశ్ శాసనసభకు ఎన్నికయ్యారు 1963లో ఎస్టిమేట్సు కమిటి ఛైర్మెన్‌గా నియమించబడ్డారు 1967-71 మధ్య ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయ మేనేజింగ్ కమిటి ఛైర్మెన్‌గా నియమించబడ్డారు 1972లోను, 1978లోను తిరిగి శాసనసభకు ఎన్నికయ్యారు 1978 మార్చి 10 నుండి 1980 అక్టోబరు 10వరకు డా మర్రి చెన్నారెడ్డి మంత్రివర్గం రాజీనామా చేసేవరకు నీటి పారుదల శాఖామాత్యులుగా పనిచేశారు తిరిగి టంగుటూరి అంజయ్య మంత్రి వర్గంలో 1980 అక్టోబరు 16న నియమింప బడి అదే శాఖకు ఆధిపత్యం వహించారు ఆ పిదప ఆంధ్రప్రదేశ్ రోడ్డు రవాణా సంస్థ అధ్యక్షులుగా పదవీ బాధ్యతలను చేపట్టారు ఇదే సమయంలో ఆంధ్రప్రదేశ్ స్వాతంత్ర్య సమరయోధుల సంస్థకు ప్రప్రథమ అధ్యక్షులుగా ఎన్నికై స్వాతంత్ర్య సమరయోధుల సంక్షేమానికి కృషి చేయటంతో పాటు విజయవాడలో స్వరాజ్య భవన్ నిర్మాణానికి అవసరమయ్యే స్థలాన్ని ఆర్ టి సి ద్వారా మంజూరు చేయించారు 1994లో స్వర్గస్థులైనారు

(గుణ్ణం వెంకట రెడ్డిగార్కి కృతజ్ఞతలతో)